భారతగ్రంథమాల  నం. ౭

# శ్రీమదాంధ్ర మహాభారతము

## విరాటపర్వము

గుంటూరుపట్టణోన్నతపాఠశాలాసంస్కృతోపాధ్యాయ
శ్రీ పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్య విరచిత

లఘుటీకావ్యాకరణవిశేషసహితము



ప్రకాశకుఁడు
చతుర్వేదుల పార్థసారథి







చందాదార్లకు రు 0-9-0    ఇతరులకు రు 0-12-0

  

## — గ్రంథ పరిశోధకులు —

1. శ్రీ వఝ్ఝ పూర్ణప్రజ్ఞాచార్యులుగారు,
   సంస్కృతోపాధ్యాయులు. టౌన్ హైస్కూలు గుంటూరు

2. కొలచలమల కృష్ణసోమయాజులుగారు,
   ఎం. ఏ, ఎల్. టి., టీచర్, టౌన్ హైస్కూలు గుంటూరు

3. పుచ్చా వరదరామకృష్ణయ్యగారు,
   ఎం. ఏ., లెక్చరర్, ఏ. సి కాలేజి గుంటూరు

  

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము.



## ద్వితీయాశ్వాసము.

సమాప్తము

శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము.

## విరాటపర్వము, ప్రథమాశ్వాసము.

---



యన గౌరి నాఁ బరఁగు ♦ 1చెల్వకుఁ జిత్తము పల్ల
వింప భ। ద్రాయితమూర్తియై హరిహ♦రం బగు రూ
పముదాల్చి విష్ణురూ। పాయ నమశ్శివాయ యని♦
పల్కెడుభక్తజనంబు వైదిక । ధ్యాయిత కిచ్చ
మెచ్చుపర ♦ తత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్. 1

—♦ కృతినిర్మాణప్రస్తావన. ♦—

అని సకలబ్రహ్మప్రార్థనంబు సేసి తత్ప్రసా2దాసాదితకవిత్వ తత్త్వనిరతిశయానుభావానందభరితాంతఃకరణుండ నగుచుండి యే నొక్కనాఁ డిట్లని వితర్కించితి. 2

విద్వత్సంస్తవనీయభవ్యకవితా ♦ వేషుండు విజ్ఞానసం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రకరసం♦భావ్యానుభావుండు గృ
ష్ణద్వైపాయనుఁ డర్థిలోకహితని♦ష్ఠం బూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్య 3మగులే♦ఖ్యం బైన యామ్నా
యము౯. 3

---

1. క. చెల్వల. 2. క. గ. దోదితకవిత్వ. 3. క. ఖ. మగునా♦యంబు లేఖ్యంబుగా౯.

క. వేదములకు నఖిల స్మృతి
వాదములకు బహుపురాణ ♦ వర్గంబులకున్
వా డైనచోటులను దా
మూదల ధర్మార్థకామ ♦ మోక్షస్థితికిన్. 4

వ. అదియును. 5

ఉ. ఆదరణీయసారవివి ♦ ధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణ♦సంభృత మై పెను పొంది [1]యుండ నం
దాదిఁ దొడంగి మూఁడుకృతు♦లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహి♦తాత్ముఁడు నన్నయ భట్టు
దక్షతన్. 6

మ. హృదయాహ్లాది చతుర్థ మూర్జితకథా♦పేతంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వ మట యు ♦ ద్యోగాదులుం
గూడఁగాఁ । బదియేనింటిఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబు
లై పెంపునం । దుది ముట్టఁ రచియించు టొప్పు బుధసం♦
తోషంబు [2]నిండారఁగన్. 7

క. అని రచనాకౌతుకమున
మన మలరఁగ నీప్రబంధ ♦ మండలి కధినా
థునిగా నేపురుషునిఁ జే
కొనువాఁడనొ యనుతలంపు ♦ గూరినమదితోన్. 8

వ. ఇంచుక నిద్రించుసమయంబున. 9

సీ. మజ్జనకుండు స ♦ న్మాన్యగౌతమగోత్ర
మహితుండు భాస్కర ♦ మంత్రితనయుఁ

1. చ. జ. యుండు. 2. క. గ. నిండారుటన్.

డన్నమాంబాపతి ♦ యనఘులు కేతన
మల్లన సిద్ధనా ♦ మాత్యవరుల
కూరిమితమ్ముండు ♦ గుంటూరువిభుఁడు కొ
మ్మనదండనాథుండు ♦ మధురకీర్తి
1 విస్తరస్ఫారుఁ డా ♦ పస్తంబసూత్ర ప
విత్రశీలుఁడు సాంగ ♦ వేదవేది

తే. యర్థిఁ గల వచ్చి వాత్సల్య ♦ మతిశయిల్ల
నస్మదీయప్రణామంబు ♦ నాదరించి
తుష్టి 2దీపించి కరుణార్ద్ర ♦ దృష్టిఁజూచి
యెలమి నిట్లని యానతి ♦ యిచ్చెనాకు.

వ. "కి మస్థిమాలాం కిము కౌస్తుభం వా, పరిష్క్రియాయాం బహుమన్యసేత్వమ్ । కిం కాలకూటః కిము వా యశోదా, స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే॥" యని నీవు దొల్లి రచియించినపద్యంబు గాఢాదరంబున నవధరించి భక్తవత్సలుండగు హరిహరనాథుండు నీదెస దయాళుండై యునికిం జేసి నిన్నుం గృతార్థునిఁజేయం గార్యార్థి యయి నాకలోకనివాసి యయిననాకుఁ దనదివ్యచిత్తంబునం గలయకారుణ్యంబు తెలుపం గెలుంగునట్టిశక్తిం బ్రసాదించి నన్ను నాకర్షించి కొలిపించికొని వీఁడె విజయం చేయుచున్నవాఁ డనుచుం జూపుటయు సవిశేషసంభ్రమసంభరితహృదయుండ నయి యవ్వేలనుం గనుంగొనునప్పుడు.

---

1. 'విస్తృతిస్ఫారుఁ'డని యుండిన సమంజసముగా నుండును. 2. చ. దీపించు.

సీ. కరుణారసము వొంగి ♦ తొరఁగెడుచాడ్పున
శశిరేఖ నమృతంబు ♦ జాలువాఱ
హరినీలపాత్రిక ♦ సురభిచందన మున్న
గతి నాభి ధవళపం ♦ కజము మెఱ
గుఱి యైన చెలువున ♦ 1నెఱసినలోకర
క్షణ 2మన గరళంబు ♦ చాయ దొ
బ్రథమాద్రిఁ దోఁతెంచు ♦ భానుబింబము నా న
రమ్మునఁ గౌస్తుభ ♦ రత్న మొప్ప
తే. సురనదియును గాళిందియు ♦ బెరసినట్లు
కాంతిపూరంబు శోభిల్ల ♦ శాంతమూర్తి
నాసనంబు నానందమ ♦ గ్నముఁగఁ జేయ
నెలమి సన్నిధి సేసె స ♦ ర్వేశ్వరుండు.

వ. ఏనును భక్తిమయం బగుసాష్టాంగదండప్రణామం
రించి కొండొక దొలంగి వినయావనతుండనై లలా
భాగంబున నంజలిపుటంబు ఘటించి నయనంబు
యవంబులును బ్రమదబాష్పసలిలవిలులితంబులును
పటలపరికలితంబులునుం గా నంతంత నిలిచిన నద్దేవు

క. అనుకంపాతిశయంబునఁ
దనదక్షిణనేత్రమును సు ♦ ధారోచియ కా
నను వింత లేక చూచి వ
దనమున దరహాసరసము ♦ దళుకొత్తంగన్.

1. ఖ. గ. మెఱపిన. 2. క. మనఁగ గళంబు ♦ చాయ.

శోభిల్లు.

ఉ. వైదికమార్గనిష్ఠ మగు ♦ వర్తనముం దగ నిర్వహించుచు
న్భేదము లేనిభక్తి మది ♦ నిర్మలవృత్తిఁగఁ జేయుచుండ మ
త్పాదనిరంతరస్మరణ ♦ తత్పరభావము కల్మి నాత్మ స
మ్మోదముఁ బొందఁ గావ్యరస ♦ముం గొనియాడుచు నుండు
దెప్పుడున్. 15

వ. అందును. 16

క. పారాశర్యునికృతి యయి
భారత మనుపేరఁ బరఁగు ♦ పంచమవేదం
బారాధ్యము జనులకుఁ ద
ద్గౌరవ మూహించి నీ వ ♦ ఖండిత[1]భక్తిన్. 17

తే. తెనుఁగు బాస వినిర్మింపఁ ♦ దివురు టరయ
భవ్యపురుషార్థతరుపక్వ ♦ ఫలము గాదె
దీని కెడ నియ్యకొని వేడ్క ♦ నూని కృతిప
తిత్వ మర్థించి వచ్చితిఁ ♦ దిక్కశర్మ. 18

వ. అనిన నద్దివ్యవచనామృతంబు నాయుల్లంబున వెల్లికొనినఁ బునఃపునఃప్రణామంబు లాచరించి యప్రమేయప్రభావ భావనాతీతుం డయ్యును నప్పరమేశ్వరుం డాశ్రితులకు నత్యంతసులభుం డని బుధులవలన వినియునికిం జేసి నను బోఁటి బాలస్వభావునకు నిట్టిమహనీయమహిమ దొరకొనుటయుం గలుగున కాక యని తలంచుచు నవ్విభునకు విన్నపంబు సేయువాఁడ నయి కొమ్మనామాత్యునాననం బాలోకించి తదనుమతి వడసి యిట్లంటి. 19

1. చ. జ. బుద్ధిన్.

క. భూరిభవత్కారుణ్య
క్షీరాంబుధి నాదుతుచ్ఛ ♦ చిత్తంబున వి
స్తార [1]మహితముగ నునిచితి
వారయ నచ్చెరువు గాదె ♦ యఖిలాండపతీ. 20

ఉ. ఇంతకు నేర్చునీకు నొక ♦ యింతటిలోన మదీయవాణి న
త్యంతవిభూతిఁ బెంపెసఁగు♦నట్టినినుం గొనియాడఁ జేత దా
నెంతటిపెద్ద నీకరుణ ♦ నిట్లు పదస్థుఁడ నైతి నింక జ
న్మాంతరదుఃఖముల్ దొలఁగు♦నట్లుగఁ జేసి సుఖాత్ముఁ
జేయవే. 21

వ. అని యుపలాలితుం డగుడింభకుండు దనకొలంది మెఱుం
గక మహాపదార్థంబు వేఁడువిధంబున బ్రహ్మానందస్థితిం
గోరి సర్వాంగాలింగిత మహీతలం బగునమస్కారంబు
సేసిన నజ్జగన్నాథుండు. 22

తే. జననమరణాదు లైనసం ♦ సారదురిత
ములకు నగపడ [2]కుండఁగఁ ♦ దొలఁగఁ దెరువు
గనువెలుంగు నీకిచ్చితి ♦ ననిన లేచి
నిలచి సంతోష మెద నిండ ♦ నెలవుకొనఁగ. 23

వ. మేలుకాంచి. 24

క. ఎలమియు నచ్చెరువును సరి
నెలసి [3]పొదలు మానసమున ♦ నెంతయుఁ బ్రొద్దేఁ

1. గ. ఘ. మహిమముగ. 2. క. జ. కుండుని ♦ మ్మలకుఁ దెరువు.
3. క. పొదువు. 4. చ. జ. సభక్తి.

గలలోనఁ గన్నచందము
దలఁచుచు నుండితిని భక్తి ♦ తాత్పర్యమునన్. 25

వ. తదనంతరంబ. 26

ఉ. ఇట్టిపదంబు గాంచి పర ♦ మేశ్వరునిం గృతినాథుఁ జేసి యే
పట్టునఁ బూజ్యమూర్తి యగు ♦ భారతసంహితఁ జెప్పఁ గంటి నా
పుట్టుఁ గృతార్థతం బొరసెఁ ♦ బుణ్యచరిత్రుఁడ నైతి నవ్విభుం
గట్టెదఁ బట్ట మప్రతిమ ♦ కారుణికత్వమహావిభూతికిన్. 27

ఉ. కూర్చుట నాత్మరత్నమున ♦ కుం గనకంబునకుం [1]దగున్ జనా
భ్యర్చిత మైనభారత మ ♦ పారకృపాపరతంత్రవృత్తిమైఁ
బేర్చిన దేవదేవునకుఁ ♦ బ్రీతిగ నిచ్చుట సర్వసిద్ధి నా
నేర్చినభంగిఁ జెప్పి వర ♦ ణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్. 28

వ. ఇది యనన్యసామాన్యాకారం బగుపరమధర్మప్రకారంబు 29

ఉ. కావున భారతామృతము ♦ కర్ణపుటంబుల నారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయు ♦ నట్లుగ సాత్యవతేయ[2]
సంస్మృతి । శ్రీవిభవాస్పదం బయిన ♦ చిత్తముతోడ మహా
కవిత్వదీ । క్షావిధి నొంది పద్యముల ♦ గద్యములన్ రచి
యించెదం గృతుల్. 30

వ. అని పూని యీదృశంబు లగుపుణ్యప్రబంధంబులు దేవ
సన్నిధిం బ్రశంసించుటయు నొక్కయారాధనవిశేషం బగు
టం జేసి. 31

---

1. గ. జ. దగన్. 2. క. ఖ. గ. సంస్కృతశ్రీవిభవాశ్రితం బయిన.

—♦ షష్ఠ్యంతములు. ♦—

క. ఓంకారవాచ్యునకు నన
హంకారనిరూఢభావ ♦ నారాధ్యునకుఁ
హ్రీంకారమయమనోజ్ఞా
లంకారోల్లాసనిత్య ♦ లాలిత్యునకున్. 32

క. త్రిభువనశుకదృఢపంజర
విభవమహితునకు సమస్త ♦ విష్టపనిర్మో
కభుజంగపతి కఖిలజగ
దభిన్నరూపునకు భావ ♦ నాతీతునకున్. 33

క. శ్రుతిసీమంతమణికి నా
శ్రితవాంఛాపూర్తికరణ ♦ చింతామణి కా
నతదురిత తమోద్యుమణికిఁ
గ్రతుభూషణమణికి లోక ♦ రక్షామణికిన్. 34

క. పరమశమ నిరతసంయమి
వరమానస[1]కుముదహాస ♦ వర్ధనచంచ
చ్ఛరణనఖచంద్రికావి
స్ఫురణాచిత్రప్రకార ♦ శోభాఢ్యునకున్. 35

క. హరిహరనాథునకు మరు
త్సరిదాకల్పితమనోజ్ఞ ♦ చరణశిరస్సుం
దరమూర్తికి భావనత
త్పరచేతోయుక్తభక్త ♦ పరతంత్రునకున్. 36

1. క. గ. చ. కమలహంస వర్తన.

—♦ కథాప్రారంభము. ♦—

వ. ఏను విన్నపంబు సేయు తెఱంగుగా నంతస్సన్నిధిం గలిగించు
కొని [1]యమ్మహాకావ్యంబు నర్థంబు సంగతంబు సేసెద. 37

క. శరణాగత సంశ్రితభయ
హరణా సురనికరశేఖ ♦ రానర్ఘమణి
స్ఫురణా పరిచయరంజిత
చరణా వనమాలికా భు ♦ జంగాభరణా. 38

క. అజగవశార్ఙ్గాలంకృత
భుజగర్వనిరస్తదైత్య ♦ భూమస్తుత్యా
త్రిజగద్ధారణనిత్యా
భుజగసమాచరితశయన ♦ భూమణకృత్యా. 39

క. జలనిధిహిమవద్భూభర
కలితజనన కేళికౌతు ♦ కవ్యక్త్యావ్య
క్తలలితసౌందర్యస్ఫుర
దలఘుతనుస్త్రీసనాథ ♦ హరిహరనాథా. 40

వ. దేవా దివ్యచిత్తంబున నవధరింపుము. 41

ఆ. కథ జగత్ప్రసిద్ధ ♦ గావునఁ బూర్వప
ర్యార్థయుక్తి సేయు ♦ నట్టియెడల
యత్నమించుకంత ♦ యయినను వలవదు
వలసినట్లు సెప్ప ♦ వచ్చి యుండు. 42

వ. మహాభారతంబు సమస్తదురితాపహంబును నభిమతశుభావ
హంబునుం గావున నొక్క మహాఫలంబుగోరి జనమేజ

---

4. గ. జ. యమ్మహావాక్యంబు.

యుండు గృష్ణద్వైపాయనమహామునికారుణ్యంబు వడసి తదీయప్రియశిష్యుం డయిన వైశంపాయనువలన వినినకథ యగుటం జేసి తత్ప్రకారంబు నడపెద నదియె ట్లనినం బరమపవిత్రు లగుపాండుపుత్రులచరిత్రం బుపాఖ్యానసహితంబుగా వ్యాఖ్యానంబు సేయుచుండ వారలవనవాససమ్యగనుష్ఠానంబు సవిస్తరంబుగా విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. 43

చ. మహితసముజ్జ్వలాకృతులు ♦ మానధనుల్ జనమాన్యులంగనా । సహితము గాఁగ నేమిగతి ♦ సమ్యగుపాయనిగూఢవృత్తిమై । సహితుల కప్రభేద్య మగు ♦ నాపదమూఁడగునేఁడు మత్పితా । మహులు చరించి రంతయుఁ గ్ర ♦ మంబున నా కెఱుఁగంగఁ జెప్పుమా. 44

క. అని యడిగిన వైశంపా
యనుఁ డమ్మనుజేంద్ర చంద్రు ♦ నధికౌత్సుక్యం
బునకలిమికిఁ దనహృదయం
బున గాఢాదరము భరిత ♦ ముగనిట్లనియెన్. 45

వ. పాండవులు వనవాసంబు సముచితంబుగాఁ జలిపి పండ్రెండగు నేఁటికడపటఁ దమకు ధర్మదేవతాసమాగమం బయినం దత్ప్రసాదంబున నజ్ఞాతవాసంబునకు భంగంబు గాకుండ వరంబువడసి యంతకు మున్ను తమ వెనుక నడవులం దిరుగుచు నగ్నిహోత్రంబులఁ దోడన కొని వత్తిల్లుభూసురోత్తములు దమ్ముం బరివేష్టించి యుండఁ దా రనుష్ఠింపం

బూనినపనివారల కెఱింగింపం దలంచి కరంబులు మొగిచి సవినయంబుగా ని ట్లనిరి. 46

సీ. తెల్లంబు గాదె మీ ♦ కెల్ల సుయోధను
చేసినకుటిలవి ♦ చేష్టితంబు
లకట మాతో మీరు ♦ నడవుల నిడుమలఁ
బొందితి రోకభంగిఁ ♦ బోయెఁగాల
మిది పదమూఁడగు ♦ నేఁడు మా కజ్ఞాత
వాసంబు సలుపంగ ♦ వలయు నిందు
ధార్తరాష్ట్రులు సూత ♦ తనయసౌబలులును
జెఱుపన వేతురు ♦ 1చిన్నసన్న

ఆ. యెఱిఁగిరేని జాల ♦ నెగ్గువాటిల్లు న
ట్లగుట మమ్ము నింక ♦ నతిరహస్య
వృత్తిమై నిరస్త ♦ విఘ్నుల రై చరి
యింపుఁ డని యనుగ్ర ♦ హింపవలయు. 47

వ. అని చెప్పి రట్టిసమయంబున ధర్మనందనుండు విషణ్ణహృద యుండై. 48

క. ఒకనాఁ డేమును నాపద
లకు విడుమరఁ గాంచి విప్రు ♦ లం జుట్టలఁ బె
ట్టుకొనిసుఖ ముండఁ బడయుదు
మొకొ యిప్పా టెందుఁ గలదె ♦ యొరు లెవ్వరికిన్. 49

వ. అని డగ్గుత్తిక పెట్టి దుఃఖపరవశుం డగుటయు నమ్మహీసుర వరులుం దమ్ములు నతని నాశ్వాసించు చుండఁ దత్పౌర్వ్యాం

1. చ. చిన్నిసన్న.

బున నున్నధౌమ్యుండు దదీయవిషాదాపనోదంబు సేయం
దలంచి యి ట్లనియె. 50

—♦ ధౌమ్యుఁడు పాండవుల నూరార్చుట. ♦—

ఉ. ధర్మనిరూపకత్వమున ♦ ధైర్యమునన్ మహనీయవృత్తి స
త్కర్మవిధిజ్ఞతం జతుర ♦ తామహిమన్ దృఢబుద్ధి నెవ్వరున్
ధర్మజుపాటి గా రనఁగ ♦ ధాత్రిఁ బ్రసిద్ధుఁడ వైనయట్టినీ
పేర్మికి నీడె దుర్దశల ♦ పెల్లునకున్ [1]దురపిల్లు టారయన్.

వ. అట్లుం గాక. 52

క. దేవతల కైన నోకో
చో వలయున కాదె శత్రు ♦ సూదనవిధికా
లావాప్తికి మును దమస
[2]ద్భావంబు లడంచి యుడుగఁ ♦ బడి యుండంగన్. 53

సీ. నిషధాద్రియం దని ♦ మిషపతి ప్రచ్ఛన్న
సంచరణమున వ ♦ ర్తించుటయును
నదితిగర్భంబున ♦ నవతార మై వామ
నాకారమున హరి ♦ యడఁగుటయును
జననియూరుప్రదే ♦ శంబున నతినిగూ
ఢంబుగా నౌర్వుండు ♦ డాఁగుటయును
ధేనుశరీరవిలీనుఁడై ♦ యజ్ఞాత
చర్య మార్తాండుండు ♦ సలుపుటయును

1. 'దురుపిల్లు' అని వ్రా. ప్ర. 2. క.గ. ద్భావము లఢఁచి ? వి
యొదిఁగి పడి.

ఆ. వినమె యిట్లు పడిన ♦ పీరలు పదపడి
తమకు నగ్గమైన ♦ తఱి జయింప
రెట్లు 1ప్రబలి రిపుల ♦ నీవును నాపద,
కోర్చి భంగపాటు ♦ దీర్చుకొనుము. 54

క. అనవుడు నప్పలుకులు విని
తనచిత్తముకలఁక దేఱి ♦ ధర్మతనూజుం
డనుజన్ములదెసఁ జూచిన
ననిలసుతుం డిట్లు లనియె ♦ నాతనితోడన్. 55

మ. భవదాజ్ఞాదృఢబంధసంయమితశుం ♦ భద్వేగమై కాక నాఁ
డవలీలన్ మనయర్జునద్విపము క్రో ♦ ధావేశదుర్దాంతద
ర్పవిలాసోద్భటభంగి నే పడరి కౌ ♦ రవ్యాంబుజశ్రేణిఁ జి
క్కువడంజేయదెయొక్క ప్రేల్మిడిననీ ♦ కున్ వేడ్కసంధిల్లఁగన్

వ. అనిన విని ధర్మనందనుండు దెలివొందిన మొగంబుతోడ శిరఃకంపంబు సేసె నట్టిసమయంబున నవ్విప్రులందఱు నొక్క మొగిన మీతలంపునకు దైవం బనుకూలంబు గావుత మని పాండుపుత్రుల దీవించి పునర్దర్శనం బయ్యెడు మనుచు వీడ్కొని నిజస్థానంబులకుం జనిరి తదనంతరంబ బాహ్యపరివారం బెల్లను సముచితప్రకారంబున వీడుకోలు వడసి తమతమపొందుపట్లకుం బోయిన. 57

ఉ. తమ్ములు ధౌమ్యుఁడున్ సతియుఁ ♦ దా నరదంబులతోడఁ
గ్రోశమా । త్ర మొక్కచోటి కల్లఁ జని ♦ ధర్మతనూభవుఁ
డందు నాఁటిరే । యిమ్ములఁ జల్ప వేగుటయు ♦ నీప్సిత

1. క. ప్రబల.

కార్యము సేయఁగా విచా । రమ్మైన నున్నచో నమర ♦
రాజతనూభవుఁ జూచి యి ట్లనుసన్. 58

క. మన మొకయేవుర మీాయం
గనయుం దో నరుగుదేరఁ ♦ గా నెయ్యెడఁ బో
యిన నెఱుఁగ కుండుదు రె యి
ద్దినములు గడపంగ నెద్ది ♦ దెఱఁ గయ్యెడినో. 59

వ. అనిన నతం డిట్లనియె. 60

తే. ధర్మదేవత నీదుస♦త్కర్మమునకు
మెచ్చి యొంతయుఁ బ్రీతిమై ♦ నిచ్చినట్టి
వరము గలుగంగ మనమేమి ♦ వర్తనమున
నెచటనున్నను నొరులకు ♦ నెఱుఁగనగునె. 61

వ. కురుజనపదంబుచుట్టుం బాంచాల చేది మత్స్యసాళ్వవిదేహ బాహ్లీక దశార్ణ శూరసేన కళింగ మగధదేశంబులు సుభిక్షంబులు జనాకీర్ణంబులు నతిస్థిరంబులునై నివాస యోగ్యత గలిగి యున్నయవి యని విందుము వానియందు మీాకుం జూడం బోలినయెడఁ దగినచందంబున నిలుచు వారము గాక యనినం బ్రియంబాది ధర్మనందనుం డిట్లనియె. 62

క. అగు నది యట్టిద దైవము
దగ నిచ్చిన యవ్వరంబు ♦ దప్పునె మనకుఁ
విగతభయవాసయోగ్యం
బుగ నొక్కెడ సెప్పుఁ డిపుడ ♦ పోవఁగ వలయున్. 63

ఆ. నాకుఁ జూడ మత్స్య ♦ నరపతి సద్ధర్మ
వర్తి సుజనహితుఁడ ♦ వార్యబాహు
బలుఁడు గాన యతని ♦ పాల నందఱుఁ దగ
వైనపనుల నిలుచు ♦ టభిమతంబు. 64

—♦ పాంచాలీపాండవులు దమ మెలంగవలయుపనుల నిశ్చయించికొనుట. ♦—

క. మనలోన నెవ్వఁ డెమ్మెయి
పని వెంటను విరటుమనము ♦ వడయుద మది యె
ల్లను నేర్పరించి యందఱుఁ
దనతనమది నున్న తెఱఁగు ♦ తథ్యమ చెప్పుఁడా. 65

వ. అనిన విని సవ్యసాచి సవితర్కంబును సవిషాదంబును సగౌర
వంబునుం గా నతని నుపలక్షించుచు నిట్లనియె. 66

సీ. మహనీయమూర్తియు ♦ మానవైభవమును
సౌకుమార్యంబును ♦ 1సరళతయును
మార్దవంబుఁ బ్రభుత్వ ♦ మహిమయు నపగత
కల్మషత్వంబును ♦ గౌరవంబు
2శాంతియు దాంతియుఁ ♦ జాగంబు భోగంబుఁ
గారుణ్యమును సత్య ♦ సారతయును
ధర్మమయక్రియా ♦ తత్పరత్వంబును
గీర్తిధనార్జన ♦ క్రీడనంబుఁ

ఆ. గలిగి జనుల నేలఁ ♦ గాని యెన్నండును
నొరులఁ గొల్చి తిరుగ ♦ వెరవు లేని

1. చే. సరసతయును. 2. క. గ. దాంతి...త్యాగంబు.

యట్టిసీవు విరటు ♦ నెట్టిచందంబున
ననుచరించువాఁడ ♦ వధిప చెపుమ.

క. అనినం దమ్మునినెమ్మన
మునఁ బుట్టినవగవు భావ ♦ మున నెఱిఁగియు
టునఁ బుచ్చుచుఁ బ్రస్తుతకా
ర్యనిరూపణదశయ మెఱయ ♦ నతఁ డిట్లనియె

క. సన్న్యాసివేషమున రా
జన్యునిఁ గని యెపుడుఁ గొలిచి ♦ సభ్యత్వమున
మాన్యుఁడ నై పుణ్యకథా
విన్యాస మొనర్తు నతని ♦ వేడుకకుఁ దగన్.

క. శ్రౌతస్మార్తనిమిత్త
జ్యోతిర్విద్యలు వహించి ♦ యోగ్యసమయసం
జాతప్రాగల్భ్యుఁడ నై
చాతుర్యము మెఱసి మాన ♦ సం బలరింతున్.

క. ఆతనితో నాకొక్కకమఱి
కౌతూహలవృత్తికిం ద ♦ గం దొడఁగి మృదు
ద్యూతంబునఁ గ్రీడింతుం
జేతోముద మొదవ నక్ష ♦ శిల్పప్రౌఢిన్.

తే. మణిమయమ్ములుఁగల ధౌత ♦ మయములును
వర్ణమయములు నాదిగా ♦ వలయునట్టి
యడ్డసాళులు గలవు నా ♦ కభిమతముగ
వానిఁ గొనిపోయి చూపుదు ♦ వరుసతోడ.

వ. మఱియు నవసరోచితంబులగు వినోదంబులం బ్రమోదంబు
పుట్టించుచుఁ బ్రసాదంబునకుం బాత్రుండనై కంకుం డను
నామధేయంబు ధరియించి చరియింతు నయ్యుర్వీశ్వరుండు
మత్పూర్వవర్తనం బడిగెనేనియు ధర్మపుత్త్రుతోడి మైత్రిం
దగిలి యతని పాల వసియింతు ననం గలవాఁడ నని చెప్పి
యనిలతనయు నిరీక్షించి తత్కాలజనితం బయిన ఖేదంబు
నం దొరఁగ నమకట్టు బాష్పజలంబులు మగుడ నింకించుచు
నిట్టూర్పు లడంచి ధైర్యం బవలంబించి యి ట్లనియె. 73

సీ. కడిమిమై సౌగంధి ♦ కమున యక్షులమద
మడఁచి కృష్ణకుఁబువ్వు ♦ లట్లు దెచ్చెఁ
గిమ్మీరదానవు ♦ నమ్మాయ నిర్జించి
విగతకంటకముఁ గా ♦ వించె వనము
బకదైత్యుఁ దొడరి యా ♦ భంగి రూపఱఁ జేసి
రక్షించె 1నేక చ ♦ క్రాపురంబు
నప్పాటఁ బ్రబలు జ ♦ టాసురు నడరి దం
డితుఁ జేసి మనలఁ బె ♦ ట్టించుకొనియె

తే. నితఁడు పుట్టినకోలెను ♦ నెసగ మెసఁగు
దర్పమునన వర్తిల్లును ♦ దగ్రహృదయుఁ
డకట యొరు చిత్తమున కెక్క ♦ నట్లుగాఁగ
మెలఁగి యేమివిధంబునఁ ♦ గొలుచువాఁడు. 74

వ. అనిన విని భీమసేనుం డి ట్లనియె. 75

---

1. క. ఇట 'ఏకచక్రా' అని మూలమందుంబోలె స్త్రీలింగముగా నున్నది. ఆదిపర్వమున 'ఏకచక్రంబునవారు' లని యన్యలింగముగా నున్నది.

తే. ఏను వంటలవాఁడ నై ♦ యా నరేంద్రుఁ
గొలిచి కరకరగాఁ గూడు ♦ గూర చిత్త
మునకు వచ్చినచందంబు ♦ నన యొనర్చి
నేర్చి మెలఁగుదుఁ గరము వి ♦ నీతి మెఱసి. 76

ఉ. ఆఱురసంబులం జవుల ♦ యందలి క్రొత్తలు పుట్టనిచ్చలుఙ్
వేఱొకభంగిఁ బాకములు ♦ విన్నను వొప్పఁగఁ జేసి చేసి న
[1]న్నిమ్మఱఁగ బానసీని నొక ♦ నిం బురిఁ గానని యట్లుగాఁగ మేఙ్
గాఱియ వెట్టి యైన నొడి ♦ కంబుగ వండుదు నెల్లఁగూరలున్.

తే. పఱియవాపంగఁ దునియఁగా ♦ విఱువవలయు
నెడలఁ గాళ్లలఁ జేతులఁ ♦ దొడలఁబట్టి
కడఁగి మనువుగఁ జేసి [2]ప్రా ♦ య్యెడుదుఁగాని
కత్తి గొడ్డలి యడుగనేఁ ♦ గట్టియలకు. 78

క. సూపాధ్యక్షుఁడు గలిగిన
నాపురుషునితోడ సఖ్య ♦ మగునట్లుగ నే
నేపాట నైన నడవఁగ
నోపుదుఁ దత్తద్విధప్ర ♦ యోగముల మెయిన్. 79

వ. అట్లుం గాక. 80

తే. జెట్టితండంబుతోడఁ జే ♦ పట్టి హస్తాంత
కారి విఱిచినయట్లు న ♦ గ్గలిక విఱుతు
లాఁగు వేగంబు మెఱసి బ ♦ లంబు నెఱపి
మల్లుతనమున మెప్పింతు ♦ మనుజవిభుని. 81

---

1. చ. జ. నిమ్మళినబానసీ నొకరు♦నిం. 2. 'ప్రాయ్యెడుదు'నను చో సప్తమి కిఁ బ్రథమ రాదు. ఇది భాషాశైలి గానోపు. 'ప్రోవిడుదు' నని యచ్చుప్రతులు.

క. పెక్కండ్ర నొక్కపోరను
నుక్కఱ భంజింతుఁ జంపు ♦ టుడుగుదు రాజా
దక్కటిచూపఱు లెంతయు
వెక్కసపడఁ జిత్రగతుల ♦ విహరింతుఁ దగన్. 82

చ. అదియునుగాక కోలుపులి ♦ నైనను గారెనుపోతు నైనను
న్మదకరి నైన నుగ్రమృగ ♦ నాథుని నైనను గిట్టి ముట్టిబె
ట్టిదముగఁ గాలఁ గేలను గ ♦ డిందిమగంటిమి యుల్లసిల్లఁ బ
ట్టుదు నడఁగంగ మాత్స్యుఁడు గ ♦ డున్ వెఱఁ గందుచు
బిచ్చలింపఁగన్. 83

వ. ఇట్లు నానాప్రకారంబుల నతనిమనంబు వడయుదు వలలుం
డనుసమాఖ్య వహింతు నమ్మహీపతి నీ వెవ్వరివాఁడ వని
యడిగెనేనిఁ బాండవాగ్రజునకు బానసంబు సేయుదు నసం
గలవాఁడ ననిన విని ధర్మజుం డమ్మెయికి సమ్మతించి బీ
భత్సు వీక్షించి ఘూర్ణమాననమానసుండగుచు నిట్లనియె.

ఉ. ఖాండవ మేర్చి దేవతలుఁ ♦ గానని యీశ్వరుఁ గాంచె
దోర్బలో । ద్దండమహాసుర ప్రతతి ♦ దర్ప మడంచి ప్రియం
బొనర్చె యా । ఖండలుఁ డున్నగద్దియ స ♦ గంబున నుండె
మహానుభావుఁ డీ । తం డొకమత్స్యుఁ జేరి యను ♦ దాత్తత
నిమ్మెయిఁ గొల్చువాఁడొకో. 85

క. అనుమాటలు విని సంక్రం
దననందనుఁ డిట్టు లనియె ♦ దైవంబుకతం
బున నాకు నొక్కచందం
బను నైయున్నయది దీని ♦ నోఁగా దనుఁడా. 86

వ. అమరనగరంబున నరిగినయెడ నూర్వశి నన్ను నపుంసకుంగా శపియించిన నాకు నాకేశుండు గరుణించి యీ శాపఫలంబు భవదజ్ఞాతవాసవత్సరంబున ననుభవించి తదనంతరంబ శాపమోక్షంబు వడయుమని దీవించెం గావునఁ బేడితనంబు దాల్చి బాహాదీర్ఘత్వంబునకు గుణకిణంబులకుఁ గంచుకంబును శంఖవలయంబులును మాటు సేసికొని విరాటుకడకుం జని. 87

క. ఉత్తమ కన్యాజనులకు
నృత్తము గఱపంగ నాకు ♦ నేర్పు గలదు త
ద్వృత్తమునకు నన్నేలుము
చిత్తమునకు నెక్కఁ బనులు ♦ సేసెదనందున్. 88

కం. అని కొలిచి యే బృహన్నల
యను నామముతోడఁ గన్య ♦ కాంతఃపుర[1]వ
ర్తన మొనరించుచు లాసిక
తనమున నిపుణుండనై ♦ యతని మెచ్చింతున్. 89

క. మానవపతి నన్నెక్కడి
దానవు నీ వనియె నేని ♦ ద్రోపదికడ స
మ్మానంబు వడసి మెలఁగుదు
నానగళుల నృత్యగురువ ♦ ననఁ గలవాఁడన్. 90

తే. అనిన నిది వోలు నని యియ్య ♦ కొని యజాత
వైరి యల్లన నకులుని ♦ వలను సూచి

1. క. నర్తనము.

నెమ్మనంబున నుమ్మలి ♦ కమ్ము గదుర
నెలుఁగుచందంబు వేఱుగా ♦ నిట్టు లనియె. 91

ఉ. ఒప్పెదుమేనుఁ బెంపుగల ♦ యుల్లము నాగరికంపుఁజందముం
జెప్పక చూప కీతని వి ♦ శేషముఁ దెల్పెడుఁ గొల్వు కెంత
యుఁ । డెప్పర మేమి సేయుదుఁ గ ♦ డింది విచారము
పుట్టె నెట్లితం । డప్పురి సంచరించునొకో ♦ యన్యు లెఱుం
గక యుండునట్లుగన్. 92

వ. అనిన నప్పలుకులకు నకులుం డి ట్లనియె. 93

ఆ. అశ్వశిక్షకుండ ♦ నై మత్స్యభూవిభుఁ
గొలుచువాఁడ గుఱ్ఱ ♦ ములకు వలయు
తెఱఁగు లెల్లఁ జాల ♦ నెఱుఁగుదు రూపుగా
నరయ నేర్తువాని ♦ ననుదినంబు. 94

సీ. గోడిగజాతిలోఁ ♦ గొదమవెంటుల నేర్చి
మావుల హత్తించు ♦ మార్దవంబుఁ
[1]ద్రాళ్లఁ బట్టింపంగఁ ♦ దఱి యైనకొదమల
సంచంబు లెఱిఁగి శి ♦ క్షించు నేర్పుఁ
[2]గళ్యాలఁ బదిలంబు ♦ గానిగుఱ్ఱంబులఁ
గొత్తముట్టున కియ్య ♦ కొలుపువెరవుఁ
బెనఁగుశూకలముల ♦ బెదరుదుతనంబులఁ
జలము డింపక తీర్పఁ ♦ జాలుటయును

1. క. గ. ద్రాళ్లను బట్టంగ...నంచు లెఱింగి. 2. ఖ. గ. జ. గళ్లెల.
3. చ. బెదరుదుతనంబున.

తే. నలవరించిన వాఁడలా ♦ యమునయున్న
యప్పుడు¹దొడ కించుకయు లేని ♦ యట్లుగాఁగ
మాటిమాటికిఁ బరికించి ♦ మందడీల
కెల్లనూఱట యగుచు వ ♦ ర్తిల్ల నేర్చు. 95

క. దామగ్రంథి యనఁగ నొక
నామము వెట్టుకొనువాఁడ ♦ నాతొంటివిధం
బామను జేశ్వరుఁ డడిగిన
నే మీకడవాఁడ నందు ♦ నిది దెలుఁ గధిపా. 96

క. అనినఁ గడు లెస్స యని నె
మ్మనమున నూఱడి విభుం డమానుష తేజో
ధనుఁ డగుసహదేవుఁ గనుం
గొని యిట్లను వగలు మిగిలి ♦ కొందలపఱుపన్. 97

చ. అకుటిలుఁ డార్యసమ్మతుఁడ♦హంకృతిదూరుఁడు నీతినిర్మలా
త్మకుఁ డనవద్యశీలుఁడు స ♦ ధర్ముఁడు దాంతుఁడు గొంతి
ముద్దుసే। యుకొడుకు మేను లేఁత దన♦యుల్లము మెత్తన
యిట్టియాతఁ డె। ట్లొకొ యొరు నాశ్రయించు విధి ♦
యోపదె యెవ్వరి నెట్లు సేయఁగన్. 98

క. అనుడు నతఁడు దనచిత్తం
బునఁ దోఁచినవిధము ధర్మ ♦ పుత్రునితో ని
ట్లని చెప్పె నాతనికిఁ బు
ట్టినయుత్తలపాటు గొంత ♦ డిందుపడంగన్. 99

1. చ. జ. దొసఁగు.

క. కీలారితనమునకు నేఁ
జాలుదు నని కొలిచి మత్స్య ♦ జనపాలుకడక్
మే లగునడవడిఁ దంత్రీ
పాలుం డనుపేరితోడఁ ♦ బరఁగుదు నధిప. 100

సీ. వంజల నైనను ♦ వల నేర్పడఁగ నొక
భంగిఁ జేపఁగఁ జేసి ♦ పాఁడి గొనఁగ
బడుగుల నైనను ♦ బాటించి పరికించి
గోమున మైఁ గండ ♦ క్రొవ్వు దేలఁ
దెవులుగొంటుల నైనఁ ♦ దేర్చు సంకటమున
గోల్పి ముందటియట్ల ♦ రూపు సేయ
[1]నట్టుల నైనను నలు వైనవెరవున
ముట్టె యంటఁగఁ బట్టి ♦ కట్టి విడువఁ

ఆ. బిడుకఁ గదుపు సేర్చ ♦ బెదరు వాపఁగ నీరు
మేపు గలుగు నెడకు ♦ మెలఁగ వెలువ
[2]మృగము నరయ ముచ్చు ♦ రేవగలును గొట్ట
నేర్తుఁ బసికిఁ జాల ♦ గూర్తు నేను. 101

వ. నన్ను విరాటుండు మున్ను నీ వెం దుండు దని నిరూపించె
నేని యుధిష్ఠిరుగోష్ఠంబుల కధిష్ఠాతనై యుండుదు నని యెద
నని పలికినఁ గౌంతేయాగ్రజుం డిదియు క్తంబగునని యను
మతిసేసి పాంచాలి నాలోకించి ఖిన్నాంతఃకరణుం డగుచు
ని ట్లనియె. 102

1. ఖ. ఘ. నఱవల నైనను ♦ నలవున వెరవున. 2. క. మెకము... మెల
గిన వెలకొట్టి.

చ. ఇది గడుముద్దరాలు పను ♦ లేమియుఁ జేయఁగ నే
దెంతయుణ్ | మృదువొకకీడుపాటునకు ♦ మేకొనఁ జా
దుదాత్తచిత్త యొం | టి దిరుగుదాని కోర్వ దొక ♦ టె
దను 1దా నవరించుచో ప్పెఱుం | గదు తగ నొండులా
గొలువఁ ♦ గా వెర వెమ్మెయిఁ గల్గునక్కటా. 10

క. అనిన నతనిచిత్తంబున
వెనుఁబాటంతయును బాయు ♦ వెరవుకలిమి యె
ల్లను దెలియునట్లుగా ని
ట్లనియెం బాంచాలి యుచిత ♦ మగుచందమునన్. 104

క. సైరంధ్రీవేషంబునఁ
జేరుదు నంతఃపురంబు ♦ చెంతకు న న్నా
భూరమణు దేవి యెంతయు
గారవమునఁ బిలువ నంపఁ ♦ 2గా వినయమునన్. 105

క. కని కొలువు సేసికొని మా
లిని నాఁ జని సాధ్వి యిది మ♦లీమసవృత్తం
బునఁబొంతఁ బోవ దెన్నఁడు
నను వ్రేఁకఁదనంబు దోఁచు ♦ నట్లు చరింతున్. 106

సీ. కలపంబు లభినవ ♦ గంధంబులుగఁ గూర్చి
తనువున నలఁదుదు ♦ ననువు గాఁగ
మృగమదపంకంబు ♦ మృదువుగా సారించి
తిలకంబు వెట్టుదుఁ ♦ జెలువు మిగులఁ.

1. క. దాన వరించు. 2. ఖ. జ. గాఁ గందుఁ దగన్.

బువ్వులు బహువిధం ♦ బులఁ గట్టి ముడి కొక్క
భంగిగా నెత్తులు ♦ వట్టి యుత్తు
హారముల్ మెఱయ నొ ♦ య్యారంబుగా గ్రుచ్చి
1యందంబు వింతగా ♦ నలవరింతు

ఆ. వివిధశిల్పములఁ బ్ర ♦ వీణనై మఱియును
వలయుపనులవెంట ♦ మెలఁగ నేర్తు
మత్స్యరాజమహిషి ♦ మనమున మక్కువ
నెలకొనంగ నిట్లు ♦ గొలువ నేర్తు. 107

క. మును నీ వెచ్చో నిలు తే
పనిమెయి వర్తిల్లు దనినఁ ♦ బాంచాలికి నే
ననుచారిణి నై తగఁ బం
చిన గరువపుఁ బనులు నేర్చి ♦ చేయుదు నందున్. 108

వ. అనవుఁడు ధర్మనందనుండు ద్రుపదనందన కిట్లనియె. 109

క. మనవంశంబున వృత్తం
బును బెంపును గానఁ జాలు ♦ పుణ్యసతివి దు
ర్జను లగుతులువల తలఁపులు
గనుఁగొని యేమఱక మెలఁగఁ ♦ గావలయుఁజుమీ.

వ. అనిన విని యాజ్ఞసేని యనాదరమందస్మితసుందరవదనార
వింద యయి యతని కిట్లనియె. 111

క. ఆరయ నెందును గౌరవ
భారం బెడలంగ నీక ♦ పాతివ్రత్యా

---

1. క. యందంద వింతఁగా.

చారములై వర్తింతురు
సైరంధ్రీ జాతివారు ♦ సౌజన్యమునన్. 112

క. కావున నుచితము లగు నా
కావెంటం గొలిచి తిరుగు ♦ నప్పుడు మితభా
షావిరచనమును వ్రతసం
భావనమును గౌరవంబుఁ ♦ బాపభయంబున్. 113

క. అని చెప్పిన విని యగుఁ బొ
మ్మని కైకొని ధర్మతనయుఁ డందఱమును ని
ట్లనపాయత వర్తిల్లుద
మని తమ్ములతోడ నిశ్చ ♦ యంబుగఁ బలికెన్. 114

వ. ఇవ్విధంబునఁ గార్యంబు నిర్ణయించి మనయగ్నిహోత్రంబుల నెల్ల ధౌమ్యులు రక్షించువారు వంటలవారును మహాన సాధ్యక్షులును పాంచాలీపరిచారికలును ద్రుపదుపురంబున నిలుచువారు రథంబులు గొని యింద్రసేనాదులైన సారథులు ద్వారకానగరంబున కరుగువారు వీ రెల్లను దమ్మెవ్వ రైనను మనవార్తలడిగి రేని ద్వైతవనంబున మమ్ము విడిచి పోయిరట యెఱుంగ మనం గలవా రని చెప్పి యిత్తెఱంగున నభ్యంతరపరివారంబు నెల్ల నియోగించి వీడుకొలిపి నయ్యవసరంబున ధౌమ్యుండు పాండుకుమారుల కిట్లనియె.

—♦ ధౌమ్యుఁడు పాండవులకు సేవాధర్మంబు లెఱింగించుట. ♦—

క. ఎఱిఁగెడువారికి నైనను
గఱపక తక్క రుచితప్ర ♦ కారము శుభముఁ

గొఱలు హితు ల ట్లగుట నం
దఱకును జెప్పంగ వలయుఁ ♦ దగియెడుబుద్ధుల్. 116

వ. అదియునుం గాక. 117

తే. కౌరవాన్వయజాతు లై ♦ గారవమునఁ
బెఱిఁగినట్టిమీ రొండొక ♦ నరునిఁ గొలిచి
మసలి వర్తిల్లి మానావ ♦ మానములకు
నోర్చి యడఁకువతోడన ♦ యునికి యరిది. 118

క. వాలి వివిధాస్త్రశస్త్ర
జ్వాలల వెలుఁ గొందుపాండ ♦ వజ్వలనం బా
భీలత మండం దొడరినఁ
1గాలవిరోధంబు మఱచి ♦ కార్యముఁ దప్పన్. 119

వ. కావున మీకు నప్రమాదార్థంబుగా నానేర్చినవిధంబున నుపదేశం బవశ్య కర్తవ్యంబు రాజులం గొలిచి యెమ్మెయి నయినను బ్రదుకుజనఁబులు గీడునుం 2బొరయ కుండునట్టి సాధారణనీతి సంక్షేపరూపంబున నెఱింగించెద సావధానుల రయి వినుండు. 120

క. తగఁ జొచ్చి తనకు నర్హం
బగునెడఁ, గూర్చుండి రూప ♦ మవికృత వేషం
బుగ సమయ మెఱిఁగి కొలిచిన
జగతీవల్లభున కతఁడు ♦ సమ్మాన్యుఁడగున్. 121

క. నరనాథుఁ గొలిచి యలవడఁ
దిరిగితి నా కేమి యనుచుఁ ♦ దేఁకువ లేమిన్

1. అ. గ్రాలువిరోధంబు నుచిత కార్య. 2. గ. జ. దొడరకుండు.

మరియాద దప్పి మెలఁగినఁ
బురుషార్థంబునకు హాని ♦ పుట్టక యున్నే. 122

ఉ. రాజగృహంబుకంటె నభి ♦ రామముగా నిలు గట్టఁ గూడ దే
యోజ నృపాలుఁ డాకృతికి ♦ నొ ప్పగువేషము లాచ
రించు నే। యోజ విహారముల్ సలుప ♦ నుల్లమును
గడువేడ్క సేయు నే। యోజ విదగ్ధుఁ డై పలుకు ♦
నొడ్డులకుం దగ దట్లు సేయఁగన్. 123

క. పుత్రులు పౌత్రులు భ్రాతలు
మిత్రు లనరు రాజు లాజ్ఞ ♦ [1]మిగిలిన చోటన్
శత్రులకాఁ దమ యలుకకుఁ
బాత్రము సేయుదురు నిజశు ♦ భస్థితిపొంటన్. 124

క. చనువాని చేయు కార్యం
బున కడ్డము సొచ్చి నేరు ♦ పున మెలఁగుచుఁ దా
నును బయిఁ[2]బూసికొనుటఁ దన
మును మెలఁగిన మెలఁకువకును ♦ ముప్పగుఁ బిదపన్.

ఆ. రాజునొద్దఁ బలువు ♦ రకు సంకటము గాఁగఁ
దిరుగు పనుల కెంత ♦ తేజ మయిన
వాని బుద్ధిగలుగు ♦ వా రొల్ల రది మీఁదఁ
జేటు దెచ్చు నెట్లు ♦ సిద్ధమగుట.

క. ఊరక యుండక పలువుర
తో రవ మెసఁగంగఁ బలుకఁ ♦ దొడరుపక మదిం

1. క. ఖ. మీఱిన. 2. చ. బూనికొనుట.

జేరువ గలనాగరికులఁ
దారఁ గలసి పలుక వలయు ♦ ధరణీశుకడన్. 127

క. వే ఱొక తెఱఁగున నొరులకు
మా ఱాడక యునికి లెస్స ♦ [1]మనుజేంద్రుకడం
దీఱమి గలచోటులఁ దా
మీఱి కడఁగి వచ్చి పంపు ♦ మెయికొన వలయున్. 128

చ. ధరణిపుచక్కఁగట్టెమరు ♦ దక్కి పిఱుందును గానియట్లుగా
నిరుగెలనం దగం గొలిచి ♦ యే మనునో యెటు సూచు
నొక్కొ యె। వ్వరిదెస . నెప్పు డేతలఁపు ♦ వచ్చునో
యాతని కంచుఁ జూడ్కి సు స్థిరముగఁ దన్ముఖంబునన ♦
చేర్చుచు నుండుట నీతి కొలువునన్. 129

క. నగళులలోపలిమాటలు
దగునే వెలి నుగ్గడింపఁ ♦ దన కేర్పడ నొం
డుగడం బుట్టినఁ బతి విన
నగుపని చెప్పెడిది గాక ♦ యాతనితోడన్ 130

క. అంతిపురముచుట్టఱికం
బెంతయుఁ గీ డంతకంటె ♦ నెగ్గు తదీయో
పాంత చరకుబ్జవామన
కాంతాదులతోడిపొందు ♦ కలిమి భటునకున్. 131

ఆ. ఉత్తమాసనములు ♦ నుత్కృష్టవాహనం
బులును గరుణఁ దమకు ♦ భూమిపాలుఁ

1. చ జ. మనుజేంద్రునకుం.

డీక తార యెక్కు ♦ నెంతటిమన్నన
గలుగు వారి కైనఁ ♦ గార్య మగునె. 132

క. మన్నన కుబ్బక యవమతి
ద నొందిన స్రుక్కఁబడక ♦ ధరణీశుకడన్
ము న్నున్నయట్ల మెలఁగిన
యన్నరునకు శుభము లొదవు ♦ నాపద లడఁగున్. 133

క. జనపతి యెవ్వరి నైనను
మనుపఁ జెఱుపఁ బూని యునికి ♦ మదిఁ దెలియనెఱిం
గినయేనిఁ దాను వెలిపు
చ్చునె మునుము న్నెట్టిపాల ♦ సుండును దానిన్. 134

ఉ. ఎండకు వాన కోర్చి తన ♦ యిల్లు ప్రవాసపుఁజోటు నాక
యా । కొండు నలంగుటన్ నిదుర ♦ కుం దఱి దప్పెడు
డప్పి వుట్టె నో । కండన యెట్లొకో యనక ♦ కార్యము
ముట్టినచోట సేలినా ।తం డొకచాయ చూఁపినను ♦ దత్పర
తం బని సేయు టొప్పగున్. 135

క. తా నెంతయాప్తుఁ డైన మ
హీనాయకుసొమ్ము పాము ♦ నెమ్మెలుగా లో
నూనినభయమునఁ బొరయక
మానినఁ గా కేల కలుగు ♦ మానము బ్రతుకున్. 136

ఆ. ఆవులింత తుమ్ము ♦ హాసంబు నిష్ఠీవ
నంబు గుప్తవర్త ♦ నములు గాఁగఁ
జలుపవలయు నృపతి ♦ గొలువున్నయెడల బా
హిరము లైనఁ గెలని ♦ కెగ్గు లగుట. 137

క. వైరులదూతలు [1]నెరవగు
వారు నిరాకృతులుఁ బాప ♦ వర్తులుఁ దమకుం
జేరువగా వర్తించుట
నేరమి తుదిఁ బోయి చేటు ♦ నిందయు వచ్చున్. 138

ఆ. వసుమతీశుపాల ♦ వర్తించునేనుంగు
తోడ నైన దోమ ♦ తోడ నైన
వైర మగుతెఱంగు ♦ వలవదు తా నెంత
పూజ్యుఁడైన జనుల ♦ పొందు లెస్స. 139

క. కలిమికి భోగముల కదా
ఫల మని తను[2]మెఱసి బయలు ♦ పడఁ బెల్లుగ వి
చ్చలవిడి భోగింపక వే
డ్కలు సలుపఁగ వలయు భటుఁడు ♦ డంకువతోడన్.

వ. అని యిట్లు పురోహితుండు సేవాధర్మం బెఱింగించిన ధర్మజ భీమార్జున నకులసహదేవులు ప్రసన్నచిత్తులై యిట్లనిరి. 149

క. తల్లియుఁ దండ్రియు దైవము
నెల్లసుహృజ్జనము మీర ♦ యిట్లు గొలిచి వ
ర్తిల్లెడు తెఱంగు లెంతయుఁ
దెల్లము సేసితిరి బ్రదికె ♦ తెమి మీకరుణన్. 142

ఆ. అనిన ధౌమ్యుఁ డిట్లు ♦ లనియె నీవత్సర
మొకఁడు నెట్టు లయిన ♦ నుడిగి మడిఁగి

1. అ. నేరమువారు. 2. జ. తా మెఱసి.

సంకటముల కోర్చి ♦ చరియించి యాపద
నిస్తరించి పిదప ♦ నెగడ వలయు. 143

క. అనవుడు నట్టులచేసెద
మని వారలు భక్తియుక్తి ♦ నతనికి నభివం
దన మొనరించినఁ దగు దీ
వన లిచ్చె నతండు గాఢ♦వాత్సల్యమునన్. 144

క. భూదేవోత్తము నాశీ
ర్వాదంబులఁ బ్రీతిఁ బొంది ♦ వారలు ప్రస్థా
నాదరపరు లగుటయు స
మ్మోదావహపుణ్యకర్మ ♦ ముల కుద్యతుఁ డై. 145

ఆ అతఁడు నియతితోడ ♦ నగ్ని సముజ్జ్వలం
బుగ నొనర్చి కామ్య ♦ పూజ దీర్చి
యానసమయమంగ ♦ ళార్థంబు లగుమంత్ర
సంచయములు దగ జ ♦ పించుచుండె. 146

—♦ పాండవులు పాంచాలితోడ విరాటనగరంబునకు బయలుదేరుట. ♦—

వ. తదనంతరంబ హుతవహునకుం బురోహితునకుం బ్రద క్షిణంబుసేసి యమ్మహీసుర వరేణ్యుననుమతి వడసి పాం డవులు పాంచాలిం బురస్కరించుకొని యాతండును దోడన యరుగుదేరం గదలి శుభనిమిత్తంబులు గైకొనుచుం జని దశార్ణ దేశంబున కుత్తరంబునఁ బాంచాలజనపదయా మ్యదిగ్భాగంబున సాళ్వశూరసేనవిషయంబులలోనం గాళిందీదక్షిణతీరం బొరసికొని పశ్చిమాభిముఖ ప్రయాణం బుల నెడనెడ వన్యాహారంబుల శరీరయాత్రలు నడుపుచు

నానామృగవివిధవధవిహారంబులను మనోహరకుసుమకదంబ
గంధమకరందబిందుసందోహసుందరతరుచ్ఛాయా సేవనంబు
లను గమలపరాగపరంపరాధూసరితభాసురజలాశయసమవ
గాహనంబులను సరిత్సంగమస్నానాహ్నికానుష్ఠానంబులను
బహుప్రకారపాదపగుల్మలతావలోకనంబులను బక్షికుల
ప్రకారానేకభంగివిరుతాకర్ణనంబులను వినోదించుచుఁ గానన
మార్గంబుల నరిగి మత్స్యమండలంబు గడిసేరి ధౌమ్యుని
వీడుకొని రవిప్రభవగుండను నొక్క పుణ్యాశ్రమంబున వసి
యించె వారు మఱియు నూఁత్తు నారక యడవి తెరవుల
నడచి విరాటునగరంబున కనతిదూరం బగు కాంతారంబునం
దఱిమి పోవుసమయంబునఁ బథిశ్రమంబు నూని యాజ్ఞసేని
యి ట్లనియె. 147

ఉ. దప్పి జనించె వ్రేఁగులపు ♦ టంబులు పొక్కఁ దొడంగె
గోళ్లలోఁ । జిప్పలఁ జొచ్చె నెత్తురులు ♦ చిత్తము నాకుఁ
గడుం గవశంబు గా । దప్పర మిచ్చ టచ్చటను ♦ నాసల
వచ్చితి నెంతదవ్వొకో । యిప్పటిభంగి నొక్కఁడుగు ♦ నేఁ
గెడుదానికి నోర్వ నెమ్మెయిన్. 148

వ. అనవుడు. 149

క. తనమదిఁ గరుణయు ఖేదం
బును 1బిరిగొను చుండ ధర్మ ♦ పుత్త్రుఁడు నకులుం
గనుఁగొని ద్రుపదనృపతినం
దనదెస యాతనికిఁ జూపి ♦ తగ ని ట్లనియెన్. 150

1. బురిగొనుచుండ.

ఆ. అకట మనము వచ్చి ♦ నది గడుదవ్వు నేఁ
డప్పురంబు సొత్త ♦ మని తలంచి
తఱిమి నడచితిమి ల ♦ తాతన్వి యిది వడ
గొనియె మోచి తెమ్ము ♦ కొంతదవ్వు. 151

క. అనిన విని పూని గ్రక్కునఁ
జనుదేరమి నతఁడు డస్సెఁ ♦ జాలం డని నె
మ్మనమున నెఱింగి యాతని
యనుజన్మునిఁ బనిచె నతఁడు ♦ నలసుం డంబునన్.

వ. సవ్యసాచిం జూచి. 153

ఉ. ఇమ్మదిరాక్షి డస్సె మన ♦ కీనడుమ న్విడియంగ నొండుచో
టిమ్మను గాదు నిక్కమున ♦ కేమును డస్సితి మట్లు గాన నీ
వెమ్మెయి నైన దీని భరి ♦ యించి పురంబుసమీపభూమి
కిం । దెమ్మని చెప్ప నాతఁడును ♦ దెచ్చెఁ బ్రియంబున
బుష్పకోమలిన్. 154

క. మోచికొని వాసవాత్మజుఁ
డా చెలువం దేర నిట్టు ♦ లరిగి పురము దృ
గ్గోచర మగుటయుఁ దమ్ములఁ
జూచుచు వారలకు ధర్మ ♦ సుతుఁ డిట్లనియెన్. 155

క. చక్కని చిక్కని మేనులు
నిక్కటదండములు నైన ♦ నెఱుఁగరె మన మీ
చక్కటి నిలుతమె శస్త్రము
లొక్కెడ దాఁచుటకు వేష ♦ యోజనములకున్. 156

వ. అనిన నిది కార్యం బని మధ్యమపాండవుం డాసుమధ్య నొక్క శీతలసికతాతలంబున డించెం దక్కినవారలు నట్ల చేయుద మని నిలిచి రట్టియెడం బాండవాగ్రజుండు గాండీవి చేతివి ల్లుపలక్షించి యతని కి ట్లనియె. 157

క. మన శస్త్రాస్త్రంబులు ద
క్కినయవి యొకభంగి పెట్టి ♦ కిని గాండివముం
గొనిపోయితిమేని సుయో
ధనునకు నగపాటు నిశ్చ ♦ తం బూహింపన్. 158

వ. అనవుడు. 159

చ. ఇది పెనుఁబాముచందమున ♦ నెంతయు భీషణ మై జనం
బులకుఁ బెదరఁగఁ జేయు న ట్లగుటఁ ♦ బెట్టి చనన్
వలయు [1]దలంచి నా హృదయము దీనిఁ బాయుటకు ♦
నియ్యకొనం జొర దెట్లు సెప్పినం దుది నొకచోట వైచు
టయ ♦ తోఁచిన కార్యము నయ్యెడుం గటా. 160

వ. అని వితర్కించుచుం గిరీటి యురియాడు చిత్తంబు నుత్తలం బుడిపికొని నిశ్చయించి యాయుధంబులు నిక్షేపించుటయ కర్జంబుగాఁ బలికి యోగ్యస్థలనిరూపణంబునకు నలు దిక్కులుం బరికించి ప్రేతభూమిపరిసరారణ్యంబునందు. 161

సీ. నెగసినకొన లేచి ♦ నింగి యంతంతకు
నవులఁ ద్రోవఁగఁ దన ♦ రారుదానిఁ
జాఁగినశాఖ లా ♦ శాచక్రములకొలం
దులు బారవెట్టంగఁ ♦ బొలుచుదానిఁ

1. ఖ. చ. జ. దలంచినన్.

గవట లొండొంటితోఁ ♦ గదియుచు నడములు
బ్రింగి ప్రబ్బఁగ సొంపు ♦ మిగులుదాని
లోనిజొంపము పవ ♦ లును బెనుజీఁకటి
నొదవించి పొదలంగ ♦ నొప్పుదానిఁ
తే. గనియెఁ బవమానవివిధ[1]న ♦ ర్తనకళాను
వర్తిఁగాకఘూకారవ ♦ స్ఫూర్తి జాత
భీతిపరిసరవర్తి నా♦భీలభుజగ
చండమూర్తి శమీతరు ♦ చక్రవర్తి. 162

వ. కని యమ్మహామహీరుహంబు ధర్మనందనునకుం జూపి యిట్లనియె. 163

శా. పక్షివ్యాకులముం బరేతనిలయో ♦ పాంతోత్థముఁ డాకినీ
రక్షోభూతపిశాచగోచరము [2]దు ♦ ర్గంధంబు నై చూడఁ జి
త్తక్షోభం బొనరించు నట్లగుటఁ జెం ♦ తం జేర రా
దీ శమీ ♦ వృక్షంబెవ్వరి కింపుఁ బెట్టుదమె ♦ పృథ్వీనాథ
శస్త్రాస్త్రముల్. 164

క. పెనుఁబొడవుఁ బఱపు జొంప
మ్మును గలయది దీన నెల్ల ♦ పురుషులకుఁ బ్రయో
జన మొకఁడు లేదు సేరం
జనఁ జూడఁగ నరయ నెక్క ♦ సమకట్టంగన్. 165

ఉ. కావున దీనియం దిడుట ♦ కార్యము గైదువు లెల్లఁ గేశచ
ర్మావృతసంచయంబుగ శ ♦ వాకృతిగా నొనరించి కట్టినం
బోవరు దీనిది క్కెవరులు ♦ భూవర నెమ్మది నూఱడిల్లు మొ

1. జ చ. వర్తనకళానివర్తి. 2. చ. దుర్గంధంబు.

చో వసియించినం బిదపఁ ♦ జొప్పడుఁ గ్రమ్మఱ వచ్చి
తైకొనఁ. 166

—♦ పాండవులు వమయాయుధంబుల శమీవృక్షమునఁ బెట్టుట. ♦—

వ. అని చెప్పిన నందఱు నత్తెఱంగునకియ్యకొనుటయు నతండు
గాండీవంబు నవలోకించి. 167

చ. అనిమిషదానవాంబర చ ♦ రాదికజాతుల నెల్లఁ బోర నీ
ధనువునఁ గాదె గెల్తు సము ♦ దగ్రవిరోధిభయావహంబు దీ
నిని నొక త్రమ్మనఁ గట్టి చను ♦ నిశ్చయమెుం దగఁ జేసె
దైవ మే । మనఁ గల దట్ల కాక యని ♦ యాత్మ నలందురి
మందచేష్టుఁ డై. 168

వ. ఎక్కు డించినఁ బాండవాగ్రజుండు. 169

క. దనుజకులత్రాసకరం
బును రిపుభంజనము రత్న ♦ భూషితరూపం
బును గురుదేశాహ్లాదన
మును నగునిజకార్ముకంబు ♦ మో పెడలించెన్. 170

వ. తదనంతరంబ భీమ నకుల సహదేవులదెసఁ గనుంగొని. 171

సీ. సైంధవయక్షపాం ♦ చాలత్రిగర్తుల
దీనన యొర్చితి ♦ మానధనుఁడ
సౌరాష్ట్రనాథాది ♦ శత్రులు దీనిచేఁ
గాదె మర్దితులైరి ♦ ఘనభుజుండ
కాళింగపాండ్యమా ♦ గధుల నిర్జించుచో
నిదియ కైదువు నీకు ♦ విదితయశుఁడ

యని క్రమంబున వార ♦ లందఱవిండులు
పెం పెసలార వే ♦ ర్వేఱ పొగడి

ఆ. గోనయములు వదల్ప ♦ ననుమతి సేయుడు
వారు నట్ల చేసి ♦ తేరఁ జూప
ములును దోనలువర్మ ♦ ములునసిముద్గరా
ద్యాయుధములుఁ గూడఁ ♦ నతఁడుగట్టె. 172

వ. ఇట్లు పూర్వోక్తప్రకారంబునం బొదివి మహోరగం
బులం బెట్టియలం బెట్టి కట్టు చందంబున బంధించి వానిం
గొనుచు నయ్యజాతశత్రుండు ధర్మదేవతాదత్తవరుండగు
టం జేసి నిశ్శంకం బైనయంతఃకరణంబుతోడ శమీవృక్ష
సమారోహణం బాచరించి. 173

తే. బ్రహ్మవిష్ణుమహేశది ♦ క్పాలచంద్ర
సూర్యవసుదేవతాపితృ ♦ స్తుతులొనర్చి
దివియు భువియును జూచి ప్రా ♦ ర్థించి యొకర్ష
విపులశాఖ నాయుధములు ♦ వ్రేలఁగట్టె. 174

వ. ఇట్లు గట్టి తదీయాధిదైవతంబుల నుద్దేశించి నమస్కరించి

క. నరునకు నాకుం దక్కఁగ,
నొరులకు మీరూపుసూప[1]నున్నది విషవి
స్ఫురిత [2]భుజగభంగి భయం
కరమూర్తులు దాల్చియుండఁ ♦ గా వలయుఁజుఁడీ. 176

1. 'ఉన్నది' అనఁగా ఉండునది. (ఆది. ౭-౨౫) (ఆది. ౬-౨౩౨.)
2. చ. భుజంగగాఢభయం.

ఉ. భీముఁడు ధార్తరాష్ట్రకుల ♦ భీషణరోషుఁడు చిత్తమెప్పు డే
ట్లయి మదమెత్తునో యతని ♦ యాగ్రహవృత్తికి లోనుగాక మీ
రేమెయి నైన వంచన వ ♦ హించి తొలంగుట మత్సమీ
హితం। బేమఱకుండఁగా వలయు ♦ నివ్విషమాబ్దము
లోన నాతనిన్. 177

వ. అని వేఁడికొని వృక్షంబు డిగ్గి దానికిఁ బ్రదక్షిణంబు వచ్చి
ప్రణమిల్లి భీమసేనుదెస మరలి చూచి సాంత్వనవచన సమే
తంబుగా నతనిం గౌఁగిటం జేర్చి యనునయించి తమ చేసిన
విధంబు దప్పి దేశవర్తులయిన గోపాలాది క్షుద్రజనంబులకు
మఱుపెట్టం దలంచి వారలకభిముఖులై పాండునందను
లందఱు నిట్లనిరి. 178

చ. ఇది 1శతవృద్ధ మాజనని ♦ యిప్పుడు మృత్యువుఁ బొందె నిట్టు సే
యుదుము కుల2క్రమయుక్తమగు ♦ చున్న సనాతనధర్మమిత్తెఱం
గదహనకర్మ మెల్ల మది ♦ గానిదిగా మును నిశ్చయించి మా
మొదలిటివా రొనర్చువిధ ♦ ముం గొనియాడితి మేము నియ్యెడన్.

వ. అని యిట్లు పలుమఱుం దెలియం బలికి శస్త్రాస్త్రంబుల నిక్షేప
ణంబు నిగూఢంబగుటకు నూరడిల్లి యచ్చేరువం జచ్చినపస
రంబు వడియున్నం జూచి సహదేవుం బనిచి ధర్మతనయుండు
దానిచర్మం బొలిపించి శీతాతపవర్షపరిహారంబుగా నాయు
ధంబులం బొదివించి మఱియును దత్సమీపంబున నొక్క
శుష్కశవంబు నవలోకించి యిది యుంఛవృత్తి యైనమానవు
కళేబరముగావలయు ననుచు నదియునుం గొమ్మలకట్టియుం

1. క. ఖ. గ. ఘ. చ. శతవృద్ధ. 2. ఖ. జ. ప్రవృత్తమగు.

బెట్టికట్టించె నివ్విధంబుననత్యంత గుప్తియాచరించి దీనిదుర్గంధంబున వనచారులెవ్వరుం జేరరని నవ్వుచు వారలచ్చోటు వాసి విరాటపురాభిముఖులై చనుచుండి యజ్ఞాతవాసకాలంబునం దమరహస్యవ్యవహారంబునకు ననువుగా నేవురపేళ్ళను గ్రమంబున జయుండును జయంతుండును విజయుండును జయత్సేనుండును జయద్బలుండు నని సంకేతించుకొని యాజ్ఞసేనీపురస్సరంబుగాఁ బుణ్యనదీ తీర్థావతరణంబుసేసి తదీయస్నానంబునం బథిశ్రమం బపనయించి దేవపితృతర్పణమంగళ జపహోమాధ్యానాద్యనుష్ఠానంబు లొనర్చిరి తదనంతరంబ యక్కౌంతేయాగ్రజుండు ప్రాఙ్ముఖుండై నిర్మలచిత్తంబున ధర్మదేవతందలంచి యిట్లనియె. 180

ఆ. తండ్రి నీవు నాకు ♦ దయతోడ నిచ్చిన
వరముచిత్తగించి ♦ వలయు తెఱఁగు
సమయసముచితముగ ♦ సమకట్టుమయ్య యీ
రాకుమారులవిధిఁ ♦ బోకయుండ. 181

వ. అనుచుననుజులదెసకుఁ [1]దూరవగచి డగ్గుత్తిక వెట్టి మఱియును

ఉ. అంబరవర్తివైనఁ గని ♦ [2]యక్షునిచేనగపడ్డ పీరిప్రాణంబులు మున్నునిన్నడిగి ♦నల్వురకుఁ నయవిక్రమప్రభావంబులు వేఁడికొన్న నతి ♦వత్సలభావముఁబొందియాదరార్ద్రం బగుచూడ్కితోఁ బ్రియహి♦తస్థిరభాషలనూరడింపవే.

1. ఇది 'తూరు'ధాతువు. "చాలు"ధాతువువంటిది. తూరఁగాఁ అనఁగా వెక్కిలిగానసుట. ఇట్లిదీనిప్రయోగముల నిందుఁ బెక్కెడలఁ జూడవచ్చును.
2. "యక్షునిచే" అనియే వ్రాతప్రతులపాఠము.

వ. అని తానుభూసురవరు నరణిదేర నరగిననాఁడు సరోవర తీరంబునం దనకు ధర్మిండు సేసిన మన్ననదోఁప సతనికి విన్నవించినవాఁడై కరకమలంబులు మొగిచి ఫాలభాగంబునం గదియించి సంప్రార్థనంబుగా వినయవినమిత మస్తకుండగుట యుఁ దదనుగ్రహంబునఁ బాండవాగ్రజుం డున్నయునికిన సన్యాసిరూపం బలవడి ధాతుపటదండకమండలు కలితమూర్తి యయ్యె నయ్యవసరంబున వారందరు మహాద్భుతంబంద వారివారికి నయ్యె వేషంబుల కనుగుణంబులగు నంబరాభరణ మాల్యాద్యుపకరణంబులు సన్నిహితంబులయినం జూచి సంతసిల్లి యెల్లవారిం గలయంగనుంగొని క్రమంబున నొంటిమైఁ జనుదెండని నియోగించిన యతండు నానావిధంబులగునక్షంబులముడి కక్షంబుననిడికొని చని దైవయోగంబున విరాటుండు వెడలివచ్చి బయలికొలువిచ్చుటం జేసి తదాస్థానంబు సేరంబోవునప్పుడు. 184

—♦ ధర్మరాజు సన్యాసివేషమున విరటుఁ గొల్వవచ్చుట ♦—

ఉ. దవ్వులఁజూచిమత్స్యవసు♦ ధాపతియాచనుదెంచుచున్నవాఁ
డెవ్వఁడొ నాదుచూడ్కులకు నెంతయు వేఁగయితోఁచె[1] నెట్లితం
డివ్విధిఁ బొందెనో జగము ♦ లెల్లను నేలఁగఁ జాలు తేజమా
ముప్పిరి[2]తోడిజోడియగు♦మూర్తియతీంద్రునియొప్పుగంటిరే.

సీ. కరచరణాద్యంగక ♦ ంబు లేలోకా రత్న
భూషణప్రకరంబు ♦ పొందుదొలఁగె

---

1. క. నిట్టితండెవ్విధిఁ. 2. చ. జ. తోడ జోడయిన.

నుభయపార్శ్వంబుల ♦ నిభఘటలేలొకో
చనుదేవు సమదాళి ♦ సమితిమెరయఁ
బాయు తొలంగుమం ♦ చాయత వేత్రహ
స్తుల మొత్తమేలొకో ♦ తోడరాదు
ధవళాతపత్రముల్ ♦ దఱచుగానేలకో
పట్టరు మౌక్తిక ♦ ప్రభలు వెలుఁగ.
తే. నితఁడు రాజగు రాజను ♦ నింతమాత్ర
గాదుమూర్ధాభిషిక్తవర్గంబుఁ దనదు
చరణయుగ్మంబు గొలిపింపఁ ♦ జాలు సార్వ
భౌముపదవికిఁదగియెడు ♦ భంగివాఁడు. 186
క. మనకడకు నేమిటికి వ
చ్చెనొకో యేనిమ్మహాత్మ ♦ చెప్పినపను లె
ల్లను జేయువాఁడఁ గోరిన
కనకాంబరమణులు దలఁపు ♦ గడవఁగనిత్తున్. 187
ఆ. మత్స్యవిషయరాజ్య ♦ మహిమకు యుక్తుండు
గాఁదలంచె నేని ♦ గారవమున
నట్లచేసి భక్తి ♦ ననుచరింతు నమాత్య
సుతసుహృద్భటార్య ♦ యుతముగాఁగ. 188
వ. అని సమస్తజనంబులుఁ దదభిముఖులయి భక్తియుక్తిం బ్రత్యుత్థానంబు సేయం దానును గద్దియడిగ్గి యెదురుచని నమస్కరించి యతని యాశీర్వాదంబులు గైకొని సగౌరవంబుగాఁ దోడ్కొనిచనుదెంచి సముచిత సమున్నతాసనంబున నునిచి వినయావనతుండయి. 189

జన్మభూమి కుల ♦ మెయ్యది యెయ్యది యున్న
పే । రెయ్యది మీర లిందులకు ♦ నిప్పుడు వచ్చిన
గతం । బెయ్యది నాకు నంతయును ♦ నేర్పడఁగా
పుఁ దున్నరూ । [1]పయ్యది నావుడుఁ నరవ ♦
కయ్యతిముఖ్యుఁడి ట్లనున్. 190

న్నరూపపలుకు ♦ నన్నరులెక్కుడఁ
రు తోఁచినట్లు ♦ పలుకు వలుక
నచందమయ్యె ♦ నంతియ కా కంత
త్రి చూడఁ గలరె ♦ యెట్టివారు. 191
మందహాసంబుసేయుచు మఱియును. 192

నావిధభూతమయము
నతిచంచలము మనము ♦ మెయికొని నిక్కం
నరునకుఁ జెల్లింపం,
నగు సత్యంబునడపు ♦ క్రమ మట్లుండెన్. 193
ము మత్స్యమహీవల్లభు నవలోకించి 194

జుఁడఁ గురువిషయజాతుఁడ
మజనప్రియుఁడైన ధర్మ ♦ సుతుసఖుఁడఁ బరి
వజనాశ్రమకలితుండ మ
మజవల్లభ యోగ్యబహువి ♦ నోదకరుండన్. 195
మ్యూతక్రీడకుఁ గొండొక
నేతుం గపటమున నొవ్వ ♦ ని జనంబులు నా

---

[1] క. పయ్యెడు.

చేతిధన మెల్లఁ గొని పరి
భూతియొనర్చిన విరక్తి ♦ పుట్టి వెడలితిన్.

చ. నృపనయవిద్యకుం దగిన ♦ నేర్పలవడ్డది గొంత కొంc
ర్మపరులసంగతిం దగిలి ♦ మచ్చిగ నుండుదుఁ బేరుకంకి
వపుఁగొలువైన నాకు నిలు♦వన్ మదిఁగొల్వదుగాననిను
మిపతులలోన సాధుజన ♦మిత్రుఁడునావినికొల్వవచ్చితి

తే. వత్సరంబునఁ గడచను ♦ వ్రతము నాకు
దాని నీపాలఁ జల్పి యు ♦ త్సాహవృత్తి
1 మెఱయ నాకుఁ గృతఘ్నత ♦ నెఱపి తొల్లి
యెగ్గుసేసినవారి జ ♦ యింపఁ బోదు.

వ. అనినవిని సంప్రీతచేతస్కుండై విరాటుండతనికిట్లనియె.

తే. అట్లచేయుఁడు రుచిరోన్న ♦ తాసనములు
వాహనములు భోజనములు ♦ వస్త్రములును
వలయుభోగములును నెల్ల ♦ వర్తనములు
నాకు నెట్లవ్విధమ మీకు ♦ నడపువాఁడ.

క. నాయనుచరులం దెవ్వఁడు
మీయెడ భయభక్తి లేక ♦ మిగిలిమెలఁగె నే
నాయధముని దండితుఁగా
జేయుదు నతఁ డెంతయుం బ్ర ♦ సిద్ధుండయినన్. 2

వ. అట్లుం గాక. 2

చ. వెలయఁగ మత్స్యరాజ్యపద ♦వీపరిపాలన సేయఁగా మ
దలఁచుట యెంతయుం బ్రియము ♦ దమ్ములుఁ బుత్రు

1. గ. జ. మెఱసి నీకుఁ గృతజ్ఞత.

బంధులుం బ్రథా । నులును బలంబు నేను సుమ నో♦విభు
తుల్యుఁడ వైననిన్ను మి । కిలి భయభక్తిఁ గొల్చి కృత
కృత్యతఁ బొందుదు మట్లు చేయవే. 203

వ. అనిన విని దరహసిత వదనుండగుచుఁ బాండవాగ్రజుండత
ని కిట్లనియె. 204

క. ఏను హవిష్యము కుడుతును
భూనాయక నాకు శయ్య ♦ భూమియ యిమ్మైఁ
బూని వ్రతంబులు సలిపెద.
వానికి నిన్నియును నిట్లు♦ వలయును చెప్పుమా. 205

ఆ. అనిన విరటుఁ డిట్టు ♦ లనియె నత్తెఱఁగున
నడవ నిష్టమట్లు ♦ నడచి మీకు
మనసువచ్చినన్ని ♦ దినములు సలుపుఁ డి
చ్చోట నదియ మాకు ♦ శోభనంబు. 206

క. ద్యూతజ్ఞులదెసఁ గొండొక
ప్రీతియుఁ గలదట్లుఁగాక ♦ పెద్దలరగు మీ
రే తెఱఁగున విహరించినఁ
జేతోమోదంబు దగవ ♦ సింపుఁడు నెమ్మిన్. 207

వ. అనిపలికి కౌంతేయాగ్రజు నత్యంత సంతుష్టాంతరంగుం జేసి.

చ. పొరిఁ బొరిఁ బ్రీతి రెట్టిగన♦ పూర్వవిలోకన మాచరించుఁద
త్పర మగు సద్వివేకమున ♦ భావనిరూపణ సేయుఁగౌతుక
స్ఫురణఁ గరంబు దత్కరముఁ ♦ బొంద నయంబునఁ జేర్చి
వాక్యవి । స్తర చతురత్వమేర్పడఁగ ♦ సల్లపనం బొనరించు
నర్థితోన్. 209

వ. ఇట్లు మత్స్యమహీవల్లభుం డతనిం గలిపికొని పరివారంబును దానును దదీయ సంభావనా [1]తత్పరుండై యుండె నంత. 210

—♦ భీముండు వంటలవాఁడై విరటుఁ గొల్వవచ్చుట. ♦—

సీ. చట్టువం బొకచేతఁ ♦ బట్టి ఖడ్గముసంకఁ
దగిలించి సురియతో ♦ బిగియ ద్రిండు
గట్టిననునుఁజేల ♦ [2]క ప్పెంతయును జెన్ను
సేయంగ దాపలి ♦ చేతియందు
బెడిదంపుఁ గోలలు ♦ బెడఁగొంద బహువర్ణ
చిత్రితాజినము పై ♦ చీరగాఁగ
జూపఱెల్లను దన ♦ రూపంబు చూడ్కికి
వేఁ గైన నత్యంత ♦ విస్మయంబుఁ
తే. బొందుచుండ సమీరణ ♦ పుత్రుఁ డగ్రి
జుండు వోయిన దెసఁ దప్ప ♦ నొందువలన
సముదవారణపతిగమ ♦ నమున మత్స్య
ధరణివల్లభుసభ చేర ♦ నరుగుటయును. 211

వ. అంతంతం గనుంగొని. 212

క. ఉలుకును వెక్కసపాటును
దలకొను నెమ్మనముతోడ ♦ ధాత్రీరమణుం
[3]డలఘుభుజవిపులవక్ష
స్స్థల రేఖాకాంతిఁ బరవ ♦ శత్వముఁ బొందెన్. 213

---

1. "తత్పరులై యుండి" రనియే వ్రా. ప్ర. 2. గ. జ. కట్టెంత యును. 3. చ. డలఘుభుజా.

వ. ఇట్లతని రూపాతిశయంబున కోటువడి చూచుచు నిజాం
తర్గతంబున. 214

క. విహరింప మానవాకృతి
సహితంబుగ మహికి నర్థిఁ ♦ జనుదెంచిన ప
ద్మహితుఁడొ హిమకరుఁడొ శచీ
గృహమేధియొ కాక యితఁడు ♦ కేవలనరుఁడే. 215

క. ఏమికులంబునవాఁడొకొ
నామం బెద్ది యగునొకొ ♦ నాభృత్యులలో
నీమనుజోత్తముఁ దొల్లియు
నే మెఱుఁగుదు మనఁగ నిచట ♦ నెవ్వరు గలరో. 216

క. అను చుండ ననతిదూరం
బున కల్లన వచ్చి పవన ♦ పుత్రుఁడు మనుజేం
ద్రునకు జయశబ్దయుతముగ
వినయంబున మ్రొక్కి విన్న ♦ వించె నిభృతుఁడై. 217

శా. దేవా నాలవజాతివాఁడ నిను న ♦ ర్థిం గొల్వఁగా వచ్చితిన్
సేవాదక్షత యొండుమై నెఱుఁగ నీ♦ చిత్తంబునన్ మెచ్చున
ట్లే వండం గడు నేర్తు శాసనమునం ♦ దిచ్చోటనే కాదు న
న్నేవీటన్ మిగులంగ నెవ్వఁడును లేఁ♦డెబ్బంగులంజూచినన్.

క. పేరు వలలుండు గూడుం
జీరయు నిడి సాకతంబు ♦ సేసినఁ జాలుం
గోరిన వంటకములు నా
నేరిమిఁ దగ నెఱపి కొలుతు ♦ నిశ్చలభక్తిన్. 219

చ. అనవుడు మత్స్యభూరమణుఁ ♦ డాతని కిట్లను నెట్లు శూద్రుఁగా
నినుఁ దలఁపంగ వచ్చు ధర ♦ ణీభరణక్షమమూర్తి వీవు నీ
కనుగుణ మైనయానమును ♦ నాసనముం రుచిరాత
పత్రముం । 1జనవరికొల్వు నిచ్చెద 2ని ♦ జవ్రజముం బరి
కింపు పెంపుతోన్. 220

క. అనుటయు మోఱకుచందం
బున మో మడ్డము గదల్చి ♦ భూవిభుఁడు సభా
జనులు విన ననిలసుతుఁ డి
ట్లనియెం బ్రస్ఫుటనిరర్గ ♦ ళాలాపములన్. 221

ఉ. నా కవి యెల్ల నేల నర ♦ నాథులకుం బ్రియం బొందు
నట్లుగాఁ । బాకము సేయ నేర్తు జన ♦ పాలక ధర్మసుతుండు
పెద్దయుం । జేకొని యుండు బానసము ♦ సేయువిధంబున
కిచ్చ మెచ్చి పు । ణ్యైకరమూర్తి యైన నిను ♦ నాతనిఁ
గొల్చినయట్ల కొల్చెదన్. 222

చ. వలసిననేలు మేను బల ♦ వంతుఁడఁ గారెనుపోతు దంతి బె
బ్బులి మృగనాథునిం దొడరి ♦ పోరుదు శూరత యుల్ల
సిల్లఁగా । దలమున లావు విద్య మెయి ♦ దర్పముఁ బేర్చి
పెనంగు జెట్టిమ । ల్లుల విఱుతుం వడిం గడియ ♦ లోనన
చూడ్కికి వేడ్క సేయుదున్. 223

1. 'చనవు' అనఁగా నధికారము 'చనవర్లున్' అని చంద్రరేఖావిలాపము. 'చనవరికొల్వు' అనఁగా అధికారికొలువు. 2. ఇందులకు 'అనీకకర్ణాగ్రధరో రథీధ్వజీ' 'భవాద్యమే వారణవాహినీపతిః' అని మూలము. ఇందలి రుచిరాతపత్రము యోధుల బిరుదచ్ఛత్రమే కాని రాజు శ్వేతచ్ఛత్రము కాదు. 'వెల్గొడుగు' 'వాహనచ్ఛత్రంబులు' (భీష్మ ౧. ౨౬, ౯౫)

క. కొలువు గొన నొల్లకుండుట
గలిగినఁ బొమ్మనుట యంత ♦ కంటెను మేలే
వలసినకడ కేఁగెద నీ
తలఁ పెయ్యది యానతిమ్ము ♦ ధరణీనాథా. 224

వ. అనిన విని భూనాథుండు సానునయంబుగా నిట్లనియె. 225

ఉ. ఇమ్మహనీయరూపమున ♦ యేమ్మెయిఁ గన్గొని వేఁడినీకు యో
గ్యమ్మగుభంగిఁ జెప్పితిమి ♦ గాని నరోత్తమ యొంటఁగామునీ
వెమ్మెయి నైనఁ నిల్చుటయ ♦ యిష్టము వంటలమేర వాఁడవై
యిమ్ములనుండు సూపజన ♦ మెల్లను నీదగుపంపు సేయఁగన్.

క. అని హర్షోత్కర్షంబున
మన మలరఁగఁ బల్కి మత్స్య ♦ మనుజాధీశుం
డనిలసుతు నేలె నాతఁడుఁ
దనమనమున నూఱడిల్లెఁ ♦ దదవసరమునన్. 227

—♦ అర్జునుఁడు పేడిరూపమున విరటుఁ గొల్వ వచ్చుట. ♦—

సీ. కాళ్లయొప్పిద మూఁడు ♦ కట్టనుజ్వలము సే
యంగ సంకులబాహు ♦ లంద మొసఁగఁ
గంచుక మంగంబు ♦ కాంతికి మాటుగా
మెడ హేమపట్టిక ♦ మెఱయకుండ
వదనంబుకొమరు భా ♦ వనఁ జేసి వేఱుగా
నుదుటిపెం పలకలఁ ♦ బొదువఁబడఁగఁ
బవడంపుజొత్తులఁ ♦ జెవులు రూపడఁగంగఁ
బాపటఁ దలకట్టు ♦ భంగి [1]గప్ప

1. చ. దప్ప.

ఆ. మంచు మఱుఁగువడిన ♦ మార్తాండుఁడునుబోలె
1నీఱు గవిసి యున్న ♦ నిప్పుఁ బోలె
వేషధారి యైన ♦ విష్ణుండుఁబోలె న
వ్విరటుకొలువు సేర ♦ నరుఁడు వచ్చె. 228

క. చనుదెంచి పేడితనమును
వనితారూపంబు నమర ♦ వాసవసుతుఁ డా
మనుజాధీశునకు సభా
జనులకుఁ దనుఁ జూపి మంద ♦ సంచారమునన్. 229

వ. మెలంగినం గనుంగొని మత్స్యజనవిభుండు దనయొద్దివార
లతో నిట్లనియె. 230

మ. వనితావేషము గల్గి యున్నయది చె ♦ ల్వం బాఁడు
చందంబు గా । దు నిరూపింప మహానుభావతయు ని ♦
ర్దోషత్వముఁ రాజసం । బును శోభిల్లెడు నెవ్వఁడే నొక
జగ । త్పూజ్యుండు క్రీడార్థ మి । ట్లొనరం దాల్చినరూపు
గావలయు మీ ♦ రూహింపుఁడా యట్లగున్. 231

తే. అనినఁ బరిజనంబులు విస్మ ♦ యంబు గదుర
నిశ్చయముసేసి పలుకంగ ♦ నేర్పు లేక
చూచు చుండఁగ నా సవ్య ♦ సాచి సేరఁ
జని విరాటనృపాలుతో ♦ సవినయముగ. 232

క. నిన్నుఁగొలువంగ వచ్చితిఁ
గన్నియలకు నాట గఱపఁ ♦ గా నోపుదు వి

1. జ. నివుఱు.

ద్వన్నుత మన్నామంబు బృ
హన్నల యేఁ బేడి ననుడు ♦ నతఁ డి ట్లనియెన్. 233

ఉ. ఆయతబాహులుం వెడఁద ♦ లైన సమున్నతవక్షముం సరో
జాయతలోచనంబులుఁ బ్ర ♦ సన్నముఖంబు నుదాత్త
రేఖయుం । గాయజుఁ గ్రేణిసేయు నవఁ ♦ గౌశికు మీఱు
ననంగ విభ్రమ । శ్రీయును బెంపునుం గలుగఁ ♦ జేసి
విధాతృఁడు పేడిఁ జేసెనే. 234

శా. మత్తోద్దండచయంబులోన నొకస ♦ ప్తానా ర్హ చాపంబుభా
స్వత్కాండంబులు[1] హేమచంద్రకకన ♦ ద్వర్మంబునీ కెంతయుం
సత్కారంబున నిచ్చి వాహనపరి ♦ ష్కారాంకసంభావ్యసం
పత్కల్యాణునిఁ జేసి వైభవము ద ♦ ర్పంబుం విజృంభింపఁగన్

క. ఏము నిను మత్స్యరాజ్య
శ్రీమహిమకు నెల్ల యుక్తుఁ ♦ జేయఁ దలంపం
గా మామనోరథమునకు
నీమాట విరుద్ధమయ్యె ♦ నిది యెట్లొకొ. 236

వ. అనిన విని యమ్మహీపతికి బృహన్నల యి ట్లనియె. 237

ఉ. ఆఁడుదనంబు నిక్కమున ♦ కారసి చూచిన లేదు పుంస్త్వముం
బోఁడిమి దప్పి యున్నది న ♦ పుంసకజన్మ మవశ్యభోగ్య మై
వాఁడిమి గల్గు శాపమున ♦ వచ్చెఁ బురాకృతకర్మభావ్య మె
వ్వాఁడును నేర్చు నే తొలఁగ ♦ వైవఁగ నోర్వక పోవ వచ్చునే.

వ. కావున. 239



1. క. హేమచిత్రితలసద్వర్మంబులు

తే. ఒండుపనులకు సెలవు తే ♦ కునికిఁ జేసి
యభ్యసించితి శైశవ ♦ మాది గాఁగ
దండలాసకవిధమును ♦ గుంపెనయును
1ప్రెక్కణంబు తెలుంగును ♦ 2పేరణంబు. 240

క. విశ్రుతవాద్యంబులు మం
జుశ్రుతి సంభావ్యగీత ♦ సుగతులు సద్భా
వాశ్రయములుఁ దజ్జన్యర
సాశ్రయములు నైనయభిన ♦ యంబు లెఱుఁగుదున్. 241

తే. ఇన్ని తెఱఁగుల శ్రమము సే ♦ యింతుఁ జతుర
తావిహీనము లైన పాత్రము లైన
నట్టువోజ నై మెలఁగుదు ♦ నగళులంపు
నిపుణ నైపథ్యవిధులకు ♦ నేర్తు నధిప. 242

చ. అనుడు విషణ్ణ మైనహృద ♦ యంబున గారవ మొంద నైపుణం
బున నుచితంబు మై నరసి ♦ పొచ్చెము లేమిఁ దదీయసేవ నై
కొనుటకు నిశ్చయించి తన ♦ కూఁతు విరాటుఁడు పిల్వఁబుచ్చె న
ర్తనమున కై బృహన్నలకుఁ ♦ దత్పరతం దగ నప్పగింపఁగన్.

వ. ఇట్లు రావించిన. 244

సీ. అల్లఁదనంబున ♦ ననువు మై కొనఁ జూచు
నడపు కాంతికి వింత ♦ తోడవు గాఁగ

1. క. ఖ. ప్రేంఖణంబు. 2. చ. పేరణియును; ప్రేరణియును.

వెడవెడ సూఁ గౌరి ♦ వింతయై [1]యేర్పడు
దేరనివళులలో ♦ నారు నిగుడ
నిట్టలు ద్రోచుచు ♦ [2]నెరవులకలమేర
లెల్లను బిగి యెక్క ♦ యేర్పడంగఁ
దెలుపును గప్పును ♦ వెలయంగ మెఱుఁగెక్క
తారకంబులఁ గల్క ♦ తనముదొడరఁ

ఆ. జరణములును నడుముఁ ♦ జన్నులుఁ గన్నులు
జన్వనంబు చెన్ను ♦ నివ్వటిల్లు
చునికిఁ దెలుపు చూడ ♦ నుత్తర సనుదెంచె
నలరువిలుతు పువ్వు ♦ టమ్ముపోలె 245

ఆ. వచ్చి కొలువు సొచ్చి ♦ నెచ్చెలిపిండు నం
తంత నిలువఁ బనిచి ♦ యల్లనల్లఁ
గదిసి ప్రౌఢవనిత ♦ కైవడి ముద్దియ
ముద్దు పుట్టఁ దనకు ♦ మ్రొక్కుటయును. 246

చ. తిగిచి కవుంగిలించి జగ ♦ తీవిభుఁ డక్కమలాయతాక్షి నె
మ్మొగము మొగంబునం గదియ ♦ మోపుఁగరాంగుళులం

---

1. ఇది 'ఏర్పడుదెంచు' ధాతువు (ఆది. ౫-౧౩౭); ఘ. 'వెడవెడ సూఁగారు వింత యై యేర్పడఁ దారనివళులలో నాఱునిగుడ' నని యొక పాఠము 'నాఱు నిగుడ' ననఁగా 'నాఱువోసినభంగి నవళి మెక్కె' (విరా. ౨-౫౭) యన్నట్లు నాఱువలె నిగుడఁగా ననుట. జ. 'యేర్పడఁ దాఱని వళులతో' 2. 'నెరవు' లనఁగా 'చుట్టుఁబట్లు' లేక 'చుట్టునుగలవి.' 'సూతుకీచకుతోడ నేతెంచు నెరవులు' (విరా. 3-౨౭) 'నెరవుల్ విచ్చుటయుఁ' ) హరివంశము-ఉత్త. 3 ఆశ్వా.) చుట్టును గలహద్దులెల్ల బిగినొంది స్తనోచ్ఛ్రిద మగుచుండె నని యర్థము. 'నెలవు' లని రూపాంతరము.

గపోల మిం। పుగఁ బుడుకుం బొరిం బొరి న ♦ పూర్వ
విలోకన మాచరించుఁ గ। ప్పగుమ్మృదుమహాళి నుజ్జ్వలన ♦
ఖాంకుర చేష్ట యొనర్చు నర్మిలిన్. 247

వ. ఇవ్విధంబునం దనగాదిలికూఁతు నుపలాలించి బృహన్నల
దెసం గనుంగొని సాదరదరహసితరుచిరాననుండై యిమ్మ
గువ నీకు నాట గఱపం దగు పాత్రంబగునే యని యడిగి
తత్ప్రతివచనంబులయందలి నాగరికత్వంబునకుఁ జిత్తంబు
రంజిల్ల మధుర సల్లాపంబుసేసి కర్పూరసహితం బగు తాం
బూలంబు వెట్టి చిత్రంబు లగు చీనాంబరంబు లిచ్చి మణిమ
యంబు లగు నాభరణంబు లొసంగి సంభావించి
యవ్విభుండు. 248

ఆ. నీవు చతురమతివి ♦ నీకు నిక్కన్నియ
నప్పగింప నేల ♦ నైన నాదు
హృదయ 1మతులు దీని యెడఁ గడునార్ద్రమై
యుండుఁ గాన చెప్పు ♦ కుండరాదు. 249

క. నెచ్చెలులతోడ నెంతయు
మచ్చికఁ దనయిచ్చ నాడ ♦ మరగినయది యై
విచ్చలవిడి నింతకు ము
న్నిచ్చేడియ మెలఁగుశిక్ష ♦ యెఱుఁగదుసుమ్మీ. 250

ఆ. బాల కేళిమీఁది ♦ భరము గ్రమంబున
విడువఁ గళలయందు ♦ వేడ్క సొనిపి

1. మలరి.

నయముతోడ వర్త ♦ నంబుల శిక్షింపు
నెలఁత కేడుగడయు ♦ నీవ కాదె. 251

చ. అని యుచితంబుగాఁ బలికి♦యంగనహస్తముఁబట్టి తత్కరం
బునఁ గదియించినీగురువుఁ♦బొల్తి తగం గొనియాడుమెట్లు సె
ప్పినటుల భక్తియైనడవు♦పెంపెసలారఁగఁ గూడుగూర చం
దనకుసుమాదులుం నడపి♦తప్పక యారసి గారవింపుమీ.

ఆ. ఎల్లచుట్టములును ♦ దల్లియుఁ దోడును
జెలియుఁ బరిజనంబుఁ జెలువ నీకు
గురువ యింక నొక్క ♦ కొఱఁతయు లే దిందుఁ
జేరి బ్రదుకు బుద్ధి ♦ గౌరవమున. 253

క. మనయింట నిచ్చ టచ్చో
టన కెచ్చుటనైన నీబృ ♦ హన్నల మెలఁగం
జని యెడుమానిసి తన మన
మున కిమ్మగునట్టి చరితమున వర్తించున్. 254

-♦ నకులుఁ డశ్వపాలకుఁడై విరటు గొల్వ వచ్చుట. ♦-

వ. అని యిత్తెఱంగున నయ్యిరువుర నొండొరులకు నప్పగించి
పుచ్చిన యనంతరంబ నకులుండు. 255

ఉ. వేంబుజముల్ సముద్యదరు♦ణాంశునిఁగన్నవిధంబునం వికా
సంబున నుల్లసిల్లి జన ♦ చారువిలోచనముల్ నిజోజ్జ్వలాం
గంబున కర్థిమై నభిము ♦ ఖంబులుగాఁ జనుదెంచి దైవయో
గంబున భూవిభుండు దుర ♦ గంబులఁ దేరఁగఁ బంచి
చూడఁగన్. 256

వ. ఆస్థానంబు సేర వచ్చి ఘోటకంబుల నుపలక్షించుచున్న
నన్నరేంద్రుండు గనుంగొని పరిజనంబుల కతనిం జూపి. 257

క. ఇతఁడెవ్వఁడొకో రూపు ని
రతిశయమై మనకునుఁ బ్రి ♦ యం బొసఁగెడుఁ జూ
చితిరే చిత్తంబు నుదా
త్తత గానఁగనయ్యెడున్ వ ♦ దనమునభంగిన్. 258

క. తురగంబులఁ జూచువిధం
బరయఁగ నితఁ ♦ డశ్వవిద్యయందు నిపుణత
స్ఫురణము గలవాఁడగు బం
ధురమూర్తి పరాక్రమాన్వి ♦ తుఁడు గానోపున్. 259

క. మీరెఱిఁగినఁ జెప్పుఁ డీతని
పే రెఱుఁగనియట్టులైనఁ ♦ బొంపారంగాఁ
జేరంజని యుల్లన యొకఁ
డారసి యెఱుఁగంగ వలయున ♦ స్సమయమునన్. 260

క. చేరఁ జనుదెంచి పాండవ
వీరుఁడు మత్స్యాధిపునకు ♦ వినతుండై దే
వా రాజవాహనము లగు
వారువముల నరయ నేర్తు ♦ వలనేర్పడఁగన్. 261

వ. దామగ్రంథి యనువాఁడ నాకు నశ్వవిషయంబయిన విచ
క్షణత్వం బెల్లనుం గల దవధరింపుమని యిట్లనియె. 262

సీ. అవయవలక్షణం ♦ బాయుః ప్రమాణంబు
గర్భంబు లింగితా ♦ కారములును

హాత్రాంతరము వయో ♦ మానంబు దేశకా
లోచితాహార ప్రి ♦ యోగభంగి
గాత్ర్యానురూప శి ♦ క్షావిధి క్రమగతి
వ్యాయామ సాత్మ్యప్ర ♦ వర్తనంబు
ప్రమదవిషాదాది ♦ బహువిధచిత్తధ
ర్మము పోషణప్రకా ♦ రము చికిత్స

తే. పరిచితములు ధరణి ♦ పాల నీముందట
రూపురేఖ మెఱయఁ ♦ జూపనేర్తు
బవరమైన నాకుఁ ♦ బనియేమి యనఁ జేతి
బలిమికలిమి నెఱపఁ ♦ దలఁపుగలదు. 263

అనిన విరాటుం డతనికి ట్లనియె 264

క. నీకుఁ దగు పదవియిచ్చెద
నాకలిమికి నెల్ల రక్ష ♦ ణం బొనరింపం
గాక హయశిక్షకుఁడ వను
నాకొలఁదియె యిట్లుపలుకు♦టనుచితమరయన్. 265

ఆ. అనుడు నకులుఁడిట్టు ♦ లను దేవ తమతమ
నేర్పుపనులవెంట ♦ నెగడి బ్రదుక
వలయుఁగాక నగరఁ ♦ దలము దప్పిన మేలం
కువల కలుపు లియ్య ♦ కొనుట దగునె. 266

ధర్మసుతుండు మెచ్చె ననుఁ ♦ బానతురంగమశాస్త్రశిక్షకుం
గర్మఠుఁ జేసి యాత్మతుర ♦ గంబులకెల్లను నన్నుయుక్తుఁగా
నర్మిలినిల్పి యాగియుఁ బ్రి ♦ యంబును నాయెడ నాఁడు

నాటికిం । బేర్మి వహించుచుండ నడ ♦ పెం దనతమ్ములలోని
వానిఁగాన్. 267

క. ఆవిభుఁడు రాజ్యసుఖలీ
లావిముఖత వెడలి బంధు ♦ లం దొఱఁగి యథే
ష్టావాసత బ్రింగుడువడి
పోవుట నెచ్చోటఁ గడుపుఁ ♦ బ్రోతునొ యనుచున్.

క. తిరిగితిరిగి లోకోత్తర
చరితుఁడు సుజనుండు మత్స్య ♦ జనవిభుఁడు యుధి
ష్ఠిరునట్ల యనఁగ విని నినుఁ
గర మనురాగమునఁ గొలువఁ ♦ గా నియ్యెడకున్. 269

క. చనుదెంచి కాంచి నానే
ర్చిన తెఱఁగున విన్నపంబు ♦ సేసితి నన్నుం
బనిగొనఁ దలఁచిన నేలెడి
దనుమానము గలిగెనేని ♦ నరిగెద నధిపా. 270

వ. అనవుడు. 271

ఉ. ఆ నరనాథుఁ డిట్లనియె ♦ నశ్వములం బరికించి యున్కియుం
వేనిఁ దురంగశాలలకు ♦ నెల్లను ముఖ్యుఁడ వై తదీయనా
నానియతప్రకారకర ♦ ణంబులఁ ద్రిమ్మరుచున్నవారి ము
న్నే నెటు నట్ల నీ వరసి ♦ యిచ్చమెయిం బని గొమ్ము నె
మ్మితోన్. 272

క. అని చెప్పి యధిక సమ్మా
నన పూర్వము గాఁగ మత్స్య ♦ నరపతి మాద్రీ

తనయుఁ దగనిల్పె నాతఁడు
దన మదిఁ బ్రియమందె నతని ♦ తమ్ముం డంతన్. 273

—♦ సహదేవుఁడు గోపవేషంబున విరటుఁ గొల్వ వచ్చుట ♦—

క. పావన శాంతత్వము నిజ
భావంబున సూక్ష్మలతయుఁ ♦ బ్రకటంబులుగా
నావిధుఁడు మనుజవేషుం
డై వచ్చెనో శిఖిశరీరి ♦ యయ్యెనో యనఁగన్. 274

క. తలుగుల పొది యొకదెసఁ బె
య్యలదామెన యొక్కవలన ♦ నను వైయుండన్
మొల మోపి పెక్కుచుట్లన్
బలుద్రాటఁ జుట్టి గోప భావంబమరన్. 275

చ. నును సెలగోల సేకొని మ♦నోహర మాతనమేను రాజుచూ
పును బ్రజచూడ్కులం దిగువఁ ♦ బుష్కర పత్రనిభంబు
లైనలో। చనములు మూర్తిదెల్పఁగ స ♦ సంభ్రమతం
జనుదెంచె నల్లనల్లన వెడభీతి దోఁప జను ♦ లన్ వెగడ
య్యెడుదృష్టిఁ జూచుచున్. 276

వ. ఇట్లు వచ్చి మత్స్యమహీవల్లభు నంతంతం జేరి వినయా
వనతుం డగుచు నిట్లనియె. 277

క. నీపసులఁ గావఁ బెట్టుము
భూపాలక నన్ను నేను ♦ బూని యరసినన్
గోపంక్తులు రుజ వడ వారు
చేపడ వెన్నఁడును డప్పిఁ ♦ జేడ్పడ వెచటన్. 278

తే. తొఱఁగువోకుండ మొకములు ♦ గఱవ కుండఁ
బాఁడి దఱుఁగకయుండ నా ♦ పాటిగొల్ల
లిచ్చు మెచ్చు నీదృష్టికి ♦ నెక్కఁగదుపు
నరయనేర్తు సన్నెలుము ♦ ధరణినాథ. 279

వ. అనిన విరాటుండు పాండవావరజున కిట్లనియె. 280

ఉ. ఎక్కుడిమాట గొల్లతన ♦ మించుకయేనియు లేదు నీదెసం
జక్కని మేను నిగఱువ ♦ చందముఁ గాంతియుఁ జూడవచ్చి
నన్ నిక్కువమీవు సూర్యశశి ♦ నిర్మల వంశజులైనరాజు
లం దొక్క మహానుభావు తన ♦ యుండవు గావలయున్
నరోత్తమా. 281

ఆ. వలయు పదవియందు ♦ నిలిచి నారాజ్య మం
తయును జక్కఁబెట్టి ♦ నయమువిక్ర
మంబు నడపునంత ♦ మానిసివై యుండి
కుచ్ఛితంపు బ్రతుకు ♦ కోరఁదగునె. 282

వ. ఉత్తమవాహనంబులు మహనీయాయుధంబులు నిచ్చెద మత్స్యదేశంబున భవదభిమత స్థలంబొసంగెద మదీయ మండల సేనాపరిపాలనంబు సేసి వర్తిల్లుము. 283

కం. అనవుడుఁ బాండునృపాలక
తనయుండు మ్రొక్కుచు విరాటు ♦ ధరణీశున కి
ట్లను హీనకులుఁడ బాలుఁడ
మును నాగరికంపుఁ గార్య ♦ ముల వెర వెఱుఁగన్.

ఆ. పసులఁ గాచి కాని ♦ బ్రతుకఁ గౌరవుల ప్రాఁ
తలము మున్ను నేను ♦ ధర్మపుత్రు

పశుగణంబు నెల్లఁ ♦ బాలింతు నమ్మహీ
వరుని చిత్తమునకు ♦ వచ్చువాఁడ. 285

వ. తంత్రీపాలుం డనం బరఁగినవాఁడ నాచేతం గ్రేపులు పురా
ణించుటం జేసి కొండొక కాలంబునన కదుపులం బెనుతు
నే నగునని కైకొనిన యూఁబోతుపంచితంబు మూర్కొని
నను గొడ్రాలి పీచినను గొడ్డునకైనం జూలు నిలుచు
నుంగిడీ యదురుఁ ద్రిక్క యనువానికి నాపేరు సెప్పినం
జాలు మఱియును బసికి వలయు తెఱంగు లెల్ల నెఱుం
గుదు వే ఱొక్కపనికిం గాను గాని యే నీవెంట నీ
మనసు వడయం జాలుదు నావలనం బ్రయోజనంబు గొన
వలయునేని నొండుమాటలు పక్కి పసులం బరికింప నియో
గింపుము. 286

చ. అనుటయు నిట్ట కేలకు ధ ♦ రాధిపుఁ డట్టుల కాక యంచు
నా । తనివచనంబు సూచి యుచి ♦ తంబగునేనిఁ బ్రియంబ
యేని నె । ట్లును గురుకార్యవర్తనము ♦ లుర్ రుచింపుం
పక యుండునేని గో । ధనముల కెల్ల రక్షణము ♦ దత్ప
రతం దగఁ జేయు ముఖ్యతన్. 287

క. మున్ను గలగోపవర్గము
నిన్నుం గని కొలిచి భక్తి ♦ నీపని సేయన్
మన్ననమానిసి వైవ సి
యున్నం గడు మేల కాక ♦ [1]యొప్పమి గలదే. 288

---

1. ఘ. జ. యొప్పగు నదియున్.

—♦ ద్రౌపది సైరంధ్రీ వేషమున సుదేష్ణఁ గొలువ వచ్చుట. ♦—

వ. అని పలికి యతనియభిమతంబు సలిపి నిలిపె నట్లయ్యే
వురును విరటుం గొల్చిరి తదనంతరంబ. 289

క. గారవమున నిజదేశా
చారముమై నల్లి యున్న ♦ జడ యగుకబరీ
భారంబు విచ్చి తిరముగ
సైరంధ్రీజాతివేష ♦ సముచిత భంగిన్. 290

క. వలపలిదిక్కున కించుక
మలఁగంగాఁ దుఱుమిడి కుఱు ♦ మాపుడుఁబుట్టం
బలవడఁ గట్టి జరఠవ
ల్కలమున 1నెవ్వేఁగుఁజన్నుఁ ♦ గవ గప్పి తగన్. 291

క. పరిచారికాత్వరేఖా
పరిణతి దనమేన నచ్చు ♦ వడుభావనకుం
దిర మై తలకొను నంతః
కరణముతోఁ బురము ద్రుపద ♦ కన్యక సొచ్చెన్. 292

వ. ఇట్లు సొచ్చిన. 293

సీ. పఱమొయిల్ గప్పినఁ ♦ బాడఱినను గాంతి
గదలినయమృతాంశు ♦ కళయుఁబోలెఁ
బెనుమంచు మీఁదఁ బ ♦ ర్విన వికాసము దప్పి
చెలువు గుందిన సరో ♦ జిని విధమున
ధూమంబు వొదివినఁ ♦ దుఱుఁగలి మెఱుఁగులు
నలఁగి మాసినదీప ♦ కళికపగిది

1. క. నవ్వేఁగుఁ; నునుబిగువుఁ.

ధూళి పైఁ బొరసినఁ ♦ దొంగలించుట మాని
లావణ్య మెడలిన ♦ లతికభంగి

తే. గంధకారికావేషంబు ♦ కతన మూర్తి
యుజ్జ్వలత్వంబు మఱుఁపడి ♦ యుండఁ బాండు
తనయ మహిషి యంచితగతిఁ ♦ జనఁగ రాజ
వీథిఁ బౌరజనంబు ల ♦ వ్వేలఁదిఁ జూచి. 294

సీ. రోహిణి యొండె నొండెను న ♦ రుంధతి గాక మనుష్య
జాతియే । యీహరిణాక్షి చెల్వమున ♦ యేడ్తెఱ చూడ్కుల
నాఁచికోల కా । దా హితగౌరవం బగుశు ♦ భాంగముఁ
దేజముఁ జూడ బుద్ధి సం । దేహముఁ బొందుచున్నది 1స ♦
తీజన మిట్టిదె యొజ్జగంబులన్. 295

వ. అనుచు నంతంతం జేరి. 296

క. నీ వెవ్వ రేమిపనికై
యేవలనికిఁ బోవు చునికి ♦ యిది నాపుణ్యము న
ద్దేవియు సౌముఖ్యము 2సం
భావనముం దోఁప నుచిత ♦ భంగిం జెప్పెన్. 297

ఆ. ఏను గట్టువాలు ♦ దాన నా కెవ్వరు
గడుపుకూడు వెట్టి ♦ కట్టఁ జీర
యిచ్చి సాకతమున ♦ నేలుదు రట్టివా
రలకుఁ బనులు సేసి ♦ మెలఁగుబుద్ధి. 298

1. గ. జ. సతీజను లిట్టిరె. 2. జ. సద్భావంబును.

వ. అనువుడు. 305

క. [1]తనతలచీర యరసి య,
వ్వనితారత్నంబు వినయ ♦ వైభవము సతీ
తను వొందినచందమ్మునఁ,
జనియెం గేకయసుతాను ♦ చారికలబడిన్. 306

వ. ఇవ్విధంబునం జని సౌధంబునుపరిభాగం బెక్కి. 307

సీ. పదతలంబులకెంపు ♦ పరఁగినతలము కుం,
కుమలిప్త మైనచం ♦ దముపహింప
నంగంబునునుఁగాంతి ♦ యడరినగోడలు
వేదులు మణిమయ ♦ విధము నొందఁ
గనుఁగవమెఱుఁగులు ♦ గదిరినముందఱఁ
బుష్పోపహారంబు ♦ పోలుపు దాల్ప
వేనలికప్పు ప ♦ ర్వినమీఁదు నీలదు
కూలంబుమేల్కట్టు ♦ కొమరు వడయఁ

తే. దానుజొచ్చినసకతన మ ♦ త్స్యక్షితీశు
నింట నిమ్మెయిఁ గ్రొత్తయొ ♦ ప్పెసక మెసఁగ
నమ్మహాదేవి యున్నెడ ♦ కల్లనల్లఁ
బాండురాజతనూభవ ♦ పత్ని యరిగె. 308

వ. కేకయరాజనందనయును. 309

---

1. 'తలచీర యరయుట' యనఁగా స్త్రీజనోచిత మగుబెట్టు నూనుట. ఇందులకు. 'హ్రీనిషేవాన్వితా, అనిమూలము గానోపు. 'శౌరి తలచీర వాటింప నేరదయ్యె' (భాగవత. దశ. ఉ. 3౫౬) గ. జ. తనతలఁపు నెఱసె నని యశ్వనితా.

చ. [1]కనుఁగొని గారవంబును మొ♦గంబును గేలుఁ బురఃప్రసార
ముం। దనువును నమ్రభావమును ♦ దంతమరీచులు సామి
నిర్గమం। బును దనలోఁ గడల్కొనఁగ ♦ భూరితరాదరరేఖ
నిందు ర। మ్మనవుడు నంత నంత ద్రుప♦దాత్మజ సేరి వినీతి
నిల్చినన్. 310

క. ఆపాదమస్తకము త
ద్రూపము వీక్షించుచుం గు ♦ తూహల మడరన్
భూపాలమహిషి యిట్లను
నాపాలఁతుకతోడ నుచిత ♦ మయ్యెడుభంగిన్. 311

ఆ. ఏది కులము నామ ♦ మెయ్యది యెవ్వరి
దాన వేమిపనికిఁ ♦ బూని యిప్పు
డెచటు బుద్ధిఁ దలఁచి ♦ యేఁగెద వింతయు
నెఱుఁగఁజెప్పు మాకు ♦ నెఱుఁగఁబోఁడి. 312

వ. అనిన విని యాజ్ఞసేని యిట్లను నేను సైరంధ్రీజాతి సంభూత నభిదానంబు మాలిని పురుషపంచకసనాథ నై యుండుదు నొక్కకారణంబున నుద్ధతు లగువిరోధులచేతం బతుల సన్నిధిం దలవట్టి యీడ్వంబడి వనంబునకరిగి వ్రతంబుమై వల్లభ సహితంబుగా వన్యాహారంబులం గాలంబు గడపుచు బ్రహ్మచర్యంబు నడపితి నిటమీఁద నియమాచరణంబునకు నొక్కసంవత్సరంబు గొఱంత గలదు నీవుధర్మవర్తిని

1 ఇట 'గారవంబున మొగంబు' నిత్యాదు లగుజతలు భాషాశైలీ ప్రయుక్తములు. ఇట్టివే యితర పర్వములనుం జూపబడెడిని. ఆ. గారవంబున ...గేల...దనువున.

వని వినుటంజేసి నానేర్చుపనులవెంట నీకడ నిలువం దలంచి యిందువచ్చితి ననవుడు సుదేష్ణ యిట్లనియె. 313

క. సురగరుడ ఖచరవిద్యా
ధర కిన్నర యక్ష సిద్ధ ♦ తరుణులలో నీ
వరయంగ నొక్కతె వగు ది
ష్ఫురికిం జనుదేరం గతము ♦ బొంకక చెప్పుమా. 314

క. అనుటయు దరహాసితము మో
మునకుం దొడవుగాంగ బలుకు ♦ ముద్దియయేం గృ
ష్ణుని దేవి సత్యభామకుం
బనిసేయుదుం దొల్లి పిదపం ♦ బాంచాలి కడన్. 315

తే. తగవుమైం బరిచారికా ♦ ధర్మములకు
నెల్లంజాలి వర్తించితిం ♦ దల్లి వినుము
నాకుం బ్రాణంబు ప్రాణమై ♦ నన్నుందన్న
కాంగ భావించి యాదేవి ♦ గారవించు 316

వ. నీవును. 317

క. నీచములయ్యెడు పనులకు
నాచాలమి యెఱింగి మన్న ♦ నకుంబాత్రముగా
నీచిత్తంబునం గైకొని
యాచారము దప్పకుండ ♦ నరయుము నన్నున్. 318

వ. అని యిట్లు దేవజాతి యను సందియంబు వాయంబవలికి మఱియును. 319

క. కలపములు గూర్చ బహువిధ
తిలకంబులు వెట్ట వింత ♦ తెరువునఁ బలు 1పు
వ్వులు గట్టికట్టి మోడ్వఁగఁ
దలముడువఁగ సరులు గ్రువ్వఁ ♦ దద్దయునేర్తున్. 320

మ. అనినం గేకయరాజనందన ప్రభూ ♦ తాశ్చర్యయై యిట్లను
న్। విను నీరూపము సూచి మాన్నృపతి యు ♦ వ్విళ్లూరు
నే నెమ్మోముం । బనిగొందుం దగ నింతులుందగిలి నీ ♦ పైఁ
జూడ్కి నెక్కొల్పి నె। మ్మనముల్ విస్మయమందఁ జూచె
దరు భా ♦ మా పల్కు లింకేటికిన్. 321

క. దుర్భరవగు నినుఁ గర్కటి
గర్భము ధరియించునట్లు ♦ గైకొని నాకై
నిర్భర విధ్వంసదశా
విర్భావము దెచ్చికొనుట ♦ వెరవైయున్నే. 322

ఆ. అనిన నీతలంచి ♦ నట్లకా దేర్పడ
వినుము నాదుపతులు ♦ వెరవు లావు
నలఘువిక్రమంబుఁ ♦ గలుగు గంధర్వులే
మఱరు నన్ను నొక్క ♦ మాత్రియైన.

క. నీచమతి నన్ను నెవ్వఁడు
సూచిన నారాత్రిలోనఁ ♦ జూతురు దెగఁ దా
రాచపలు హరిహరాదులు
గాచిన బలవిక్రమముల ♦ ఖర్వములైనన్. 324

1. క. జ. పుష్పులు.

క. బంధు శతంబులు శౌర్యమ
దాంధములై శక్తిసంప ♦ దాభీలతమై
సింధుర సదృశత నున్నను
సంధుల సంధులెడలించి ♦ చంపుదు రతనిన్. 325

వ. కావునఁ బురుషులు నాకడం దేఱి చూడను వెఱతు రదియు
నుంగాక. 326

క. నాచిత్తము తాదృశులకు
గోచరమే అస్మదీయ ♦ కులజన1సంశి
క్షాచారమహిమ యట్టిది
యే చెప్పకు తద్విధాతి ♦ హీనవచనముల్.

చ. మనమున నూరడిల్లు మను ♦ మానము మానుమునన్ను
నేలు మే । పనులు నుదాత్తనాగరిక ♦ భంగుల నీమది కెక్కుఁ
నట్లు నే । ర్పును భయభక్తులుఁ మెఱయ రూపుగఁ
జేసెదఁ దజ్ఞులైనస । జ్జనులు నుతింప వర్తనము ♦ సాధు
లు వృద్ధులుమెచ్చఁ జల్పెదన్. 328

క. ననుఁ గుచ్చితంపుఁ బనులకుఁ
బనుపక యెంగిలికి లోను ♦ పరుపక తగు మ
న్ననతోడ నరయువారల
కనురాగము నెఱపి నడతు ♦ రస్మత్పతులున్. 329

ఆ. అనిన సంతసిల్లి ♦ యద్దేవి సైరంధ్రి
నూరడిల్లఁ బలికి ♦ యునిచికొనియె

1. ఘ. సంరక్షాచార.

నంతిపురముచరిత ♦ కలవడ మెలంగుచు
నుండెనవ్వధూటి ♦ యును ముదమున. 330

క. ఇవ్విధమున నయ్యేవురు
నవ్వేలఁదియు సకల జనుల ♦ కజ్ఞాతముగా
నవ్విరటుప్రోలఁ బ్రమదము
నివ్వటిల వసించి రుచిత ♦ నిభృతత్వమునన్. 331

వ. అనిన విని వారల వర్తనం బటమీఁదఁ జెల్లిన తెఱం
గెఱింగింపు మని యడిగిన. 332

ఉ. బాంధవ శాస్త్రవాకలిత ♦ భావభవా భవపాశ [1]బంధసం
బంధ విరామరామ పరి ♦ పక్వ వివేకనిరూఢ భక్తహృ
ద్గ్రంథ విభేదనా పరమ ♦ కారుణికా పరిమాణదూర దుః
ఖేంధనపావకాయితసమీక్షణ [2]చైత్రమహాద్భుతప్రభా.

క. అన్నమయత్వాదివిరా,
మోన్నతివాఙ్మనసదూర ♦ యోగిస్మేరా
భిన్నాభిన్నాకార,
చ్ఛన్నాత్మీయప్రగార ♦ జగదాధారా. 334

మాలిని. కమలభవకిరీటస్రగ్గామపద్మావలీసం
గమసుభగపదాబ్జా ♦ గాఢభక్తిప్రకార
ప్రముదితమునిశశ్వ ♦ ద్భావనాగమ్యరమ్య
క్రమపరిణతమూర్తీ ♦ శ్రౌతశాఖాగ్రవర్తీ. 335

1. వల్లికాబంధ. 2. ఇది 'సంవిత్ప్రభావల్లభా' అనుటం బోలినది.

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్య పుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతంబైన శ్రీమహాభారతంబున విరాటపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము. 336

---

శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్ర మహాభారతము.

## విరాటపర్వము, ద్వితీయాశ్వాసము.

---



మదపాంగాలోకన
ధామసకృత్సంగరూఢతాదృశవిభవో
ద్దామాశ్రితలోకా లో
కామయనిర్హరణనిపుణ హరిహరనాథా. 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్టియెడ ధర్మసూనుండు సభాజనంబుల యుల్లంబులు రంజిల్ల రాజునకు వినోదంబులు వివిధోదాత్త ప్రకారంబులం జలుపుచు నొక్కొక్కమాటు మధురప్రసంగంబుగా నాడిన నెత్తంబున గెలిచిన విత్తంబులు దమ్ముల కొసంగుచుండు వాయునందనుండు వంటకు మిగిలిన మాంసంబు లమ్మి నెపంబున నిచ్చలు సహోదరులులకు నిచ్చుచుండు వివ్వచ్చుండు సంగీత ప్రసంగంబున మెచ్చువడసినకనకాంబరాదులు సోదరులకుం జేర్చుచుండు నకులుండు [1]తురంగంబులగ్రాసంబులం గనినధనంబులు తోడంబుట్టువులకుం బెట్టుచుండు సహదేవుండు గోవులం జూచి భూవల్లభుండు సంతసిల్లిన సమయం

1, క. తురంగప్రసంగంబుల.

బున సముపార్జితంబు లగుపదార్థంబు లన్నియు నన్నలవ
శంబు సేయుచు వారలకు గోరసంబులం దుష్టిసలుపు చుండు
ద్రౌపది ద న్నరసికొని తిరుగు చున్నవీరులం గన్నులారం
జూచుచు నుచితంపునడవడి మెలంగు చుండు. 2

తే. ఇట్లు దమతమవర్తిల్లు ♦ నెడల సకల
జనములకు హృదయానురం ♦ జన మొనర్చి
తాల్మి పుయులోట యడంకువ ♦ తగవు మెలపు
నెఱి దెఱంగును బాటింప ♦ నేర్పు గలిగి. 3

క. ఉన్నతఁటి వివిధదేశో
త్పన్నులు నద్భుతవిధాయి ♦ బలవిక్రమసం
పన్నులు నగుమల్లులు శిభ
వోన్నతుఁడగువిరటుపాల ♦ నుద్భటవృత్తిన్. 4

క. తమలోన మాటలాడెడు
సమయంబున నొక్కరుఁడు వి ♦ శాలోరస్కుం
డమితబలుఁడు పంచానన
సమమూర్తిస్ఫూర్తి యధిక ♦ సంరంభమునన్. 5

వ. అన్నరపతికట్టెదుర నిల్చి భుజాస్ఫాలనంబుఁ జేసియట్లనియె

తే. నేలనాలుగు సెఱఁగుల ♦ నృపులకొలువు
లందు నేను వర్తించితి ♦ నవనినాథ
యగ్గలించి నాయెదుర బా ♦ హాప్పళించి
1కడఁగఁ జాలెడు మల్లుఁ ♦ గాననెందు. 7

1. చ. కడవఁజాలిన.

చ. అనునెడ వానియుగ్రసమ ♦ దాకృతియుం బటువాక్యవృత్తి
యుం । గని విని మల్లులెల్ల భయ ♦ కంపిత మూర్తులు
దాల్చి మాఱు వ । ల్కను గను విచ్చిచూడను మొ ♦
గం బెగడింపను జాలకున్న న ! జ్జనపతి వేడ్కఁ బ్రౌఢు
పడు ♦ చందము గాంచి యుధిష్ఠిరుం డనున్. 8

క. వీనికి మాఱొకఁ డనఁ జాలెడు
దానికిఁ దగువాని ధర్మ ♦ తనయుని పురిలో
నానానియుద్ధలంపటు
నేనొక్కనిఁ గంటి [1]నిప్పు డిందులక తఁడున్. 9

క. మన బానసీఁడు వలలుం
డను శూద్రుఁడు నాకుఁ దెల్ల ♦ మధికబలుల నో
ర్చినవాఁ డనేక మల్లుల
నిను మెచ్చింపంగఁ జాలు ♦ నిజ మిది యధిపా. 10

క. అనవుడు భూపతి పిలువం
బనిచె నతని నతఁడు నపుడు ♦ భయ భక్తులతోఁ
జనుదెంచి మల్లవర్గము
గని పై వెఱుగంగ నిలిచెఁ ♦ గౌతూహలి యై. 11

వ. ఇట్లు నిలిచిన పవనతనయు నవలోకించి యవనీవల్లభుం
డమ్మల్లముఖ్యుం జూపి యితనితోడి యుద్ధంబునకు సన్న
ద్ధుండవు గమ్మనిన నతండును ధర్మతనయు కనుసన్న గయి
కొని యమ్మత్స్యవిభునకు వినయంబుతో నిట్లనియె 12

1. క. నిపుణుఁ డిందుల కతఁడున్.

తే. అధిప ధర్మజుపాలను ♦ న్నప్పుడతని
వేడుకకుఁ దగఁ బెనఁగుదు ♦ మింతలైన
జెట్టిమల్లులతో నిప్పు ♦ డట్టువోలె
నీమవేడ్కకుఁ బెనఁగెద ♦ నేర్చినట్లు. 13

—♦ భీముఁడు మల్లునితో యుద్ధము సేయుట. ♦—

వ. అని మెత్తన యియ్యకొని గర్జించి గజాలస్యంబున [1]నంగ
ణంబుసొచ్చి భూపాలుని ముందట భుజాస్ఫాలనంబు సేసి
మ్రొక్కి మరలునెడ నంతకుమున్న యమ్మల్లవరుండు నర
పతి యనుమతి వడసి కృతపరికరబంధుండై యరుగుదెంచి
యచ్చట నునికిం జేసి యతండును ననిలసుతండును బర
స్పరమూర్తుల నవలోకించి యుద్ధరంగంబుమన్ను ఫాలప్రదే
శంబుల ధరియించి శిరంబులపైఁ జల్లుకొని రెండు సేతుల
మునివ్రేళ్ళను గొండొక వుచ్చికొని యొండొరుల దెసకు
వైచి యున్నతంబులగు నపసవ్యకరంబుల నాకుంచిత
సవ్యబాహుతలంబుల నప్పళించు చప్పుళ్ళు గలసి యొక్క
రుండ మల్లచరచిన చందంబున వీతెర వింతతానకంబుల
నిలిచి కదసిన యప్పుడు వృకోదరుండు. 14

సీ. [2]ఉపతాయిలోఁ దన కొదవిన తోరహ
త్తము సూపి వ్రేయక ♦ సమదవృత్తిఁ
బాసి క్రమ్మఱఁ జేరు ♦ బలువిడి వాఁడు పై
నపరిన జరగక ♦ యవనిఁ గ్రుంగి

1. క. కంటకంబు; చ. సంఖణంబు. జ. సంఘణంబు; ఘ. నంఖణంబు నంకణంబు. 2. చ. ఉపతాయిలోఁగొన ♦ కొదవిన.

నిలుచు నొత్తొరువున ♦ వలచిన యప్పుడు
గొనిపోవు నవలీలఁ ♦ గూల్వైచు
జళికి పట్టిన మను ♦ సన్నపు విన్నాణ
ములు దొరకొన్నను ♦ ముట్టఁగొనఁడు
తే. కాలిదెసఁ జొరవచ్చుట గానిపించి
1యుడుగు సీసానఁ బట్టియు ♦ 2ప్పళించుఁ
బోవనిచ్చు మగుడ 3నేచి ♦ పోరఁ జేరు
4నెడల సరిసేయ నగుతడ ♦ వీకహత్తు. 15

వ. మఱియు ననేక గతుల యోజలు మెఱయుచుఁ గొండొక
సేపు విరాటునకు వినోదంబు సలిపి. 16

ఆ. కచ్చ యుమరఁబట్టి ♦ కాళ్ళును చేతులు
వ్రేల మత్తగజము ♦ లీల మెఱయ
ముష్టిబలువు నెఱయ ♦ ముక్కున వాతను
నెత్తురొలుక మల్లు ♦ నెత్తి వైచె. 17

వ. ఇవ్విధంబున విసరి నేలతో వ్రేసి పీఁపున మండి వెట్టిన.
క. పెలుకుఱి తాళంబీమదిఁ
దలఁచి యనువుగాక ధరణి ♦ తలముఁ గరతలం
బుల నప్పళించె వాఁడ 18
కొ్క్కలు వార్వఁగ 5విడిచి మెఱసెఁ ♦ గుంతీసుతుఁడున్.

వ. ఇవ్విధంబున మహాబలుపట్టి యాజెట్టి నెట్టనగెల్చిన మత్స్య
పతి మెచ్చి తనకిచ్చిన ధనంబు లచ్చటి జనంబుల కిచ్చి

1. క. యడుగు. 2. చ. నప్పళించి, జ. నప్పళించి. 3. ఖ. లేచి ♦ పో. 4. ఘ. జ. వెడల...నగునెడ ♦ వీఁక. 5. ఘ. విఱిచి.

నిజ నివాసంబునకుం జనియె మఱియు ని త్తెఱంగున నతనికి వేడ్క సలుపుచుండుఁ జిక్కని మల్లులు లేనితఱి నంతిపురంబు నింతులు సూడ నయ్యవనీకాంతుండు పోరింప శార్దూల శుండాలాదులదోడ నీడంబోక పెనంగి భంగంబు నకుందెచ్చి మెచ్చించు చుండు. 20

క. వెఱవారలు దమమెలఁగెడు
తెఱఁగులు దొరఁకొన్న వింత ♦ తెరువుల నేర్పుల్
మెఱయుచుఁ బతి చిత్తముగొన
నొఱపు గలిగి మాన్యవృత్తి ♦ నుండుదురు దగన్. 21

వ. ఇట్లు పాండవులు పాంచాలీసహితంబుగా విరాటునగరంబున వర్తించుచుఁ గతిపయదినంబులు గొఱంతగా నేఁడుకాలంబు గడపిన సమయంబున మత్స్యపతి మఱందియు దండనాథుండును గీచకాగ్రజుండును రూపాభిమానియు నానాభరణ ధరణ శీలుండును దుర్విదగ్ధుండును బలగర్వితుండును నగు సింహాబలుండు తన యక్క సుదేష్ణకు మ్రొక్కంజనువాఁడద్దేవి కనతిదూరంబున నున్న ద్రుపదరాజ నందనం గనుంగొని. 22

ఉ. అక్కజమైన చెల్వమున ♦ నాత్మకు వేఁగంబు పొల్పు
పొత్తిపై । నెక్కొను చూడ్కిఁ గ్రమ్మరుప ♦ నేరక
యూరక నిల్చెఁ గాముచేఁ । జిక్కిన నెమ్మనంబుఁ గడుఁ ♦
జేష్టుడు మానమిఁ జేష్టితంబులం । దక్కిన యంగముం
దలఁకు ♦ ధైర్యము నై యతఁ డప్పు డయ్యెడన్. 23

తే. ద్రౌపదీ రూపమనుసరిఁ ♦ దగిలి తనదు
హృదయ మనుమృగ మత్తతి ♦ నుదిలకొనుచు
గాముఁడను బల్లిదపువేఁట ♦ కానిబారిఁ
బడుట కెంతయు నాసింహ ♦ బలుఁడు దలరి. 24

వ. నిజాంతర్గతంబున. 25

ఉ. ఎందునునిట్టిరూపునరు♦లెవ్వరుఁగాంచిరె నాకకాదు సం
క్రందనసూతికిం దగిలి ♦ కన్గొనఁ జాలదె దీన నిందిరా
నందనునాజ్ఞ యేచి భువ ♦ నంబులఁ బ్రబ్బదె యుత్తలోదరిం
జెందఁగఁ గాన్పు గాదె ఫల ♦ సిద్ధి పురాతనపుణ్యవృద్ధికిన్.

సీ. ఇయ్యింతి ప్రాపున ♦ నయ్యనంగుఁడు పార్వ
తీశునైనను దక్క ♦ నేల కున్నె
యున్నాతిచెలువంబు ♦ గన్నశచీప్రియుం,
డైనను [1]గనుకలి ♦ [2]నవయ కున్నె
యిత్తన్వి కెన లేమి ♦ కెదిరి పన్నిదము భా
షావిభుతో నైనఁ ♦ జఱవరాదె
యుత్తలోదరిజీవి ♦ తేశున కిందిరా
పతినైన మెచ్చక ♦ పలుకఁ జనదె

తే. కుసుమబాణునిబాణముల్ ♦ గూడ నైదు
గరఁగి నేరిమి వాటించి ♦ కరువు గట్టి
[3]పోసి చేసి చైతన్యసం ♦ పుటము దగ ఘ
టించిరో కాక యిట్టిచే ♦ డియలు గలరె. 27

1. జ. గనుకని. 2. చ. నలియ; జ. నలయ. 3. గ. పోసి విధిచేసి చైతన్య ♦ పుటము దగ ఘటించెనో.

క. ఈనెలఁతఁ గన్నమన్మథుఁ
డైనఁ జిగురుగొడుగుఁ బువ్వు ♦ టమ్ములపొదులున్
లోనుగ సెజ్జలు సేయం
దా నియమింపండె విరహ ♦ తాపము పేర్మిన్. 28

వ. అని వెండియు. 29

సీ. దీనిజన్మంబునఁ ♦ దేజంబు నొందిన
యింతియుఁ బతియును ♦ నెవ్వరొక్కొ
దీనినామాకృతి ♦ గా నోఁచి పడసిన
యిం పగువర్ణంబు ♦ లెవ్వియొక్కొ
దీనివల్లభుఁడనఁ ♦ గా నిల సొబగుసొం
పెసఁగ వర్తిల్లువాఁ ♦ డెవ్వఁడొక్కొ
దీనివసించుటఁ ♦ దా నొప్పి పెంపున
నేపారుమందిరం ♦ బెద్దియొక్కొ

ఆ. దీనిఁ బొందఁ గాంచు ♦ తెఱఁగు నా కెయ్యది
యొక్కొ యిట్టిపనికి ♦ [1]నూఱడిల్లి
తొడుకొనఁగ నిచట ♦ నీ డగుచుట్టంబుఁ
దడవి యెట్టులొక్కొ ♦ పడయువాఁడ. 30

చ. అని యని యుగ్గడించు ధృతి ♦ యల్లల నాడినఁ దల్లడించుఁ
[2]బై । కొనుతలఁ పొరగించు మదిఁ ♦ గోర్కులు పేర్చిన
నప్పళించు నె । ట్టన తెగ నగ్గలించు నచటన్ జనులం బరి

---

1. గ. నూఱడిల్లఁ దోడుగాఁగ. 2. గ. పైకొనుతలఁదొరగించు; చ. పైకొనుతలపొఁత నించు. జ. పైకొనఁ దల యొరగించు.

కించు బుద్ధి దూ । లిన [1]వెస నెంతయుం గళవ ♦ ళించు
మనోజవికారమగ్నుఁడై. 31

క. మాసిన చందముఁ దనుఁ గని
రోసిన డెందంబుఁ గలత ♦ రుణి నెఱుఁగఁడ బి
ట్టేసినమదనునిచే ధృతి
వాసిన బెగ డొందు సింహ ♦ బలుఁ డట్టియెడన్. 32

సీ. వెరవక ననుఁజూచి ♦ పీఁడని యెదఁగలు
మించిన నొండొండ ♦ చెమట వొడమ
ననుచితకృత్యంబు ♦ లాచరించువిధాతృ
బలిమికి నెవ్వాఱ ♦ పాటు దోఁప
నిచ్చట దిక్కు లే ♦ రెవ్వరు నా కను
భయమున మేనఁ గం ♦ పంబు వుట్టఁ
జేయంగ నేమియు ♦ పాయంబు లేమి నా
ననమున వెల్లఁద ♦ నంబు గదుర

తే. నున్న పాంచాలిఁ గనుఁగొని ♦ యన్న రాధ
ముఁడు వివేకవిహీనుఁడై ♦ ముదితుఁ డగుచు
మదనవికృతియ కాఁ దన ♦ మదిఁ దలంచి
రాగసాగరపూరని ♦ ర్మగ్నుఁ డయ్యె. 33

వ. అయ్యవసరంబున. 34

చ. పొలఁతుక కాంతి యింత పొలి ♦ వోవఁగ నీ కెసలారు
తార ని । శ్చలతఁ గడంగి క్రోలికొనఁ ♦ జాలుటఁ గీచక
ముఖ్యులోచనం । బులు నయనం ప్రధాన మను ♦ పూర్వ

1. దెస.

వచస్స్థితి దప్పకుండఁగా । నెలమి వహించెఁ దక్కఁ గల ♦
యింద్రియవర్గము ధిక్కరించుచున్. 35

క. అప్పయుఁ బరిజనములుఁ దనుఁ
దప్పక కనుఁగొనుచు నుండఁ ♦ దగ వేదికరం
బొప్పనితమకము చిత్తముఁ
గప్పికొనుట నుత్తలంబు ♦ గదురఁగ నచ్చోన్. 36

సీ. తన్వంగి మవ్వంపుఁ ♦ దనులత నెసఁగెడు
నునుఁగాంతి వెల్లువ ♦ మునుఁగఁ జొఁఱఁ
గిసలయహస్తకెం ♦ గేల నేపారుక్రొ
మ్మించను [1]లేమెండ ♦ మిగులఁ బర్వఁ
గమలాస్యముద్దమొ ♦ గంబులేమెఱుఁగుల
మొత్తంబుపరి చుట్టు ♦ ముట్టికొనఁగ
ధవళాక్షిలొంగలి ♦ తఱచుఱెప్పల చెన్ను
కప్పనుచీఁకటి ♦ గవియుదేర

తే. బెగ్గలం బంత కంతకు ♦ నగ్గలింప
నొదవు చెమటతోఁ జిత్తంబు ♦ సెదరి యెందు
మెలఁగఁ దలఁపేది యాసింహ ♦ బలుఁడనంగు
పట్టియాడెడు జంత్రంబు ♦ పగిదినుండె. 37

—♦ కీచకుఁడు సుదేష్ణవలన ద్రౌపది తెఱంగెఱుంగఁ గోరుట. ♦—

వ. ఇట్లు కందర్పదర్పగోచరుం డైనకీచకుండు నిజసహోదరి
వలన నక్కోమలి కలరూపు దెలియందలంచి దానిదెసం

1. క. సురయెండ; గ. జ. సులియెండ; చ. సరియెండ.

దగిలినదృష్టి యొట్టకేలకుం దిగిచికొని చని యద్దేవికిం [బజ
మిల్లిన. 38

క. కాంచనపీఠము వెట్టఁగఁ
బంచి ప్రియము చూడ్కి ముసుఁగు♦ వడఁ దను సంభా
వించునెడ నాతఁ డప్పుకుఁ
బాంచాలిం జూపి వేగ ♦ వడి యిట్లనియెన్. 39

ఉ. ఇయ్యరవిందగంధి కుల ♦ మేమి చరిత్రముచంద మొట్టిదో పే
రెయ్యది నాథుఁ డెవ్వఁ డిది♦యెచ్చటి నెప్పుడునుండునిచ్చు దా
నియ్యెడ కేఁగుదేవలయు ♦ టేపని సేయఁగఁ బూని దీనిపై
నెయ్యముకల్మి యేకొలఁది ♦ నీమది కింతయు నాకుఁ
జెప్పుమా. 40

క. అనవుడు నయ్యంగన యితఁ
డనంగశరదళితహృదయుఁ ♦ డయ్యె నకట యీ
తని చిత్తవృత్తి మరలుప
ననురూపం బగు నుపాయ ♦ మది యెయ్యదియో. 41

వ. అని తలంచుచుఁ గీచకునిమాటలు గీటునం బుచ్చి యొండు
పలుకులు జరపిన నతండును సత్త్వహీనుండు గావున సత్త్వో
రుండై క్రమ్మఱి ద్రౌపది యున్నయెడకుం జని యాసవిలా
పంబున నర్త్తాడుచు నమ్మానవతితో ని ట్లనియె. 42

క. ఇవ్వసుమతి నే పొలఁతుల
కివ్విధమునఁ జెలువు గలదె ♦ యెన్నండును నీ
వెవ్వరితనయవు నీపతి
యెవ్వఁడు వే రేమి సెప్పు ♦ మిందునిభాస్యా. 43

వ. అనిన నప్పలుకులు వినియు వినమి భావించి యప్పాంచాలి నిర్వికార యై యూరకున్న నచ్చపలుండు వెండియు నిట్లనియె 44

సీ. తెలిగన్నుఁగవకాంతి ♦ పొలుపార నించుక
గను విచ్చి చూచినఁ ♦ గాదె యబల
చెలువంపునెమ్మోము ♦ నెలమిసొం పినుమడి
గా నల్ల నవ్వినఁ ♦ గాదె యింతి
దంతమౌక్తికరుచి ♦ దలకొన మఱుమాట
పలికినఁ గాదె యు♦త్పలదళాక్షి
యుల్లంబుసరసత ♦ దెల్లంబుగా లీలఁ
గైకొన్నఁ గాదె పం♦కరుహావదన

ఆ. యనుచుఁ జూచుఁ 1జేరు ♦ నమ్ముగ్ధపలుకులు
వినఁగఁ గోరుఁ గేలు ♦ దనదు కేలఁ
గీలుకొలుపఁ దలఁచుఁ ♦ గీచకాధముఁడు ని
జానురక్తి దెలుప ♦ నప్పళించు. 45

వ. ఇట్లు దాన తమకంబున 2వడిగొనుచు నప్పు డయ్యంగన యింగితం బూహింప వెరవు మాలి మఱియును. 46

సీ. సుదతి నీమై చక్కఁ ♦ జూచుట కోడెదఁ
3గనుఁబాటు వొరయునో ♦ యని తలంచి
మది నిగిడ్చినమాట ♦ మగువ నీపెంపునఁ
గుదిసి నానాలుకకెతుదికి రాదు —

1. అ. గేరు. 2. క. మల్లడిగొనుచు. 3. 'గనుఁజాటు' అనియే వ్రా. ప్ర.

పడఁతి నీకరములు ♦ పట్టంగఁ దివిరి శం,
కించి వడఁకెడు ♦ గేలు సూడు
నెఱి నిట్టి దని యింతి ♦ నీనెమ్మనం బెన్ని,
భంగుల నరసినఁ ♦ బట్టువడదు

తే. చెలువ యింక నొక్కించుక ♦ సేపు నీవ
నాదరంబున నెప్పటి ♦ యట్ల యున్న
మన్మథుఁడు సమయించిన ♦ మగఁడ నన్నుఁ
బడయ వచ్చునె యెన్ని యు ♦ పాయములను. 47

వ. అని తనయభిలాషంబు దేటపడం బలికిన నబ్బోటి కలు
షించియు దుర్వారం బైన పరిభవవికారంబు దోఁప కుండఁ
దన్నుం దాన యుపశమించుకొని వీఁడు దురభిమాని యై
యున్నవాఁడు వేగిరపాటు వలను గాదు వెరవుతోడన
తప్పించుకొన వలయు నని యతని కిట్లనియె. 48

క. నాయున్నబాము దలఁపవ
యీయెడ లీచీర యిట్టి ♦ యేవపుఁజందం
బోయన్న మదనవికృతిం
జేయు ననుట యెంతయును ని ♦ షిద్ధము గాదే. 49

తే. చనునె యిమ్మాట లాడ స ♦ జ్జనుల కాఁడుఁ
బుట్టువులతోడ నీవును ♦ బుట్టినాఁడ
వట్టు[1] గాకయు హీనవం ♦ శాభిజాత
నైనపతివత్ని నగు[2]నన్ను ♦ నడుగఁ దగునె. 50

1. క. గ. నైపతివ్రత నగు. 2. క. ఖ. నాకు నడవఁదగునె.

క. అని పీడఁగఁ బల్కిన న
మ్మనుజాధముఁ డంతఁ బోక ♦ మదనోన్మాదం
బునఁ దన్ను నెదిరి నెఱుఁగక
వనితకు నిట్లనియె గార♦వంపుఁ బలుకులన్. 51

సీ. నెత్తమ్మిరేకుల ♦ మెత్తఁదనము దెచ్చి
యచ్చునఁ బెట్టిన ♦ ట్లంద మొంది
చక్రవాకంబుల ♦ చందంబు గొనివచ్చి
కుప్పలు సేసిన ♦ ట్లొప్పు మెఱసి
చందురు నునుఁగాంతి ♦ కం దేర్చి కూర్చి చా
గునకుఁ దెచ్చినయట్లు ♦ గొమరుమిగిలి
యళికులంబుల కప్పు ♦ గలయంతయును 1బుచ్చి
నాఱు వోసినభంగి ♦ నవకమెక్కి

తే. యంఘ్రితలములుఁ గుచములు ♦ నాననంబుఁ
గచభరంబును నిట్లున్న ♦ రుచిరమూర్తి
యనుపమానభోగములకు ♦ నాస్పదంబు
కాదె యీత్రిప్పు లేటికిఁ ♦ గమలవదన. 52

తే. నీవు దుర్జాతి గామికి ♦ నీవ సాక్షి
పరసతీసంగమున వచ్చు ♦ పాపమునకు
నోరుతును గాసి సైరింప ♦ నోపఁ బచ్చ
విలుతుతూపులతాఁకున ♦ కలరుఁబోఁడి. 53

క. అను నప్పలుకుల కయ్యం
గన కోపము గదిరి నీచు ♦ గావున జంకిం

1. క. జ. వెచ్చి.



చినఁగాని మె త్తఁబడి పోఁ
డని మనమునఁ దలఁచి యిట్టు ♦ లనియెం బెలుచన్. 5

—♦ ద్రౌపది కీచకునితోఁ బరుషవాక్యంబులు పలుకుట. ♦—

శా. దుర్వారోద్యమబాహువిక్రమరసా♦స్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవి♦ద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దో♦ర్లీలన్ వెసం గిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట త♦థ్యం బెమ్మెయిన్
గీచకా. 5

తే. అనుడు నతఁ డిట్టు లనియె నా♦యతులబాహు
బలము జెనయంగ భవదీయ♦పతుల కారు
మూఁడులోకంబులందు నె♦వ్వాఁడు [1] లేఁడు
నిక్కువం బింత నమ్ముము ♦ నీరజాక్షి. 5

వ. అనిన విని సైరంధ్రి సైరణ దక్కి ధిక్కరించి యిట్లనియె.

క. చనుఁ జన దని చూడక యం
దనిమ్రాఁకులపండ్లు గోయఁ ♦ దలఁచుట హిత మే
మును చెడిన రావణాదుల
విని యెఱుఁగవె యెన్నఁడును వి♦వేకవిహీనా. 5

తే. ఇవ్విధంబునఁ బలికిన♦[2]యింతిపలుకు
గాన నేరక తమయప్ప♦కడకు మగుడ
నరిగె నెవ్వగ మనమునఁ ♦బిరిగొనంగఁ
జిన్నఁబోయిన మొగముతో♦సింహబలుఁడు. 5

1. చ. జ. లేమి. 2. క. గ. నింతవట్టు.

క. చని మదనాగ్నిజ్వాలలు
దనుకఁగ నిట్టూర్పుగాడ్పు◆దుందడి నిగుడం
దను నూరార్పఁగ సఖిదోరఁ
కొనమికి వెనుఁబడుచుఁ గీచ◆కుం డాసతితోన్, 60

వ. ఏ నప్పుడు నీకుం జూపి యన్వయనామధేయంబు లడిగిన
యప్పొలఁతివలనం జిక్కి చిత్తంబు త్తలపడుచున్నయది యిట
మీఁద నీవ యెఱుంగు దయ్యెంతి యింతసేపు నీచేరువ
నుండి యిప్పు డెట మెలఁగె నని యడిగిన విని యతని
వేగిరి పాటు సూచి శిరఃకంపంబు సేయుచు సుదేష్ణ నిజాం
తర్గతంబున. 61

తే. రాగరసమగ్నుఁ డయ్యె సైరంధ్రిఁ జూచి
యకట దీన నింకేమి య◆పాయమగునొ
వలదు తగదన్న నుడిగెడు◆వాఁడె వీఁడు
మాయదైవము యే సేమి◆సేయుదాన. 62

వ. అయిన నానేర్చుకొలందిఁ దగినతెఱంగున వారించి చూచె
దం గాక యని యూహించి యి ట్లనియె. 63

సీ. లలితంబు లగు మట్టి ◆ యల చప్పు డింపార
నంచకైవడి [1]నడ ◆ నల్లవచ్చి
యెడమేని నెత్తావి ◆ సుడియంగఁ బయ్యెద
సగము దూలించి పై ◆ మగుడఁ దిగిచి
సోలెడు నెలదీఁగ ◆ లీలఁ గ్రాలుచు వింత
చెలువంబు దలకొనఁ ◆ జేరి నిలిచి

1. క. గ. ఘ. నల్ల.

తెలిగన్నుఁగవకు నె ♦ చ్చెలి యైన లేఁత న
వ్వాలయుంగ సరసంపుఁ ♦ బలుకువలికి

తే. మెఱయు [1]చెయ్వుల రాగంబు ♦ మెయికొనంగ
నెడఁద సొగయించు మాటల నెలమి మిగుల
నిన్ను ననురక్తిఁ గొలుచు న ♦ న్నెలఁత లుండ
నీరసాకార సైరంధ్రిఁ ♦ గోరఁదగునె. 64

వ. అనిన నప్పలుకులదెస ననాదరంబు సేయుచు నచ్చేడియం
జూచి కీచకుం డిట్లనియె. 65

క. నాకొలువు వార కార
న్నాకేశుం గొలుచు నంగ ♦ నలలో నైనన్
లేకునికి నాకుఁ దెల్లం
బాకొమ్మకు నీడు వోల్ప ♦ నయ్యెడు సుదతుల్. 66

సీ. గండుమీలకుఁ బుట్టి ♦ కాముబాణములతోఁ
గలసి యాడెడునట్టి ♦ కన్నుఁగవయు
బిసకాండములశిక్షఁ ♦ బెరిఁగి లేఁదీఁగల
మెచ్చక యున్నట్టి ♦ మృదుకరములుఁ
జిగురులతోఁ సంధి ♦ సేసి యంబుజముల
పైనెత్తి చనునట్టి ♦ పదతలములుఁ
గలకంఠములచేతఁ ♦ గఱచినవిద్య వీ
ణల కిచ్చునట్టి త ♦ న్నని యెలుంగు

తే. నత్తెఱంగున రేఖయు ♦ నవ్విధంబు
గలువచందంబు నొప్పయి ♦ కలికితనము

1. అ. రాగంపుఁ జెయ్వుల.

నట్టిచెన్నును సైరంధ్రి ♦ యందకాక
కలవె యొరులకు నెఱుఁగక ♦ పలికి తబల. 67

వ. కావున నా మెలనాఁగ నేమియుపాయంబున నైన నన్నుం జేర్పవైతేనిఁ గందర్ప దర్పంబున నలందురి వందుదు ననిన నవ్వేలాఁది వాఁడియు నిట్లనియె. 68

తే. ఆయురైశ్వర్యకీర్తుల ♦ నపహరించు
పరసతీసంగమము ధర్మ ♦ ధర్మపథమునందుఁ
బరఁగువారలు పరిహరిం ♦ పంగఁ గనియు
వినియుఁ దెలియవె యిది దుర్వి ♦ వేక మగుట. 69

సీ. పతి యెఱింగినఁ దన ♦ ప్రాణంబుపై వచ్చు
ననుభయంబున నల్ల ♦ మదరుచుండ
జనులుగాంచినమాను ♦ మను దూలుఁ దనకను
పుంఠులోటమున మోము ♦ పుల్లగిలఁగ
బోటికిఁ దోఁచినఁ ♦ బోలియుఁ దేఁకువ యను
వెగడునఁ బెయ్యాలు ♦ వీడుపడఁగ
బంధుల కగపడ్డఁ ♦ బాయు సన్వయ మను
కలఁకమైఁ జెమటలు ♦ గ్రమ్ము దేరఁ
తే. గ్రీడ దెసఁ గౌతుకంబురి ♦ యాడ రతుల
చవులు గొనియాడ నేరని ♦ జారపొందు
హృదయమునకును గింపు సేయును ♦ నెఱుక గలుగు
వారు దీని సుఖంబుగాఁ గోరరెందు. 70

వ. అదియునుం గాక. 71

క. బలవిక్రమ సంపన్నులు
గల రేవురు నాసతులు ♦ గంధర్వులు వా
రలఁ దలఁచిన నాచిత్తము
దలఁకెడు నది యేల నీకుఁ ♦ దమ్ముఁడ చెప్పుమీ. 72

తే. కాని తెరువునఁ బోయినఁ ♦ గలుగునయ్య
బ్రదుకు చవియెంతయైన న ♦ పథ్యములకు
వేడ్క సేయుదురయ్య వి ♦ వేకు లెవ్వి
ధమున నాబుద్ధి వినవయ్య తమక ముడిగి. 73

క. అనవుడు నమ్మాటలు దన
మనమునకు సహింప రామి ♦ మల్లడిగొనుచున్
మనసిజ పరతంత్రిత ని
ట్లని పల్కె సుధేష్ణతోడ ♦ నతఁ డుద్ధతుండై. 74

మ. వనితా యే నొకపల్కు వల్కెదఁ జతు ♦ ర్వారాశి
మధ్యంబునన్ । ఘనబాహాబల మొప్ప నన్ను నెదురం ♦
గా నొక్కఁడున్ లేమి యె । వ్వనికిం దెల్లముగాదె దాని
మగలన్ ♦ వజ్రిహతిం గూలు శై । లని కాయం బున
మద్భుజాసమదలీ ♦ లన్ గీటడంగించెదన్. 75

ఉ. బుద్ధులు సెప్పు టెల్ల నటు ♦ పోవిడు మెమ్మెయి నైన
సౌఖ్యసం । సిద్ధి యొనర్పు నాకు నెడ ♦ సేసినఁ దాపము
రూపుమాపు నా వృద్ధియు గోరుదేని నవి ♦ వేకివి నీ వని
నన్ను ని ట్లసం । బద్ధములైన వాక్యములు ♦ పల్కక వే పిలి
పింపు కోమలిన్. 76

తే. అనుచు దైన్యంబు నొందెడు ♦ నాననంబు
తోడ దిగ్గనలేచి య ♦ త్తోయజాక్షి
చరణపీఠంబుకడఁ జక్క ♦ జాఁగి మ్రొక్కి
యున్న నద్దేవి గనుఁగొని ♦ చిన్నఁబోయి. 77

ఉ. ఆవల వచ్చు నాపదల ♦ కన్నిటికోర్చి లతాంగిఁ గూర్చి కా
కీవెడమాటలన్ మరలఁ ♦ డెన్నివిధంబులఁ జూపి
చెప్పినం [1]గావల మైనవీఁడు దగు ♦ కార్యము వట్టునె వీని
కెమ్మెయిం జావు నిజంబు మన్మథుని ♦ శాతశరంబుల
నైన నక్కటా. 78

క. అని మనమునఁ దలపోయుచుఁ
దనతమ్ముని నల్ల నెత్తి ♦ దండడి దొరఁగం
జనుదెంచు నశ్రుపూరము
కనుఁగవలో గ్రింగికొనుచుఁ ♦ గామిని పలికెన్. 79

ఆ. ఇంత [2]దలర నేల ♦ యెమ్మెయి నైనను
గొమ్మ నలవరించి ♦ కూర్చుటరుదె
యుమ్మలంబు దక్కి ♦ యూఱటతోడ నీ
వేఁగు మసలవలవ ♦ దింక నిచట. 80

క. ఆసవమున కని నీదు ని
వాసమునకు దివములోన ♦ వశ్యంబును నే
నాసుదతిం బుత్తెంతు ని
జాసక్తి ఫలింపఁ గొఱలు ♦ మభిమత కేళిన్. 81

1. "కావలము" అనఁగా కావలము గలవాఁడు 'కావలములు చక్కవినరు కార్యవచనముల్.(ఉద్యో. 3-౨౭)ఇది 'గారాము' వంటిది. 2. చ. దలఁక.

—♦ కీచకుండు ద్రౌపదియందలి మోహంబునఁ బరితపించుట. ♦—

వ. అనిన విని కీచకుండు ముదితహృదయుం డంబు నిజసదనంబు నకుం జని వివిధ మధురసంబు లొనరించి సముచితఖాద్యం బులు సమకట్టి తత్ప్రదేశంబు విజనంబు గావించి యొక్క రమ్యస్థలంబున నుండి పాంచాలివలనితగులు చిత్తంబు నుత్త ల పఱుపం దలరి నెవ్వగల కగపడి తలపోఁతలకుం జొచ్చి దుర్విదగ్ధుండు గావున నమ్ముగ్ధకుం దనసన్నిధిఁ గామవికా రంబు వుట్టుట గలుగ భావించుచు. 32

సీ. కేలిమై నొక్కట ♦ లీలఁ [1]గ్రేళ్లుఱికెడు
వాలుగుసోగల ♦ నేలుదెంచి
కరువలిసుడియమిఁ ♦ గదలక చెన్నొందు
నెఱివిరితమ్మల ♦ నుఱక తెగడి
బెడఁ గొందఁ [2]మడిచిమైఁ ♦ దొడసినవలరాజు
వాలికతూపులఁ ♦ దూలఁ దోలి
పొలపంబు మెఱసి దిక్కులఁ ♦ గాంతిపూరించు
క్రొక్కారుమెఱుఁగుల ♦ నుక్కడంచి
తే. తనవిలోచనములు నాకు ♦ మనము నాఁచి
కొనఁగ నయ్యింతి ననుఁ గనుఁ ♦ గొనియె నాత్మఁ
గైకొనియె రాగరసమునఁ ♦ గడలుకొనియె
మదనవిక్రృతి బయల్పడ ♦ నుదిలకొనియె. 33

ఉ. చిత్తముమెచ్చి నావలనఁ ♦ జిక్కఁగ వెండియు నాలతాంగి యచ్చొత్తినయట్లు నాకుఁ దన ♦ యుల్లము దెల్లము

1. చ. బెళ్లెసఁగెడు; జ. గ్రేళ్లెసఁగెడు. 2. చ. జ. దుడిచిచే; దుడిచిన.

సేయ కున్కి దానత్తఱిఁ గ్రొత్తకాన్పగుట ♦ నడ్డము
పొచ్చిన సిగ్గుపెంపు నన్నుత్తల మందఁ జేయుటకు♦నో తల
పోసి యెఱుంగ నయ్యెడు౯. 84

తే. అనుచుఁ గొందలపడు కోర్కు ♦ లగ్గలించి
చిఱుముఱ్ఱాడు చుండ న♦చ్చెలువచెలువుఁ
దగిలి తనయిచ్చఁ బాఱుచి♦త్తంబుపజ్జ
నరిగి యిట్లను నక్కీచ♦కాధముండు. 85

సీ. లీల నాముందట ♦ నాలేమ వొలసినఁ
జూడ్కికిఁ జుబ్బన♦చూఱ గాదె
కను విచ్చి నన్ను నా♦తనుమధ్య సూచినఁ
దనువున కమృతసే♦చనము గాదె
చిఱునవ్వు బెరయ న♦చ్చెలువ నాతోడఁ బ
లికినఁ జెవులకు రసా♦యనముగాదె
యెలమి నమ్మోఁత న ♦ న్నెలయింపఁ దివిరిన
నెడఁద కానందంబు ♦ నిక్కగాదె

తే. యానితంబిని మక్కువ ♦ ననఁగి పెనఁగి
యింపుపొంపిరివోవ న ♦ న్నేలికొనఁగఁ
దలఁచి పొందిన నది జన్మ♦ఫలము గాదె
యనుచు వలరాజుబారికి ♦ నగ్గమయ్యె. 86

వ. మఱియు ననేకభంగుల ననంగవిభ్రమంబుల కనురూపంబు
లైన బహువిధప్రలాపంబులం బ్రొద్దు గడపుచు నమ్మదిరా
క్షి రాక కెదురుచూచుచుండె నక్కడఁ బాంచాలి రావించి
సుదేష్ణ తృష్ణ భావించుచు నిట్లనియె. 87

క. ఒదవెడు తృష పెల్లిదమున
వదనము వఱువట్లు వట్టె ♦ వాసితరాజ
న్మదిరారస మానఁగ నా
హృదయంబున వేడ్క యొసక ♦ మెసఁగెడుఁ దరుణీ.

క. కీచకుని యింట నెప్పుడు
వాచవి యగు[1]బహువిధంపు♦వారుణి గలుగుఁ
బేచని యుచటికిఁ గొని ర
మ్మామధూతము గాని నీగ ♦ మన వేగంబుఁ. 89

వ. అనవుడు 90

ఉ. ఉల్లము దల్లడిల్లఁ దను ♦ వుద్గతఘర్మజలంబు దొప్పుచుఁ
డిల్లపడంగ నా కిది గ♦డిందివిచారము వుట్టె నందుఁ బో
నొల్ల ననంగ రా దచటి ♦ కూరక పోవను రాదు నేర్పు సం
ధిల్లఁగ దీనిఁ బాపికొను♦దీమస మెట్టిదియొక్కొ దైవమా.

వ. అని తలంచుచు డోలాందోళితమానస యగుచు నమ్మానిని
సుదేష్ణ కిట్లనియె. 92

ఉ. ఉత్పలగంధి నన్నడుగు ♦ మొష్టను బంపుము కల్లు దేర నే
సత్ప్రథవృత్తి నీకడన ♦ సంతతముఁ బహుమానపాత్ర నై
తత్పరతం జరించి యుచి♦తంపుఁబనుల్ దగఁ జేయఁగాక దు
వ్యత్పరివారయోగ్యపరి♦చారముమైఁ జనునట్టిదాన నే. 93

క. అతివ తగునమ్మ నీగృహ
మతినిర్మలచరితభరిత ♦ మని యీయెడ మ

1. క. గ. చ. బహువిధములవారుణి.

త్పతులయుసన్నిధినైనను
మఱి నూఱడి యున్నచోట ♦ మన్నన దప్పక. 94

ఉ. సాధులు చేరి [1]నెమ్మిగ [2]ని♦జస్థిరవృత్తము దుష్టకోటిచే
బాధలఁ బొంద కుండఁ దమ♦పాల వసించినఁ బెద్దవారు ది
క్కై ధరియించి వారి కొక♦యాపద పుట్టక యుండఁ
గాచుటొప్పై ధరఁ గీర్తి కెక్కదె యు♦పాయము సేసిన
నింద వుట్టదే. 95

ఆ. ఎవ్వరేనియింటి ♦ కెద్దియే నొకటికి
నన్నుఁ బంపఁ దగునె ♦ నిన్ను నాఁడ
కొలుచునెడ ననుజ్ఞ ♦ గొననె నీచము లగు
పనుల కేను జాల ♦ కునికి సెప్పి. 96

క. అనిన విని యనుచితంబున
కనయము శంకించియును ల♦తాంగి మదిం ద
మ్మునివలవంత దలఁచి యి
ట్లనియెం బాంచాలితోడ ♦ సాదరవృత్తిన్. 97

ఉ. అక్కట యేను వేడ్కపడి ♦ యానెడునాసవ మర్థిఁ దేరఁ గా
నొక్క నికృష్టఁ బంచుటకు ♦ నోపం జెప్పిన దీని నీవు గో
నెక్కఁగఁ జేసి నిన్ను నతి♦హీనవిధాననియుక్తఁ జేత గా
నిక్కమ యుమ్మలించి తిది ♦ నెయ్యముతియ్యముకల్మి యే
సఖీ. 98

క. అది లాఁతియిల్లె నినుఁ దమ
హృదయంబుల నెవ్వరేని ♦ నెఱుఁగరె యేఁ జె

1. క. నమ్మిగ. 2. క. గ. నిజస్థితివృత్తము.

ష్ణువు నీవు పెంపు నినుఁ గ
న్నది మొదలుగ నెల్లవారి కత్యైభంగిన్. 99

క. అని మఱియుఁ బెక్కుభంగులఁ
దనుఁ బ్రార్థింపంగ ద్రుపదతనయకుఁ జిత్తం
బున నింకఁ బెద్ద పెనఁగం
జన దీయమతోడ ననువిచారము పుట్టెన్. 100

వ. ఇట్లు దోఁచిన తలంపునఁజేసి. 101

—♦ ద్రౌపది కీచకునింటికిఁ గల్లు దేరం బోవుట. ♦—

చ. మన మురియాడు చుండ ననుమానముతోన సుదేష్ణఁ
జూచి నీ వనయముఁ గోరినట్టిపని యర్థిమెయిం జని చేయు
దానఁ గాకను తనమాట కప్పాలఁతి హర్షముఁ బొందుచు
నంది యిచ్చు కాంచనచషకంబు పుచ్చికొని చారువిలోచన
యార్తమూర్తియై. 102

వ. చనుచుండి నీచహృదయుం డగుకీచకుండు దనయెదుర నప్పా
డాడినకర్ణశూలంబు లగుమాటలవలనం బిమ్ముపడినవాన్నిఁ
గొఱవిం జూడినతెఱంగున సుదేష్ణ దన్ను నుచితవ్యాపా
రంబునకు నియోగించుటకు నిర్వేదనంబుం బొంది, 103

చ. అలమటఁ బొందు [1]మాయవిధి ♦ యా యని దైవము
దూఱునిత్తఱిం । గలరొకో నాకుదిక్కను మొ ♦ గంబున
నశ్రులు వెల్లిగొల్పఁ దో । ట్రిలఁబడు జల్లనం జెదరు ♦

1. చ. మాలవిధియా.

డెందము గూడఁగఁ దెచ్చి నన్నుఁ [1]కే । వలమున ముట్ట
నెవ్వరికి ♦ వచ్చు ననుం గలఁగుఙ్ వెనుంబడున్. 104

వ. అట్టియెడ. 105

సీ. దైన్యంబు తలపోఁత ♦ దలకొన్నఁ జెలువ కా
ననమున వెల్లఁద ♦ నంబు గదిరె
భయరసవేగంబు ♦ పైకొనిముట్టినఁ
గాంతకుఁ దనులతఁ ♦ గంప మడరె
బెగడంత కంతకు ♦ మిగిలిన నింతికిఁ
బదముల [2]నట దొట్రు ♦ పాటు జెరసెఁ
దల్లడం బొందినఁ ♦ దన్వికి నవయవం
బుల నెల్ల ఘర్మాంబు ♦ కళిక లెసఁగెఁ
ఆ. దలఁకు పుట్టెఁ గొంకు ♦ గొలఁదికి మీఱె వె
న్నాటుదోఁచె ముట్టు ♦ పాటు దొడరె
వెఱఁగుపాటు దనికె ♦ [3]నెఱనాడె నొవ్వ నె
వ్వగలు వగల నీనె ♦ దిగులు వొదివె. 106

వ. ఇవ్విధంబున ద్రుపదపుత్త్రి యవస్థం బొందుచు మహాపదల కుం బరిహారణంబు హరిస్మరణంబ యని తనహృదయ పుండరీకంబునం బుండరీకాక్షు నిక్షేపించుకొని సుదేష్ణమంది

1. 'కేవలమునన్' ఇది 'అగ్నిసాక్షికఁబునన్' (ఆది-౪-౧౩౬) నిర్భయమునన్" (ఆది ౬-౧౮౬) ఇత్యాదులవంటిది. కేవలమున ననఁగా సామాన్యముగా. మనుజపాలుఁడు కేవలుఁడే" (నిర్వచ.ఉ.ప్త. ౧) కేవలయోధవే (ఉద్యో. 3. ౬౧) ఇత్యాదులయందు కేవలశబ్దము సామాన్యవాచిగాఁ జూపట్టెడిని. అ. కాలవమున. 2. చ. దొట్రిలఁబాటు. 3. ఘ. నెఱవాడె నొప్పు.

రంబు వెలువడి దినకరుంగనుంగొని వినయ వినమితోత్త
మాంగయై నిజాంతర్గతంబున. 107

తే. పాండుపుత్రులకేను దప్పనిమనంబు
గలుగుదాననయేని నో కమలమిత్ర
కీచకునిదెస నన్నొక కీడు తెరువు
వోరయకుండఁగ రక్షింపు కరుణతోడ 108

వ. అనుచుం గేలు మొగిచిన. 109

క. తరుణియు దుఃఖిత యగు న
త్తరుణిం గాచుటకు నత్యుదగ్రభుజావి
స్ఫురణాఢ్యు నొక్క రక్కసుఁ
గరుణార్ద్రమనస్కుఁడగుచు గ్రక్కునఁ బనిచెన్.

వ. వాఁడును బని పూని యాంబరంబున నదృశ్యాకారుండై
వచ్చి నిలిచె. 111

తే. ఇట్లు ప్రార్థించి పాంచాలి యెట్టకేని
సింహబలుమందిరంబల్లఁ జేర నరిగి
యొల్లఁబోవుచు బెబ్బులి యున్నపొదరు
సొచ్చులేడిచందంబునఁ జొచ్చుటయును. 112

ఉ. అంబుజహస్తి వచ్చుతెఱు[1]వారయఁ గీచకముఖ్యుఁడప్పుఁ
దె । ల్లంబుగఁ జూచి యుల్లము కలంకయు వారక మేన
వెమ్మతా । పంబును డిగ్గఁ ద్రావి గరు పాఱుచు
నుత్కట సంభ్రమంబు హా । ర్షంబుఁ బెనంగొనంగ సతి
చంచల భావపరీత మూర్తియై. 113

1. ఖ వారయఁకీచక.

క. చిడిముడిపడుచు నెదురుసనఁ
గడఁగుచు హారములు చక్కఁ ‸ గాఁ ద్రోచుచు మ
ల్లడి గొనుచు దుర్విలాసం
బొడలికిఁ గొడఁ గూర్చుచుండ ‸ నుగ్మలి యంతన్. 115

వ. తత్ప్రదేశంబునకుం జని.

తే. దేవి తృషవుట్టి వారుణి ‸ దేరఁబనుప
నరుగుదెంచితిఁ బోయింపుఁ ‸ డనిన నింతి
నెమ్మొగంబున దృష్టులు ‸ నిలిపి తమక
మడర నిట్లను నా కీచ ‸ కాధముండు. 116

క. దేవితృష దీర్పఁ బూనితి
వావెలఁది సహోదరుండ ‸ నగు నాతృష లీ
లావతి నీమనసరసనం
భావనమెయిఁ దీర్పకునికి ‸ పాడియె చెపుమా. 117

సీ. కాంతిదళ్కొత్తు నీ ‸ కడగంటిచూడ్కితోఁ
బొందఁగానని మేను ‸ పొగులుటయును
దీపారు నీపల్కు ‸ తెల్లంబుగా వినఁ
గానని వీనులు ‸ గందుటయును
నిం పగునీచెయ్వు ‸ లెలమిమైఁ గొనియాడఁ
గాననికోర్కులు ‸ [1]గనలుటయును
సొగయించు నీకేళ్ళఁ ‸ దగిలి యానందంబుఁ
జెందఁ గాననిమది ‸ గుందుటయును

1. క. గలఁగుటయును.

తే. ఛాయ నాదగుజన్మంబు ఫలమునొంద
భావజన్మునిపూనికి పారమెద్ద
నన్ను బంటుగా నేలుము నలిన వదన
యింక నీసిగ్గుదెరయాల మేల నీకు. 118

వ. అనవుడు. 119

తే. చెలువ యప్పలుకులు పెడ చెవులఁబెట్టి
ధీర గావున విగతవి కారయగుచు
మదిరవోయుంపుఁ డద్దేవి యెదురు[1]చూచు
నలుగుఁ దడనైన మగుడఁ బో వలయు ననిన. 120

చ. మదిర సుదేష్ణపాలి కొక మాత్రన పుచ్చెద నొక్కచేత
నిం । పొదవెడునట్టి దీనిచవి యుల్లము[2]సొక్కఁగ నాను
మీవు నీ । వదనసరోజసౌరభ మవారణ నన్నునుగ్రోల
నిమ్ము బె । ట్టిదుఁ డగు కాముతూపులఁ దో డింబడ
కుండఁగఁ గావుమిత్తఱిన్. 121

క. కరితురగరథసమితిఁ బొం
పిరివోయెడు నాదులక్ష్మి పెంపున కెల్లన్
సరసిరుహావదన నీవ కు
దురుగా నొనరించెదం గుతూహలమెసఁగన్. 122

క. రుచిరమణిభూషణంబులు
నుచిత విహారప్రకార యోగ్యాగార
ప్రచయము సుందరగణికా
నిచయము నొప్పించువాఁడ నీకుం దరుణీ. 123

1. ఖ. చూచియలుగు. 2. క. గ. సోఁకఁగ.

క. 1నాకులకాంతల నెల్లను
నీకుం బని సేయఁ బనిచి నెయ్యంబున నే
నీకనుసన్నన మెలఁగెద
నేకార్యం బైన నడపు మీవ తగంగన్. 124

వ. అనుచు సింహబలుండు దనయంతరంగంబున నంత కంత కగ్గలించుతమకంబునఁ 2దన్నుం దా నెఱుంగక పఱుం బడి పట్టికొనిన. 125

క. తినుఁగాచి వెనుకవచ్చిన
దనుజమహాబలము తనదు తను వొందిన నా
తనిచే విడిల్చి రభసం
బునఁ దన్మందిరము ద్రుపదపుత్రిక వెడలెన్. 126

వ. ఇట్లు ద్రోచిపోయినం గీచకుండు వెనువెంటందగిలిన న మ్మగువయు మరలిచూచి భయభ్రాంతయై యెవ్వలనికిం బోదునో యని తలంచి దైవయోగంబున విరాటుండప్పుడు గొలువునికిం జేసి తత్సభాభాగంబుదెసకు వెసం బాఱినం గామాయత్త చిత్తుండును గర్వోన్మత్తుండును గావున జన సమూహంబు సరకు సేయక రహస్య 3ప్రకాశవిభేద విచారంబు దక్కి. 127

— కీచకుఁడు ద్రౌపదిం బట్టుకొనుటకు వెంటఁ దగులుట. —

సీ. సమదవారణము జంగమలత వెనుకొని
సరభసంబునఁ బట్టఁ జనువిధమునఁ

1. నాకుఁగల కాంతలెల్లను. 2. ఖ. ద. నన్నెఱుంగక; జ. గ. న్నెఱుఁగక. 3. చ. గ. ప్రకారవిభేదనవిచారంబు.

క్రూరదానవుఁడు భూ - చారినిర్జరకాంతఁ
బాదువ రయమ్మునఁ - బోవుభంగి
ఘోరగృధ్రము సుకు - మారనాగాంగనఁ
బటుగతి నొడియంగఁ - బాఱుకరణిఁ
ప్రబలబిడాలంబు - బాలశారికమీఁద
నడరి సత్వరముగ - నరుగుమాడ్కి.

తే. సింహబలుఁ డత్యుదగ్రుఁడై - చిగురుఁబోఁడి
పజ్జఁ గడువడిఁ దగిలి కోపంబు గదుర
నొడిచి తల పట్టి తిగిచి మహోగ్రవృత్తిఁ
గొంకు కొస రించుకయు లేక - కూలఁ [1]దాఁచె. 128

వ. అట్టియెడఁ బాంచాలీరక్షకుండైనరాక్షసుండతని డొల్లవేసిన.

క. కీచకుఁడు వ్రేటువడి తన
నీచపుదెస యొఱు లెఱుంగ - నేరక యుండన్
లేచి వెనుకఁ జని విస్మయ
గోచరుఁడై యసురకతనఁ - గుందితుఁ డగుచున్. 130

వ. ఒడుపు దప్పిన మహానాగంబునుంబోలె నిట్టూర్పు నిగుడ నిట్టలంబగుకోపంబు వెల్లువ మల్లడిగొను చుండె నయ్యవసరంబున. 131

క. తానును నన్నయు నయ్యా
స్థానమ్మున నుండి పవన - తనయుఁ డసహ్యాం
బైన మనోవల్లభ యవ
మానము నాసింహబలుని - మదజృంభణమున్. 132

1. క. ద్రోచె.

చ. కనుఁగొని కోపవేగమునఁ § గన్నుల నిప్పులు రాల
నంగము । ల్దనరఁగ సాంద్రఘర్మ సలి § లంబులు గ్రమ్మ
నితాంతదంతపీ । డనరటదాస్యరంగవిక § టభ్రుకుటీచటుల
ప్రవృత్తన । ర్తనఘటనా [1]ప్రకార భయ § దస్ఫురణాపరి
ణద్ధమూర్తియై. 133

సీ. నేలయు నింగియుఁ § దాళముల్ గాఁజేసి
మేపున శేఁగి వా § యించి యాడఁ
గులపర్వతంబులు § గూల్చి యొండొంటితోఁ
దాఁకంగ వీఁకమైఁ § దన్ని యాడ
నేడుసాగరములు § నిక్కడక్కడఁ బెట్టి
పలుచనిరొంపి మై § నలఁదికొనఁగ
దిక్కులు నాలుగు § నొక్కచోటికిఁ దెచ్చి
పిసికి పిండలి సేసి § [2]పిడుచగొనఁగ

తే. మిగిలి బ్రహ్మాండభాండంబు పగుల వ్రేయ
నప్పళించుచుఁ బ్రళయకా § [3]లానలమున
గండరించినరూపంబు § కరణి భీముఁ
డతిభయంకరాకారత § నతిశయిల్లె. 134

వ. ఇట్లు పేర్చిన కోపాటోపంబున నవిచారిత సమయవర్త
నుం డయి వృకోదరుండు కీచకుని గీటడంగింపఁ జూచి
తత్సంబంధ బద్ధుండును నాజ్ఞా పరిపాలకుండును గావున
మత్స్యపతిఁ దనయలుకలోనివానిఁగాఁ దలంచుచు నచ్చో

1. గ. ప్రగర్భ. 2. జ. పిడిచికొనఁగ. 3. ఘ. లానలంబు, గండ
డంచిన; లాలనంబు, గండెసంగిన.

రువ నున్నయున్నతవృక్షంబు నిరీక్షించి యానవనంబు పల్లటిల్ల ధర్మతనయుం గనుంగొనిన నతండును [1]దననయనాకారంబున వారించి యిట్లనియె. 135

మ. వలలుం డెక్కడఁ జూచె [2]నొండెడ ననే ♦ వ్యాఘ్రాజములఁ బుట్టవే। ఫలితంబై వరశాఖలొప్పఁగ ననల్ప ప్రీతి సంధించుచుణ్ । విలసచ్ఛాయ సుపాశ్రితప్రతతికిన్ ♦ విశ్రాంతి గావింపఁగాఁ। గలయీభూజము వంట కట్టియలుగా ♦ ఖండింపఁగా నేటికిన్. 136

తే. అని నిగూఢభాషణముల ♦ నయ్యజాత
శత్రుఁ డనిలజు కోపర ♦ సంబు పేర్మి
చెఱిచె నయ్యన్నదమ్ముల ♦ చేష్టితములు
దెల్లముగ నప్డు సూచుచు ♦ నల్లలేచి. 137

సీ. ఎలదీఁగఁ గప్పిన ♦ లలితపరాగంబు
క్రియ మేన మేదినీ ♦ రేణు వొప్పఁ
జంపకంబున నవ ♦ సౌరభం బెసగెడు
కరణి నాసిక వేఁడి ♦ గాడ్పు నిగుడఁ
దోయజదళముల ♦ తుది మంచు దొరఁగెడు
గతిఁగన్నుఁగవ నశ్రు ♦ కణము లురుల
నిందుబింబముమీఁది ♦ కందుచందంబునఁ
గురులు నెమ్మొగమున ♦ నెరసియుండ

తే. సర్వజనవంద్య యైన పాం ♦ చాలి సింహ
బలునిచే నిష్ఫలంబున ♦ భంగపాటు

1. గ. చ. దనయాకారంబున 2. క. గ. ఘ. దొండెడ.

దనకు వచ్చిన నెంతయు ♦ దైన్య మొంది
యవ్విరాటునిసభఁ జేర ♦ నరిగి నిలిచి. 138

—♦ ద్రౌపది తనభంగపాటు విరాటునితోఁ జెప్పుట. ♦—

ఉ. పంబినకోపముఁ సమయ ♦ భంగభయంబును నగ్గలించియు
ల్లంబు పెసంగొనంగఁ బతు ♦ లం దగసభ్యులఁ జూచు
మాడ్కి రూ । క్షం బగుచూడ్కి [1]నాద్రుపదు ♦ కన్నియ
సూచి సభాజనప్రతా । నంబును మత్స్యనాథుఁడు వి ♦
నంగ నెలుంగు [2]చలింప నిట్లనున్. 139

సీ. నిఖిలధర్మాధర్మ ♦ నిపుణంబులైన శు
ద్ధాంతరంగంబుల ♦ నతిశయిల్లి
శిష్టసంరక్షణ ♦ దుష్టనిగ్రహముల
నీతి వాటింపంగ ♦ నేర్పు గలిగి
సకలశస్త్రాస్త్రసం ♦ చయములఁ బరమాద్భు
తంబు సేయుపరిశ్ర ♦ మంబుదాల్చి
దుర్దమప్రతిభట ♦ మర్దన క్రీడమైఁ
జతురులు నా నెందు ♦ నుతికి నెక్కి

తే. యున్నగంధర్వ లేవురు ♦ నన్నునిట్లు
లొకఁడు పఱుపంగ నూరక ♦ యునికి సూడ
నచ్చెరువుగాదె యెవ్వరికైయాంధ్రులకు
బరిభవంబునఁ బొందక ♦ బ్రదుకువారు. 140

క. ఈనరపతి యాస్థానము
లో నొక్కరుఁడైన ధర్మశీలోపరిభయఃమునం

1. నాద్రుపదకన్యక. 2. క. గ. పలింప. 3. ఘ. భయంబుం.

బూని తగ వైన వెడవలు
నైనను బలుకంగఁ జాలఁ డయ్యెడు నకటా. 141

ఉ. ఇందఱుఁ జూడఁగా నిచట నిమ్మెయి నన్నుఁ బతివ్రతా
గుణాస్పందితవర్తనం బరమసాధ్వి ననిందితశీలఁ గీచకుం
డెందును నెట్టియంగనల నెవ్వరుఁ జేయనియట్లు సేయఁగాఁ
గొందఱు నైన నిప్డు కృపకుందఱిగాదఱి యేమిసెప్పుదున్.

ఉ. ఐనను మత్స్యదేశమున కాజ్ఞకుఁ దోడయుండు గాన నా
కీనరనాథు దూఱఁ దగు నెయ్యదియేని నధర్మ మెవ్వ రెం
దైన నొనర్చినం బ్రభువు లారసి దండన మాచరింతు రి
చ్చో నను దన్నఁ గీచకునిఁ జూచియు నూరక యున్కి
పాడియే. 143

చ. అనుడు విరాటుఁ డుల్లమున నక్కటికం బొలయంగ
నంగనంగనుఁగొని కీచకుం గినియఁగాఁ దగుసత్త్వము
లేమిఁజేసి సాంత్వనములు వల్కి రోషభరితస్థితిఁ గంపిత
మూర్తియైన యాతనిమది[1]కుందువాపిన నతండును బోయె
నివాసభూమికిన్. 144

వ. అట్టియవసరంబున. 145

సీ. శుభలక్షణాంగి యీసుందరి సైరంధ్రి
యగు టెట్లొకో యని వగచువారు
నిమ్మేని కక్కట యిట్టిది సేసెనే
మాయదైవంబని మఱుఁగువారు

1. ఖ. కందు

నితంకీ డొనరించె♦నే రాజు సూడ నీ
దుష్టాత్మకుండని ♦ దూఱువారు
దేవి యుపేక్షయ ♦చూపె యీయమకు ని
ప్పాటువచ్చుట యని ♦[1]ప్రందువారు

తే. నగుచు సభవార లందఱు ♦ నంత నంత
నల్లనల్లన గుజగుజ ♦ లాడు చుండి
[2]యుల్లముల నిండి ఖేదంబు ♦ వెల్లివిరిసె
నాఁగ మోముల విన్నఁద♦నంబు గదుర. 146

ఉ. అప్పుడు ధర్మసూతి హృద♦యంబు కలంగ లలాటభాగముం
గప్పఁగ ఘర్మవారి యధి♦కంబగు రోషమునొంది యుండియుం
దప్పఁగఁ ద్రోచికొంచుఁ దన♦ధైర్యముపెంపున నిర్వికారుఁడై
యెప్పుడుఁ దాను బల్కు నెలుఁ ♦ గేర్పడ ద్రౌపదితోడ
నిట్లనున్. 147

సీ. జననాయకుండు నీ♦సభవారు సీదగు
తెఱఁ గెల్ల నెఱిఁగిరి ♦ తెఱవ యింక
మాసక యీపలు♦మాట లాడఁగ నేల
చనుము నీవు సుదేష్ణ♦సదనమునకు
నీపరాభవమునఁ ♦గోపింప నేరరే
గంధర్వులకుఁ దఱి ♦ గాదుగాక
సమయ మెయ్యదియేనిఁ ♦ దమకును నీకును
మును గల్గినట్లైనఁ ♦ గినియరిచట

1. జ. పలుకువారు. 2. క. ఉల్లములనుండి.

తే. గాన నాథుల దూఱంగఁ♦గాదు వినుము
సతికిఁ దానెంత వడియును ♦సభలలోనఁ
దడవుగానిల్చి యిట్టు లు♦దగ్రవృత్తి
శంక సెడి ధిక్కరింపంగఁ♦జనునె చెపుమ. 148

వ. అని యిట్లు సెప్పిన ధర్మతనయునిపలుకులు విని వెండియు సైరంధ్రి యచ్చోటు గదలక నిలిచి మెద్దియేనియుం బలు కందలంచినం జూచి యతండు మఱియు నిట్లనియె. 149

క. పలుపోకలఁ బోవుచు వి
చ్చలవిడి నాట్యంబు సూపు♦చాడ్పున నిచటం
గులసతుల గఱువచందము
దొలఁగఁగ నిట్లునికి దగునె ♦ తోయజవదనా. 150

వ. అనిన విని పాంచాలి సాభిప్రాయంబుగా నతని కిట్లనియె. 151

ఆ. నాదువల్లభుండు ♦ నటుఁడింత నిక్కంబు
పెద్దవారియట్ల ♦ పిన్నవారుఁ
గానఁ బతులవిధమ కాక యే శైలూషిఁ
గాననంగ రాదు ♦ కంకభట్ట. 152

వ. అట్లగుటం జేసి నాకు నాట్యంబును బరిచితంబ మత్పతి శైలూషుండ కాఁడు కితవుండునుంగావున జూదరియాలికి గఱువతనం బెక్కడియది యనుచు నచ్చోటు వాసి తన చిత్తంబున. 153

ఉ. నన్నిటు లాదురాత్ముసద♦నంబునకుం జను మన్నజాతకీ
బన్నము లన్నియుం దెలిపి ♦ ప్రేయిడ నేయని పోయె
నార్తయై కన్నులబాష్పపూరములు♦గ్రమ్మఁగమోమునదైన్య

మొదఁగా నన్నలినాక్షి తోఁట్రిలుచు ♦ నంగము దూలఁ
సుదేష్ణపాలికిన్. 154

తే. చనిన నయ్యేలనాఁగయు ♦ సంభ్రమంబు
దెచ్చికొని తా నెఱుంగని♦తెఱఁగు దాల్చి
శాఠ్యమున నుమ్మలించి పాం♦చాలితోడ
నెలుఁగు వేఱొకభంగిగా ♦ నిట్టు లనియె. 155

సీ. ధరణిపరాగంబు ♦ వోరసి ధూసరిత మై
చేడియ నీమేను ♦ చెన్నుఁదఱిఁగెఁ
జిత్తంబు తలపోఁత ♦ చే వాడు వోదవిన
చెలువ నీ నెమ్మోము ♦ చిన్నఁబోయెఁ
బ్రస్వేదమునఁ దోఁగి ♦ ఫాలంబుతో నంటి
యుగ్మలి నీ కురు ♦ లొప్పు గందెఁ
గన్నీరు 1వఱ్ఱోడ్డి ♦ కాంతి 2యొంతయుఁ గొన్న
వెలఁది నీకనుఁగవ ♦ విన్నయ్యె

ఆ. నేది కారణముగ ♦ నెవ్వరేచోట నీ
కేమికీడొనర్చి ♦ రెట్టివాటి
సాహసికులో వారిఁ ♦ జంపుదునొంపుదు
భంగపఱుతు నిడుమ♦పఱుతుఁ జెఱుతు.

వ. ఇత్తెఱంగు నాకుం జెప్పు మనిన నీ వెఱింగియు నెఱుంగమి
భావించిన నింక నేమని పలుకం గలదాననైనను విను మని
సైరంధ్రి యిట్లనియె. 157

1. వఱ్ఱోడి' అనఁగా వెల్లువ వఱ్ఱోడి యల్లన వెడలి'(శాం-3. 302.)
2. చ. యంతయుఁ.

మ. నను నీ వప్పుడు సూతుమందిరమున ♦ న్మద్యంబుఁ దెమ్మ
న్నఁబో । యిన నాతం డవినీతి సేసినను జే ♦ యీ కేను
మత్స్యావనీ శునియాస్థానముదిక్కు వేచనిన న♦చ్చోఁ
దీవ్రకోపంబున న్వెనుకం గూడఁగ ముట్టి పట్టికొని త♦న్నెం
బల్కు లిం కేటికిన్. 158

వ. అని యేర్పడం బలికిన. 159

ఉ. ఖేదము దక్కు మీక్షణము ♦ కీచకు దండితుఁ జేసి నీకు నా
హ్లాద మొనర్తునే నని న ♦ యంబునఁ గేకయరాజపుత్రి య
త్యాదరవృత్తితో ననున ♦ యంబొనరించిన నయ్యసత్యసం
వాదినిపూన్కి పాండుసుత ♦ వల్లభ యాలము సేసి యిట్ల
నున్. 160

క. నీవింత యలుగ నేటికి
నావంతయుఁ బౌరజనము ♦ నగఖేదము నా
కావంత ద్రిక్కు కుండఁగ
లావంతులు మత్పతులు గ ♦ లరు పగ దీర్పన్. 161

క. అనిన సుదేష్ణయుఁ దత్పరి
జనములు వెఱఁబొంది యెన్ని ♦ సాంత్వనములు సె
ప్పినఁ దేఱద మజ్జనభో
జనములకుం జొరద ద్రుపద ♦ సంభవ యెట్లున్. 162

వ. అట్టియెడ సుదేష్ణ సేయునదిలేక నివ్వెఱఁగంది యుండెఁ
దక్కటియంగనలును గీచకుని నీచత్వంబు తలంచి

*వానిచేటునకొడంబడిరి పరిభవానలసంతప్తయైన పాంచాలి నిజశయనస్థానంబునకుం జని తల్పంబుపై మేనువైచి యపాంగంబులం దొరఁగు కన్నీరు చెవులకొలంకులు నిండ నెవ్వగలు నివ్వటిల్లం దలపోయుచుండి. 163

క. ప్రబలుం డారయ నాసిం
హాబలుం డాతని జయింప ♦ ననిలతనయు బా
హుబలంబ చూడఁదగు దై
వబలంబును నాతనికి న♦ వశ్యముఁ గల్గున్. 164

—♦ ద్రౌపది భీమసేనునితోఁ దనభంగపాటు చెప్పి పరితపించుట. ♦—

వ. ఇట్లూహించి రాత్రిసమయం బగుటయు సమస్తజనంబులుఁ గ్రమంబున నిద్రింపం దొడంగినం దాను శయ్యాతలంబు

* "వానిచేటున కొడంబడిరనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె నయ్యా కీచకుం డేవంశంబునవాఁ డెవ్వం డనిన నమ్మునివరుం డాజనపతి కిట్లనిచెప్పె బ్రాహ్మణియందు క్షత్రియునివలనం బుట్టినవాఁడు సూతుండనం బరఁగుఁ బ్రతిలోమజాతులలోనఁ ద్విజుండనం బరఁగి క్షత్త్రియునికంటె నించుక తక్కువయు వైశ్యునికంటె నధికుండునై ప్రాతిలోమ్యంబున రాజసంబంధార్హుండగునట్టి సూతుని వంశంబున సూతవిషయాధీశుండును రాజసన్యాసముద్భూతుండును నగు కీచకుం డనువాఁడు గలఁడువానికి మాళవియందు నూటయాఱ్వురు కీచకులు పుట్టి రందగ్రజుండు బలవంతుండై యుండి కేకయరాజపుత్రియగు తమతల్లి చెలియలికూఁతురైన సుదేష్ణకు బరిచరించుచు విరాటనగరంబున నుండు. వానితమ్ములు నూటయేవురును వానిన యనుసరించి యుండుదు రని యిట్లు సూతవంశప్రకారం బెఱింగించి యిట్లనియె నంతం బరిభవానలసంతప్త" అని యొకపాఠం బొక ముద్రితగ్రంథమునఁ జేర్పఁబడి యున్నది.

విడిచి మేనిధూళి గడిగి ధౌతపరిధాన పరీత యై మహానస
గృహంబున సుప్తుండైన వృకోదరు కడకుం జని. 165

ఉ. నన్నుఁ బరాభవించి సద ♦ నంబునకుం జని కీచకుండు ము
న్నున్న తెఱంగు దప్పక సు ♦ ఖోచితశయ్యను నిద్ర
సేయ నీ । కన్ను మొగుడ్చునూఱటకుఁ ♦ గారణ మెయ్యది
భీమసేన మీ । యన్న పరాక్రమంబు వల ♦ దన్న నొకో
దయ మాలి తక్కటా. 166

వ. అనుచు మందమందసంభాషణంబుల సంబోధించుపాంచాలి
పాణిస్పర్శంబున మేలుకని యిది యెవ్వరనవుడు నే ననున
మ్మాననిని యెలుంగెఱింగి భీమసేనుండు యాజ్ఞసేని కీచకు
దురాచరణంబు నాకుఁ బ్రకటించి వాని నిర్జింపనియోగించు
నదియై యరుగుదెంచెం గావలయు నత్తెఱం గిత్తెఱవ
దాన చెప్ప విందు నని తలంచి. 167

తే. ఇంత ప్రొద్దేల యిచ్చోటి ♦ కేఁగుదేరఁ
గారణం బేమి యెవ్వరుఁ ♦ గానకుండు
నట్లుగాఁ జనుదెంచితె ♦ యంబుజాక్షి
యనన నయ్యింతి యిట్లను ♦ నతనితోడ. 168

చ. ఎఱిఁగి యెఱింగి నన్నడుగ ♦ నేమిటి కిప్పు డెఱింగి యింతకు
న్మఱచుట గల్గెనే నది వి ♦ నం బని లేదటు గాక యున్నరూ
పెఱిఁగియు నేన చెప్ప విన ♦ నిష్టము గల్గుట చాల లెస్సయ
త్తెఱఁ గెఱిఁగించెదన్ ♦ వినుము తెల్లముగా మొదలింట
నుండియున్. 169

చ. అధిపుమఱంది సింహబలుఁ ♦ డప్పుడు క్రొవ్వునఁ గవచ్చి
నన్నున । త్యధికమనోజరాగమతి ♦ నై కనుఁగొంచుఁ
గడంగి [1]యెన్నియేఁ । విధములఁ బల్కి నాకుఁదన ♦
విన్నను వెల్లను జూపి చెప్పి మా ।నధనవిహీనతం జెనకి ♦
నం గడు నేవము వుట్టి యయ్యెడన్. 170

క. విడియం బలుకఁగ వెండియు
నుడుగక కీచకుఁడు మన్మ ♦ థోన్మాదము ద
న్నడరిన నన్నడుఁగుటకుం
దొడరినఁ గోపించి వాని ♦ నిట్లంటిన్. 171

శా. దుర్వారోద్యమ బాహువిక్రమరసా ♦ స్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీరనిర్మథన వి ♦ ద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేచు రిప్పుడిను దో♦ర్లీలఁ బెనఁ గిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట త ♦ థ్యం బెమ్మె
యిం గీచకా. 172

వ. అనిన విని వ్వాఁడు గొన్ని ప్రల్లదంబులు వలికిన నేనును
దత్కాలోచితవచనంబులం ద్రోచిపుచ్చినం బోయెఁ బదం
పడి పాపాత్మురాలైన సుదేష్ణ దనకు మదిరారసంబు దేరం
గీచక నివాసంబునకు నన్నుం బనిచినం బోవుట కొడంబడక
యెన్నిసెప్పిన నన్నింటికి నన్ని సెప్పి నిర్బంధించినం బెద్ద
పెనంగ నోర్లక నామనంబున నన్నెవ్వరికి నేమి సేయవచ్చు
నని మీలావు నచ్చి సూతునింటికి సురకుం బోయిన. 173

---

1. యెన్నియుఁ.

క. కొన్ని వెడమాటలాడుచు
నన్ను నతఁడు చెట్టవట్టి ♦ నం ద్రోచి వెసం
జన్న వెనుకొనుటయును మీా
యున్నెడ కే నపుడు సంభ్ర ♦ మోపేతగతిన్. 174

తే. పాఱుతెంచిన నక్కాల ♦ పాంసనుండు
గోసమడరంగ 1వెనుకన ♦ కూడముట్టె
నట యెఱుంగుదు నీవు మీా ♦ యన్న పెద్ద
తనముఁ జూచితి నేమందు ♦ ననిలతనయ. 175

ఉ. మీాసుభటత్వమున్ బలము ♦ మిన్నక పోవఁగ దున్నసేనుఁ డ
ట్లా సభలోన నన్ బఱిచె ♦ నంతియ కాక జయద్రథుండు న
త్రాసభరంబు లేకనుచితంబొనరించినఁ జెల్లిపోయె నేఁ
డీసభికుల్ గనుంగొనఁగ ♦ నిట్లయితిన్ వగనాకు నింతయే.

ఆ. అకట యాఁడుగూయు ♦ నాలకూయును లాఁతి
వారికైన నరయ ♦ వలయు ననిన
నన్నుఁ గీచకుండు ♦ దన్నంగ నెట్టులు
సూడనేర్చె ధర్మ ♦ సూనుఁ డపుడు. 177

వ. అనిన విని యతం డి ట్లనియె. 178

ఉ. కీచకుఁ డట్లు మీఁదు పరి ♦ కింపక నిన్నుఁ బరాభవింపఁగాఁ
జూచి మహోగ్రకోపవివ♦శుం డగు నన్నును జూచి ధైర్య
హే । మాచలుఁ డైన ధర్మసుతుఁ ♦ డమ్మెయి వారణ
సేయ కున్న నే । నీచత వాని మత్స్యవిభు ♦ నిం బరివా
రము నుగ్గుసేసినన్. 179

1. గ. వెనుకొని.

వ. ఆ [1]సంరంభంబున సమయభంగంబుగా జనంబులు మనల
నెఱింగిర యేని. 180

క. మున్దటిభంగిన కానల
యందు వసింపంగ వలదె ♦ యది నీవును నే
నుం దెచ్చిన యాపదగా
నిందింపరె యెల్లవారు ♦ నీరజవదనా. 181

వ. కావున సత్యవ్రత [2]నిష్ఠుం డగు యుధిష్ఠిరుండు పొగడ్తకుం
దగువాఁడుగాని దూఱువడ నర్హుండు గాఁ డని వెండియు
ని ట్లనియె. 182

క. పరిభవకరుఁ డగుకీచకుఁ
బరిమార్చుట [3]యిపుడు గడవఁ ♦ బడియెనె యిమ్మై
దురపిల్ల నేల క్రేళ్ళుడిఁ
బొరిఁగొని నీ మనము కలఁక ♦ పుత్తు లతాంగీ. 183

వ. మనల నెవ్వరు నెఱుఁగ కుండునట్టి తెఱంగు తలపోయ
వలయుఁ గాక పగతుని భంజించుట యెంతటిపని యనిన
విని యమ్మానిని యి ట్లనియె. 184

క. గొంతికి నంత వెఱవ మీ
కంత నెఱవ దైవమునకు ♦ నంత వెఱవ న
త్యంతకలుషాత్మ విరటుని
కాంతకు నే వెఱతుఁ బనులు ♦ గావించునెడన్. 185

1. చ. జ. సమయంబున. 2. ఖ. గరిష్ఠుండగు. 3. క. కిపుడు.

చ. కినుకకుఁ జాల కొంతయును ♦ 1గీడ్పడి నా పడుపాటు లెల్లఁ బే
ర్కొనుచు నరణ్యభూమి నిటు ♦ కుందుచునుండఁగఁ జూచి వీఁడు పో
దొలఁగఁ డయో! మహాభిమాన ముడిగెను ♦ నెట్టన
దైన్యము నొందఁగొల్పె నని ♦ కనలుచుఁ గోపదీప్తుఁడై
వచ్చి ♦ యిట్లు పలికెఁ గిరీటి యన్నతోన్. 186

—♦ ద్రౌపది భీమునితో ధర్మరాజు మహిమ సెప్పుట. ♦—

వ. ఇట్టిద కాని సమస్తజనస్తవనీయుం డగుపాండవాగ్రజు
నిక్కాంబ నిందించిన దానం గా నని పలికి మఱియును. 187

క. ధర్మతనూభవు సంతత
ధర్మనిరతి మనము బ్రదుకఁ ♦ దలఁచుట యరుదే
నిర్మలుఁ డగు నాతని స
త్కర్మంబునఁ గాదె బ్రతుకు ♦ ధాత్రికి నెల్లన్. 188

సీ. చనునె వేఁబోకని క ♦ జాతశత్రుం డను
పేర దిగ్విజయంబు ♦ పెంపు దాల్చి
రాజసూయమహాధ్వ ♦ రము గోరి చేయంగఁ
దీక్షనే పెఱపరి ♦ ధ్రీపతులను
ధర్మైకనిరతుఁ డా ♦ తం డొక్కరుఁడ చూవె
యనఁ జన నొరులకు ♦ నలవియగునె
నిత్యవ్రతంబుగా ♦ సత్యంబు 2పాటింప
వచ్చునె యొరుల కె ♦ వ్వరికి నైన

తే. నయ్యుధిష్ఠిరు గాంభీర్య ♦ మతని ధైర్య
మరయ నొండెడఁ గలుగునె ♦ యతఁడు కీర్తి

1. గ. గీడ్పడు. 2. క. పాలింప.

ధరుఁడు కరుణో త్తరుఁడు మహీ ♦ సుర సమృద్ధి
కరుఁడు నిజవంశకరుఁడు ప ♦ కారపరుఁడు. 189

క. కలిమికి నో ప్పగునీగియు
బలిమికిఁ దోడ వైనయట్టి ♦ బలఁగము నై లో
కం బచి త్తములకు వ్రేఁ గగు
కొలఁది మనకుఁ గొంతి పెద్ద ♦ కొడుకున కమరుఁ.190

సీ. ఎవ్వనివాకిట ♦ నిభమదపంకంబు
రాజభూషణరజో ♦ రాజి నడఁగు
ఎవ్వనిచారిత్ర ♦ మెల్లలోకములకు
నొజ్జయై వినయంబు ♦ నొఱపు గఱపు
నెవ్వనికడకంట ♦ నివ్వటిల్లెడు చూడ్కి
మానితసంపద ♦ లీను చుండు
నెవ్వని గుణలత ♦ లేడు వారాసుల
కడపటి కొండపైఁ ♦ గలయఁ బ్రాఁకు

తే. నతఁడు భూరిప్రతాప మ ♦ హాప్రదీప
దూరవిఘటిత గర్వాంధ ♦ కార వైరి
వీరకోటీరమణిఘృణి ♦ వేష్టితాంఘ్రి
తలుఁడు కేవలమర్త్యుఁడె ♦ ధర్మసుతుఁడు. 191

ఉ. అట్టిమహాత్ముఁ డొక్కనికి ♦ నాశ్రితుఁడై వెడగూడుఁ
జీరయుం । బెట్టఁగనిల్చి వాని మది ♦ ప్రీతికి నీ డగు వృత్తిఁ
బేరునుం । బుట్టును మాలి యిప్పు డిటు ♦ బ్రుంగుడు
పాటునఁ బొందఁ జూచి నా । కెట్టు మనంబు పట్టు ధృతి♦
యెమ్మెయిఁ దూలక నిల్చుఁ జెప్పుమా. 192

ఉ. నీవలమూఁపులావు మును ♦ నేల వహించిన నాగకూర్మగో
త్రావనిభృద్దిశాకరుల ♦ కారయ నూఁటపట్టు గాదె సం
భావన భూజనంబులకుఁ ♦ బందువుగాదె మహోగ్రకోపకే
ళీవిభవంబు వైరులకుఁ ♦ గాలము చేరువగాదె పావనీ. 193

తే. బక హిడింబ కిమ్మీరుల ♦ బాహుబలము
నా జరాసంధు నుగ్రద ♦ ర్పాతిశయము
లోకభీకరములు విజ ♦ యాకరములు
నైన నీకరములకు లో ♦ నయ్యెఁగాదె. 194

ఆ. అట్టి నీవు వంట ♦ కట్టియలకు లావు
సూపుచుండ నెపుడుఁ ♦ జూచి చూచి
వగతు నదియుఁ గాక ♦ తగ వేది యమ్మత్స్య
మేదినీశ్వరుఁడు వి ♦ నోదమునకు. 195

మ. మహిషవ్యాఘ్రగజాది సత్త్వచయముల్ ♦ మల్లవ్రజంబుం
గృపా। రహితుం డై యెదు రొడ్డుచుల్ వరుసఁ బో ♦ రం
జూచు ని న్నెప్పుడుల్। మహనీయం బగు నీశరీరము జగ ♦
న్మాన్యంబు నీచక్రియా। విహితం బైనకుజీవనంబు విధి
గా ♦ వించెం గటా దీనికిన్. 196

వ. అని మఱియు ని ట్లనియె వివేకహీనుం డగువిరాటుండు
నిన్నుం బోరించునప్పుడు నిజాంతఃపుర కాంతలకు వినో
దంబు సేయ వారల రావించిన నేనును సుదేష్ణతో నరుగు
దెంచి చూచు చుండుదు నయ్యవసరంబున. 197

క. భరమున నీవో రెడు నెడఁ
బరమవిషాదంబు నీవు ♦ బలిమి మెఱసి యు

ద్ధరవృత్తిజయము గొనినం
బరితోషముఁ బొందు నన్ను ♦ భావించి మదిన్. 198

వ. ఊహించి సుదేష్ణయుఁ దత్పరిజనంబులుం దమలోన. 199

క. వలలునిదెస మాలినిచూ
డ్కులతెఱఁ గెడపొందుఁ దెలిపి ♦ డుం గంటిరె వీ
రలు వచ్చినసమయంబును
దలఁపఁగ నొక్కటియ యివ్వి ♦ ధం బెట్లొక్కో. 200

వ. అనుచుం గలదు లేదని పెక్కువిధంబులం దలపోసి గుజగు
జలుపోవు చుండుదురట్టియెడ. 201

తే. మఱగి నీమూర్తిపైఁగన్ను ♦ మనముఁదగిలి
యుండ నేమఱియుండి యొ ♦ క్కొక్కమాటుఁ
దలఁచికొని వారిదెస మది ♦ నిలుపునప్పు
డెఱుఁగనగు వారు నాతెఱఁ ♦ గెఱుఁగుటెల్ల. 202

వ. కావునమదీయపరిభవాతిరేకంబునకు నీవుద్రేకించినజనంబులు
మనల భేదింతురు నీకుం బోలినభంగి రహస్యభంగంబు
గాకుండ నరిభంగంబుసేయు మని వెండియు. 203

సీ. తొడరిన వారు నైన ♦ దోర్బలంబునఁ దన్ను
మిగులంగ నీఁ డను ♦ మేటిమాట
యమరేంద్రు నర్ధాస♦నమునకు నైన న
ప్హాఁడెంతయును నను♦రూఢిమాట
జమునిల్లు సొచ్చిన♦జంతువు నైనను
గాచు నెమ్మెయి నను♦రాచమాట

దనుఁ గోరి యూర్వశి ♦ దాన వచ్చిన నైన
లోలుండు గాఁ డను♦ మేలిమాట

తే. శౌర్యవైభవప్రాభవ ♦ [1]శౌచములకు
నొరుల కైనఁ గైవార మై ♦ యుల్లసిల్లు
నొక్కరుని కివి యెల్లను ♦ నిక్కమట్టి
యొదుఁగలుగునె యర్జును ♦ నీడువాఁడు. 204

క. ఆపార్థుఁడు భరతాన్వయ
దీపకుఁ డమరేంద్రసుతుఁడు ♦ దేజోనిధి వి
ద్యాపారగుండు వినుత
వ్యాపారుం డాపదలకు ♦ నర్హం బయ్యెన్. 205

చ. అరయ నతండు మాసధనుఁ ♦ డక్కట రంగమునందు నిల్చి సుం। దరులకు నాట సూపెడు వి ♦ ధం బతిదీనము దానిఁ జూచి యేఁ। బురపురఁ బొక్కుదుం గడుపుఁ♦ బ్రోచికొనన్ లఘువృత్తి కిమ్మెయిం। జొరసగువాఁడె దేవపతి♦సూనుఁడు దైవము చేత సూచితే. 206

చ. మగలకు మేటియైన బల ♦ మర్దననందనుఁ బేడిఁ జేయఁ గాఁ దగునె విధాత నీకు నని♦ దైవము దూఱుచు నోర్వరాని నె వ్వగ దలకొన్న నెంతయును ♦ వందుచు నిద్దురవస్థ యెన్నఁడో తెగుటని సంతతంబును మ ♦ దిం దలపోయుచు నేమి సేయుదున్. 207

సీ. [2]తనయొప్పిదురఁగన్నఁ ♦ దగిలియెవ్వరికైన
మలఁగిక్రమ్మఱఁజూడ ♦ వలయువాఁడు

---

1. జ. శౌచములను. 2. గ. తనయొప్పిదముఁ గన్న.

తనవర్తనము విన్న ♦ మునిజనంబులకైన
నలవరించికొనంగ ♦ వలయువాఁడు
తనబంటుతన మూజిఁ ♦ గనిన మార్తులకైనఁ
బలుమాఱు నగ్గింప ♦ వలయువాఁడు
తనవితరణకేళి ♦ వినినఁ గల్పకతరు
ఫులకైనఁ దలయూఁప ♦ వలయువాఁడు

తే. నకులుఁ డొరులకు నశ్వశి ♦ క్షకుఁడుగాఁగ
నగునె యాతని దుస్థితి ♦ యనుదినంబుఁ
గాంచి [1]కన్నీరు డించుచుఁ ♦ గడవ రాని
దైవఘటనకు [2]నోర్తుఁ జి ♦ త్తంబులోన.

శా. ఆరూపం బవికార మాభుజబలం ♦ బత్యంతనిర్గర్వ మా
శూరత్వంబుదయారసానుగత మా♦శుంభత్ప్రియాజ్ఞాన మా
ర్యారంభప్రతికూల వాదరహితం ♦ బాయిాగి సమ్మానవి
స్తారోదాత్తము మాద్రిపిన్నకొడుకే♦తన్మాత్రుఁడేమాడఁగన్.

క. సుకుమారుఁ డతఁడు గోపా
లకవృత్తి వహించి యడవు ♦ లం గ్రుమ్మరు చు
న్కిటకి నాకకాడు పగవా
రికినైనను నకట మనము ♦ రియదే వగలన్. 210

ఉ. ఏనును మీరుఁ గానలకు ♦ నేఁగునెడన్ ననుఁ జేరి
యెంతయున్ । దీనత దోఁపఁ గుంతి సహ ♦ దేవుని నిల్లడ
[3]వెట్టి నాకు న । మ్మాని నిను నమ్మి చాల విష ♦ మం

1. ఖ. గ. కన్నీరడంచుచు. 2. గ. నోర్తు. 3. వెట్టె.

బగునివ్వనవాస మీతఁడుం। బూనఁగ నియ్యకొంటి నని ♦
బోరన నశ్రులు గ్రమ్మ చూడఁగన్. 211

వ. మఱియును. 212

చ. కడుఁబసిబిడ్డ వీఁ డొకటి ♦ గాదవు నా నెఱుఁగండు
ముంద రె। య్యెడ నొకపా టెఱుఁగఁ డెద ♦ యెంతయుఁ
గోమల మెప్పుడైన నేఁ। గుడువఁగఁ బిల్వఁ గాని తన ♦
కుం గల యాఁకటిప్రొద్దెఱుఁగఁ డీ। 1కొడు కిటు వోకకుజ్ఞ
మనము ♦ గుందెడు నిక్క గని యూఱడిల్లెడున్. 213

తే. ఎప్పుడెయ్యెడ నేమిట ♦ నెట్టు లరయ
వలనె నమ్మియి నారయు ♦ మలసి డస్సి
నొచ్చియైనను నేమఱ ♦ కిచ్చఁ దలఁచి
2కడమి నాచేత దీవన ♦ వడయుమమ్మ. 214

వ. అని యప్పగించె నేనును వనవాసకాలంబున నానేర్చు
విధంబున మీకు నెల్లను 3గారామైన తమ్ముని నమ్మియిం
బరికించికొని వచ్చితి నిపుడజ్ఞాతవాసాయాసితుండగు నతని
నాకు ననుసరింప వెరవు గామింజేసి చేయున్నది
లేక చింతిల్లుచున్నదాన నా తెఱంగు వినుము. 215

సీ. ద్రుపదభూవిభుఁడు పు ♦ త్రులకంటె నెంతయుఁ
బెంపుసేయుచు గార ♦ వింపఁ బెరిఁగి
కుంతిమహాదేవి ♦ కోడండ్రలోపల
నగ్గలంబునఁ గొని ♦ యాడఁ బరఁగి

1. కొడుకనిపోవకకుజ్ఞ. 2. క. తెడవి. 3. చ. గారాబమైన.

ప్రాణంబులకు నెల్ల ♦ ప్రాణంబుగా మీరు
నెయ్యంబు తియ్యంబు ♦ నెఱప నడచి
మదిఁ దల్లిదండ్రుల ♦ మాఱుగాఁ గొని జను
లనిశంబు భక్తి సే ♦ యంగ నెగడి

తే. రూపగుణవిక్రమంబుల ♦ రూఢి కెక్క
నట్టికొడుకుఁ గని భర ♦ తాన్వయంబు
నందు నాయిల్లు యిల్లుగా ♦ నతిశయిల్లి
తగవుమై బాంధవులచేతఁ♦ బొగడువడసి. 216

మ. వినుతింపం దగు రాజసూయమునఁ బ్ర ♦ ధ్వదేవతా కోటి కె
ల్లను [1]సంతృప్తిమొనర్చి వారిదయఁ గ ♦ ల్యాణాత్మ నై
పుణ్యవ్రతన రాండ్రక్షితిపాలు కోడ లనఁగా ♦ రాజన్య
మాన్యప్రియురాం గనలం దెల్లఁ బొగడ్తగంటి నతిలో ♦
కం బైనమీామన్ననన్. 217

ఉ. ఏను మనంబు పెంపు సెడి ♦ యిప్పుడు నీచతరప్రచారముం
బూని నికృష్ట నైయుదర♦పోషణ కై తగ వేది యొంతయుం
దీనతఁ బొంది యిమ్మెయి సు ♦ దేష్ణకు నుల్ గనుసన్నఁ
జేయుచుఁ | హీనత నున్కి మీాకు వగ ♦ పేమియుఁ
జేయడ యేమి సేయుదున్. 218

క. పని పంపఁగాని యొకతకుఁ
బః సేయ నెఱుంగనన్నుఁ ♦ బనికొను నెడఁ బొం
డుని యగ్రమహిషి గొంకుచుఁ
బని గఱపెడుచందమునన ♦ పనుచు టెఱుఁగవే. 219

---

1. ఖ. సంప్రీతి.

ఉ. ఒల్లరు రాజదేవులును ♦ నొడ్డులు రాచినచందనంబు మే
నెల్లఁ జెమర్పఁగా నలయ♦కేను శ్రమంపడి నిల్చి నిల్చి య
ల్లల్లన మార్దవం బొనరు ♦ నట్లుగ నెట్టకునేని రాచి మీ
తల్లికి భక్తిఁ బెట్టెడువి♦ధంబునఁ బెట్టుదు బ్రహ్మఁ దిట్టుదున్.
ఉ. నున్నఁదనంబుగా నలుఁగు♦నూఁడియుఁ జందన మట్లు రాచి
యుం । బన్నుగఁ గ్రొత్తలెంకల ♦ పంబుల గూర్చియు
నాసుదేష్ణకుం । గన్నులసన్నలం బనులు ♦ గైకొని వారక
చేయుచుండుటన్ । ము న్నటు లున్న పాణితల♦ములన్ [1]బలు
గాయలు గాచెఁ జూచితే. 221

క. అనుచుం దొరఁగెడు నశ్రుల
మునిఁగిన మో మొత్తనివశు ♦ మునఁ జేర్చిన న
వ్వనిత యవస్థయ తాల్చుచు
ననిలసుతుం డడలె డెంద ♦ మలమటఁ బొందన్. 222

తే. అట్టియెడఁ దన్నుఁ దాన యూ ♦ రార్చికొనుచు
నంబుజానన నెమ్మొగ ♦ మల్లఁ దుడిచి
యనునయించి తత్కరములు ♦ దన మొగంబుఁ
గదియఁ జేర్చుచు నిట్టూర్పు ♦ గాడ్పు నిగుడ. 223

వ. చింతాక్రాంతుం డైనకౌంతేయునకు నయ్యింతి యి ట్లనియె.

తే ఇందఱకు నిన్నిభంగుల ♦ నిడుమ గుడువ
వలసె ధర్మతనూభవు ♦ వలనఁ జేసి
దాయ లొడ్డిన మాయజూ ♦ దంపుటురులఁ
బడి కులంబున కాతఁ డి ♦ ప్పాటు దెచ్చె. 225

1. గ. జ. వలిగాయలు.

ఉ. అక్కట మోసపోయి యడి ♦ యాసలఁ జావక యున్నదాన
ము । [1]నొక్కెడనే దురంతదురి ♦ తోత్కటబాధలఁ బెట్టి
యున్న నా । కెక్కడికి [2]దుఃఖశాంతి గడ ♦ యెద్దుట యెమ్మె
యిఁ గల్గ నేర్చు మీ । ముక్కున నూర్పు గల్గ నొక ♦ మూర్ఖు
నిచేఁ బడితిఁ సభాస్థలిన్. 226

క. మీ రేమి సేయుదురు దై
వారంభము గాక శుభము ♦ నశుభంబును సం
సారులఁ దనతనతటి నని
వారణఁ బొందంగ మాన్ప ♦ వచ్చునె వానిన్. 227

ఉ. కావున మీర లభ్యుదయ ♦ గౌరవ మొందుట యాత్మఁ గోరి
యే । నేవిధి నైన నాపదల ♦ కెల్లను నోర్చెద దాని కేమి
యీ । [3]కాపర మైనకీచకుఁడు ♦ కామనిపీడితుఁ డై యలం
తులం । బోవక [4]యేచి పట్టుకొనఁ ♦ బోయినఁ [5]దూలెదఁ
గాక యిమ్మెయిన్. 228

తే. వానిఁ దెగఁజూడ వై తేని ♦ వాయుపుత్ర
నీవు గనుఁగొన నురినైన ♦ నీర నైన
నగ్ని నైన విషంబున ♦ నైన నేను
మేను దొఱఁగుదు నెట్టు నీ ♦ యాన సుమ్ము. 229

వ. అనిన వృకోదరుండు చిఱునవ్వు నవ్వుచు ని ట్లనియె. 230

---

1. గ. నొక్కొడలన్; చ. నొక్కతనే; జ. నొక్కఁడునా.
2. క. దుఃఖవార్ధిగడయీఁదుట. 3. క. గ. కావలమైన. 'కావలము' కావ
రమునకు రూపాంతరము. 4. జ. వేచి. 5. గ. దూలెదఁ.

చ. జలజదళాక్షి కీచకునిఁ ♦ జంపుట కిమ్మెయి నుట్టిఁ బల్కఁగా
వలయునె యేను జూడ నని ♦ వారణ నిన్నుఁ 1బరాభవించి
వాఁ । డిల మన నింక నాంధ్రకును ♦ నెవ్వరు భంగము నీఁగఁ
జాలువా । రలఘుత్వదీయ బాహుబల ♦ మప్పుడ చూపని
తప్పు సాలదే. 231

తే. ఎల్లి యెల్లవిధంబుల ♦ నెందుఁ జొచ్చె
నేని నాధర్మతనయుండు ♦ తాన వచ్చి
యడ్డపడెనేని నీవ పెం ♦ పారుకరుణఁ
గాచి తేని నాచేఁ బడుఁ ♦ గీచకుండు. 232

వ. వానిదెసం జింత యేవంత వలన దమ్మాటలు విడువుమని
యూఱడిల్లం బలికి దుర్దశల నలందురు నవ్వేలందికుందు
వాపం దలంచి యి ట్లనియె. 233

సీ. చ్యవనుని వాంఛకు ♦ సంయాతినందన
యిడుమలఁ గుడువదె ♦ యడవిలోన
రాఘవుతోడ న ♦ రణ్యవాసము సేసి
సంతాప మందదె ♦ జనకతనయ
కుంభసంభవునకై ♦ ఘోరదుర్గములలో
పాముద్ర యలజడి ♦ పాలుగాదె
నలునిపిఱుందఁ గా ♦ నల కేఁగి దమయంతి
మనుజులు వడనియు ♦ మ్మలిక వడదె

తే. వారు సైరణసేసి దు ♦ ర్వార మైన
నిరతిశయదుఃఖభారంబు ♦ నిస్తరించి

1. ఘ. బరాభవించె వాఁ, డిల మగ లింక.

సౌఖ్య మొందరె నీవు నా ♦ చందమునన
యాపదల కోర్చి సంపద ♦ లనుభవింపు. 234

వ. దుర్యోధనదుశ్శాసన కర్ణశకునిసైంధవప్రముఖం బగుదుష్ట లోకంబు నధోలోకంబున కనుచునంతకు మదీయాంత రంగంబు చింతాభరభుగ్నంబును నవమానపంకమగ్నంబును గోపోద్విగ్నంబును నై వేగిరపడుచున్న యది ధార్తరాష్ట్రు లకుం గాలావసానం బైనయట్లు సమయకాలావసానం బయ్యె నజ్ఞాతవాసంబునకుం జొచ్చి పదునొకొండు నెలలు సని పండ్రెండవనెల వర్తిల్లుచున్నది దీనికొఱంత దీఱిన నీవు నంతయుం దీఱు నూఱడిల్లియుండుము సింహబలుండు నిన్నుఁ బరిభవించి మైమైతోనయునికిం జేసి యెల్లియుం జెనక వచ్చు నీవుం గ్రమంబున నొడంబడుట భావించికొని వానికి నర్తన శాల సంకేతప్రదేశంబుగాఁ జెప్పి యొంటిమెయిం జనుదేర నియమింపుము వాఁడువచ్చిన నాసాబగునిం డెగఁ జూచి నీకుం జూపి నీచిత్తంబు వడసెద నిత్తెఱంగు దప్ప నొండు విధంబు గర్జంబు గా దిదియ నిశ్చయం బిట్లు చేయువార లిమ్మాటలపలనం 1దప్పు గాని వేగుచున్నయది జనులు మేలుకాంచి మసలం గాంచి రేని వంచన బయలుపడినం గార్యంబు దప్పుఁ గీచకవధంబునకుం బూనిన నామనో రథంబు దుదిముట్టవలయు నిజశయనస్థానంబునకుం బొమ్మని శయ్యాతలంబు విడిచి యత్తన్వి దటిమి కొన్నియడుగు 2లనిచి మరలి మారుతాత్మజుండు కలుషితాత్ముం డగుచు

1. ఖ. దలంపుము వేగు. 2. జ. ల నిలిచి.

సెజ్జకు వచ్చి నచ్చెలువయుం దననింద్రించునెడకుం బోయి
పర్యంకభాగంబునం దనువ్రవైచి యంకిలి దేఱనిడొందం
బునఁ గొందలంబుతోడినిశ్చయంబున నిద్రం బొరయని
కనుదోయి మొగిడ్చి యుండె నంత. 235

—◆ ప్రభాతకాలవర్ణనము ◆—

తే. ప్రమదవనంవన పరిభవ ◆ దుఃఖమునకు
నుల్లమున దూరపిల్లుచు ◆ నున్నవరసి
వేఁడినిట్టూరుపోయున ◆ వెడలెఁ గ్రొత్త
తావి మూతులు విచ్చునె ◆ త్తమ్మివిరుల. 236

క. విచ్చెం దిమిరము గాఁపులు
వచ్చె మధుపకులము లబ్జ ◆ వనముల కురులం
జొచ్చె విరులు తరులతికల
నిచ్చె రథాంగములు వంత ◆ యెల్లఁ దొలఁగుచున్ 237

సీ. పెనఁకువఁ దనిసిన ◆ తనువులొండొంటితోఁ
గీలించి నిద్రించి ◆ మేలుకాంచి
తరుణులుఁ బతులు వా ◆ తాయనంబుల నల్లఁ
[1]బొలయు వేఁ బొకటి ◆ మలయపవను
నింపారు[2]చోఁకున ◆ నిగురొత్తు చిత్తంబు
తెలసియొండొరులపైఁ ◆ బొలయుచూడ్కు
లాదట నుపకర ◆ ణావలి వెడవెడ
యాదరించుట రాగ ◆ మడరఁ దొడఁ

1. క. మలయు. 2. 'చోఁకు' అని చకారాదియే.

తే. కేళిసలిపిరి భవనదీ ♦ ర్ఘికలతమ్మి
విపులనేత్రావి నెనయంగ ♦ బెరసి చెమట
పొడము మేనులతనికంపు ♦ ప్రోచితఱచు
టూర్పుగాడ్పుల పరిమళ ♦ ముల్లసిల్ల. 238

తే. రాలి యున్న పువ్వుప్రక ♦ రము విదిర్చి
చెన్నుగా నున్న సేసిన ♦ సెజ్జయనఁగ
వేగుటయుఁ జుక్కలన్నియు ♦ విరిసి విశద
భాతిఁ జెలువొందెఁ జూడనం ♦ బరతలంబు. 239

వ. 1తదవసరంబున నల్లనల్లన తెఱపిం బుచ్చియవులవులం జను
నంధకారంబుదూరంబులయందును లేకునికివలనం గశశ్శప్ప
ళించి నెరసి విరిసినం బోలుచుకలుకట్టలుం బోనివిక్తటంబు
లునుదమపాసినకందువలు రోసియెత్తినమెడలును బచరించిన
చూడ్కులు వేట్కలం గ్రందైనడెందంబులుం గలిగి మెలం
గుచు నొండొంటి బిట్టుగాంచియొదవుసమ్మదంబునం బొదలు
మేనులు బెరయించి పరమానందంబునం జొక్కుచు జక్క
వలు గలసి సోలసి నలిరేఁగి చెలంగుచు రేయింటియాఁకటి
వెల్లున 2గొదగొనికమిచి చంచువులం దిగిచిత్రుంచి యూనుచు
నిక్కడక్కడఁ బఱచినంజిక్కువడియున్నమృణాలశకలంబుల
వలన బాలచంద్రశతాభిరామంబు లగు శంభుజలమూర్తివిశే
షంబులం బోనిసరోవరంబులును జీఁకటి వాసిన ప్రభాతంబును
వింతమానిసి మెలంగి ముసుంగువుచ్చినట్లు మేలుకని యొఱ
కలు వొదలవిదిర్చి కూర్చికొని కలగొనంబలుకు పులుఁగుల

1. క. గ. చ. తదనంతరంబ. 2. చ. నంగదగొని.

మెఱుంగులవలన నొండొంటిం దెలుపు కరణి నొప్పు ధరణీ
రుహంబులును బరఁగునరుణోదయరాగపటలంబు సనయు
కెంజాయ రంజిల్ల వికసిల్లురక్తారవిందంబుల దండడ[1]నెగసి
చరించు చంచరీకంబుల మెఱుఁకల నెఱుల గిఱికొని క్రొత్త
యగు కాంతిప్రవాహంబులం గడలుకొల్పు పుష్పాళ్ళు దుల్చి
రాల్చుచుం బొలయుమలయానిలంబునం గ్రాలుమవ్వంపుఁ
దీవలఁ గడివోయి తొరఁగినవిరులవలన మీనకేతనపురాతన
బాణశాలలంబోనిలతామండపంబులును మొగిడియు[2]జనంబు
సంధ్యాంజలిపుట కరణంబుల ననుకరించువిధంబునం దర్శ
నీయంబు లగు కుముదవనంబులును నేమేనినెపంబున నొండొ
రుల మేలు కాన్పుర మణ రమణీజనంబులనర్మాలాపంబులఁ
బెరయు దరహాసంబులకాంతిఁ దెలుపెక్కినట్లు [3]వెలరారు
దీపంబులును మునుకడ వచ్చి మెఱుఁక సేయుమికి వాతాయన
పవనునిపయిం బుట్టినయలుకవిధంబున వేగుఁబోకట నాకు
రించు[4]మదంబునఁ గెంపు గమురుట నివ్రిలేమి ననిశంకింపక
యుంపునం గదియువిదగ్ధవిటజనంబుల మనంబులం దిగుచు
లలనా[5]లోచనంబులును శేపకడ వనలక్ష్మీపురశ్రీనలంక
రించువడువున [6]నెడపడక యెల్లెడల నిగుడు విభాతకుసుమ
కదంబపరిమళంబును నైయున్నంత. 240

1. గ.జ. నెరసి. 2. జగంబు...పుటకరంబుల. 3. క. వెలుఁగువాఱు. 4. క. గ. జ. "తమందంబు" అని పెక్కెడలఁ గానిపించుచున్నది. 5. క. చ. లోకంబులును. 6. ఖ. గ. నెడపక.

ములు ♦ నిష్ఠమైఁ జేసిన
భవ్యతపంబున ♦ ఫల మనంగ
ఖాభినం ♦ దితచక్రయుగ్మకం
బులయనురాగంపుఁ ♦ బొలివనంగ
బ్రహ్మమ ♦ హానుభావంబులొ
[1]కొట్టిగాఁగఁ గరఁగిన ♦ గుటికయనఁగ
ద [2]త్రయ ♦ లతికాచ యము పెను
పొందఁబు బైడుమూాల ♦ కందమనఁగ

ముల [3]కన్నెఱ ♦ యగుచు జనన
పుటహృదయస ♦ రోజములకు
ంబును జృంభణం ♦ బును నొనర్చి
ంబంబు పూర్వాద్రి పై ♦ వెలింగె. 242

దయ మగుటయు సమయసముచిత కరణీ
వేగిరంబ నడపి వేగిరపాటుతో సింగారంబు సేసి
బలుండు. 241

గదిరిన తమకం
డిముడి పడుచు ద్రుపద ♦ పుత్రికపై నూ
క్కు దిగువ [4]నొకటియుఁ
ిన వినలేక మదన ♦ కంపితుఁడగుచున్. 243

ు సుదేష్ణమందిరంబున కరుగుచు నంతరంగంబున

---

చ. నొక్కుటఁ గరంగినయట్టిగట్టియనఁగ. 2. గ. త్రయా
ప్తెఱ. 4. గ. నొంటిం.

ఉ. చయ్యన నేఁగి యంబుజవి ♦ శాలవిలోచనఁ గాంచి ప్రీతిమై
నయ్యెడ నేకతంబ పహ్నద ♦ యం బలరం దగఁ బల్కు
యొక్కమై । నియ్యకొనంగఁ జేసి యెల ♦ యించెద నిక్కు
కుఁ । దార్చినేన్పునట్ల శయ్యకుఁ దెచ్చెదం గుసుమ ♦
సాయకు పూనికి నేఁడ తీర్చెదన్. 245

క. అని యువ్విళ్లూరుచు వెసఁ
జని కేకయరాజపుత్రి ♦ సదనంబున న
య్యనిమిషచారువిలోచన
యనురూపవిధాననిరత ♦ యై యుండంగన్. 246

చ. కనుఁగొని యప్డు గ్రొత్తయగు♦ కౌతుకవృత్తి మునింగిపల్లటి
ల్లిన ధృతితోఁ గ్రమం బరయ ♦ లేనిమనంబు చలింపనచ్చు
టన్ । జను[1]లెడయాట గాంచు నెటి ♦ సాలక గ్రక్కున
నింతిఁ జేరఁగాఁ । జనియె [2]విధాత్ర లుబ్ధకవ ♦ శంబునఁ
బోవు మృగంబుచాడ్పునన్. 247

క. చనుటయు ద్రౌపది యతనిం
గనియుం గాననివిధంబు ♦ గైకొని చిత్తం
బున బెదరక తనముందటి
పనివెరవున నుండె భీము ♦ పలుకులయూఁతన్. 248

వ. అట్టియెడ. 249

---

1. చ. లెడయాట. 2. విధాత్రలుబ్ధకవశంబున మృగంబు పోవుట యసంభవమే. కాని ప్రతులందెల్లఁ బాఠమిట్లేయున్నది. "వశంబున ముగ్ధ మృగంబు చాడ్పునన్" అని యొకరు దిద్దినది సరసముగానున్నది.

సీ. ఎవ్వరితో నైన ♦ నెలుఁగెత్తి యొక్కింత
పని లేనివెంగలి ♦ పలుకు పలుకు
మట్టియ లొండొంటి ♦ బిట్టు దాఁకఁగ నేల
నందంద మునిగాళ్ల ♦ నప్పళించుఁ
గడు వికారంబుగా ♦ నోడ లెల్ల విఱుచుచు
మలఁగి రిత్తకురిత్త ♦ సెలఁగ నవ్వుఁ
దాళంబుగాఁ గర ♦ తలమునఁ బెలుచఁ గం
బంబు వ్రేయుచు నెడ ♦ పాట వాడు
తే. మలయు నంతంతఁ జేరవఁ ♦ బొలయు నింతి
దన్నుఁ జూడమి కెంతయుఁ ♦ దల్లడిల్లు
నిక్కడక్కడఁ బడుఁ దగు ♦ లినుమడింపఁ
జూచు నత్తన్వి బోరఁబోరఁ ♦ గీచకుండు. 250

వ. ఇట్లు బహుప్రకారంబు లగుదుర్విలాసంబులు సేయుచు
నద్దురాత్ముండు ద్రుపదనందన డాయం బోయి. 251

ఉ. భాగ్యము గాదె నీచరణ ♦ పద్మము లెప్పుడుఁ జేరి కొల్వఁగా
యోగ్యత గల్గెనేని నను ♦ నొక్కని నొల్లవొ కామ
సౌఖ్య వై । రాగ్యము నీమనంబునఁ ది ♦ రంబో నిజం
బెఱుఁగంగఁ జెప్పు మా । భాగ్యము గుందునే మగల ♦ పై
నొకయించుక చూడ్కి నిల్పినన్. 252

ఉ. ఆలము సేసి నాతగుల ♦ మాఱడిఁ బుచ్చఁగ నేల బేల న
న్నేలి యనంతభోగముల ♦ నిచ్చ మెయిన్ విహరింపు నిత్యల
క్ష్మీలలితాలవాల మగు ♦ జీవన మంతయు నీమొగంబ కాఁ
బాలనసేయు మిప్పరము♦భామినులెల్లను నిన్నుఁ గొల్వఁగన్

ఉ. రాజులనెల్ల నుగ్రసమ♦రంబుల వ్రేల్మిడి నోర్చి పేర్చి యీ
భూజనకోటి నాదగువి ♦ భుత్వసమగ్రత నాదరించి వి
భ్రాజితరాజ్యతంత్రములు ♦ పాలనసేయుదు నేన పీటికిన్
రా జనఁగా నెపంబిడి వి ♦ రాటునకుం దగఁ గూడు
వెట్టుదున్. 254

వ. కావున.

క. నీ వొకత వేల యిలఁ బది
వేవుర నే వలచి పట్టి ♦ వెదకిన నడ్డం
బై వచ్చి వలదు నా నిం
1దేవాఁడు మగండు దీని ♦ నెఱుఁగవ కంటే. 256

చ. విరటుఁడు సూచు చుండ నిను ♦ వేవురముందట నట్లు
ద్రోవ నొ। కరుఁడును గాదు గూడ దనఁ ♦ గల్గెనె పో
టువు లైనభర్త లే। వురు గల రంటి వారియల ♦ వుం జా
లముం గడగంటి నింక నె। వ్వరు గల రెట్లు దప్పె దని ♦
వారణఁ బట్టెద నెందుఁ జొచ్చినన్. 257

వ. అనిన నవ్వేలంది వీఁడు దమకించి యున్నవాఁడు నాయం
త్రించుమాటలకు మున్న కదియంబడినఁ గర్జంబు దప్పునని
విచారించి. 258

తే. బహువిధంబుల నమ్మోయిఁ ♦ బలుకునతని
పలుకు లేర్పడ విని మెత్తఁ ♦ బడినయట్లు
సుభగ మెఱుఁవడిచూపుగాఁ ♦ జూచి తనదు
హృదయ మెఱిఁగించు తెఱఁగున ♦ నిట్టులనియె. 259

1. క. దేవాఁడిమగండు.

చ. వల దని యెంత సెప్పినను ♦ [1]వావిరి వై కడువేగపాటుమైఁ
బలుమఱు నెల్లెడం దొడరఁ ♦ [2]బాతెను నీ హృదయంబు
నట్లు కాఁ । దలఁపు మనోజతాపులకుఁ ♦ దక్కటిచిత్త
ములుం [3]గడంగి వి । చ్చలవిడి సేఁత గర్జమె వి ♦ చా
రము గోర్కికిఁ గానివావియే. 260

క. మగ లడఁకువ [4]నుండక తమ
తగులమ ఘటింతు రెట్టి ♦ తగులం బైనన్
మగువల [5]యెడలన యడఁగుం
దగవు విడిచి యడిచిపడరు ♦ ధైర్యము పేర్మిన్. 261

ఆ. ఇట్టు లగుట యెఱిఁగి ♦ యెల్లభంగుల రహ
స్యంబు గోలుపోని ♦ యట్లు గాఁగ
నడరునీదుకోర్కి ♦ కనురూప మెట్టిది
యట్టిభోగభంగి ♦ ననుభవింపు. 262

చ. అనవుడుఁ గీచకుండు హృద ♦ యంబునఁ బొంగి లతాంగి
తోడ ని । ట్లను ధృతిఁ గోలుపుచ్చెఁ గుసు ♦ మాయుధుఁ
డేటివిచార మిట్టు లేఁ । ప నగునె యైన నీ దయిన ♦ పం
పెదఁ గైకొని చేయువాఁడ నే। యనువున నెప్పు డెయ్యెడ
ని ♦ జాభిమతం బొడగూర్తు చెప్పుమా. 263

క. అని పలికినఁ బాంచాలియుఁ
దనయురులం గీచకుండు ♦ దగులుట భావం

---

1. చ. వావిరిమై. 2. ఘ బాఱెడు. 3. గ. జ. గరంగి. 4. జ. నూడక. 5. క. యెడఁదన.

బున నిశ్చయించి యిట్లను
ననురాగాయత్తచిత్త ♦ యైనదివోలెన్. 264

ఉ. ఉత్తర లోనుగాఁ గలప ♦ యోజముఖుల్ పగ లెల్లఁ బ్రీతి
తో। నృత్తముఁ జేసి పోవ మహ ♦ నీయరహస్యవిధిన్ నిశీ
థినీ। వృత్తము గోరువారలకు ♦ వెక్కసుఁ బట్టగు చుండు
నాగృహం। బుత్తమ మిత్తెఱంగునకు♦ నొంటిమెయిం దగ
నీవు వచ్చినన్. 265

క. అనిన నతఁడు వికసిల్లుచు
నను నెమ్మోము నెలికొనిన ♦ నలినానన నీ
యనుమతి సేయనె యొక్కఁడఁ
జనుదెంచెద నేఁటిరాత్రి ♦ సమ్మదలీలన్. 266

తే. 1ఇదియ నిశ్చయ మిమ్మాట ♦ వదలకుండు
మనిన నీవొక్కరుండవ ♦ యరుగుదేర
వలయు లేకున్న నయ్యెడ ♦ నిలుచుదానఁ
గానుజూ నిక్కువం బని ♦ పూనిపలికి. 267

క. మన మియ్యెడఁ ♦ బెద్దయుఁ బ్రొ
ద్దనుమానము లేక మాట ♦ లాడుట దగదీ
వును బొమ్మనును నా దగు
పని సేసెద ననియెఁ గమల ♦ 2పత్రేక్షణయున్. 268

1. చ. ఇదియ నిశ్చయార్థ ♦ మిమ్మాట వదలక. యుండు మనిన నీవు ♦ నొక్కరుండ, వరుగుదేరవలయు ♦ నటుగాకయున్న నే, నిలుచు దానగాను ♦ నిక్కువంబు. 2. 'పత్త్రాయితనయుక్' అనియే ప్రతులం దెల్లఁ జూపట్టెడి.

చ. సమయము నిర్ణయింప విని ♦ చంద్రనిభాననపల్కు లష్టచి
త్తమునకు నింపు పెంపఁగ ము ♦ దంబునఁ గీచకముఖ్యుఁ
డాత్మ గే । హమునకుఁ బోయె నమ్ముదిత । ♦ యచ్చట
వెండియుఁ బ్రస్తుతక్రియా । సముచితవర్తనంబుఁ దగఁ ♦
జల్పి మహానసశాలలోనికిన్. 269

—♦ ద్రౌపది భీమునితోఁ గీచకుఁడు నర్తనశాలకు రాఁబోవుటం జెప్పుట. ♦—

క. చని వెడ వికసిల్లెడునా
ననపద్మముతోడ ననిల ♦ నందనునకు ని
ట్లనియెఁ జతురోక్తిరీతి య
తనిగూఢక్రోధవహ్ని ♦ దరికొల్పంగన్. 270

క. నాకోఱఁత దీర్చి వచ్చితి
నీకోఱఁతయు యింక సూతు ♦ నిం దెగఁ జూడన్
లోకము వంచింపను దగు
చీఁకటిరే యొదవ నేమి ♦ సేసెదొ చెపుమా. 271

వ. అనిన విని దరహసితవదనుం డగుచు వృకోదరుం డిట్లనియె.

క. నన్నడుగ నేల నీవును
నన్నిచుఁడు నేమిమాట ♦ లాడితి రది నా
కున్నట్టు లెఱుఁగఁ జెప్పుము
నిన్నే మెచ్చించువాఁడ ♦ నీరజవదనా. 273

వ. అనినఁ బాంచాలి సుదేష్ణమందిరంబునం దానుచితాచర
ణంబున నునికియు సింహబలుండు సింగారించుకొని వచ్చు
టయు రేయింటిమాటలవలనం దాను బెదరమియు వాఁడు
సామదానభేదదండంబులు సూపి పలుకుటయు దానికి

మెయికోలు భావించికొని క్రమంబునం దగినసంభాష
ణంబు సేసి నాట్యమండపంబు సంకేతస్థలంబుగాఁ జెప్పి
యొక్కరుండ వచ్చువాఁడ వని నియమించుటయు నద్దురా
త్ముండు ప్రముదితాత్ముం డగుచు రాత్రిసమయంబున
నయ్యేడకు నొంటిమెయిం జనుదెంచువాఁడై చనుటయుఁ
దెలియం జెప్పిన నతండు పరమాహ్లాదంబునం 1బొంది. 274

శా. క్రోధం బ్రతికారమై హృదయముం ♦ గుందింప నత్యంత
చిం । తాధూతాత్ముఁడ నైననాకుఁ బరమో ♦ త్సాహంబు
సంధిల్ల దు । స్సాధం బైన విరుద్ధకార్య మిటు లా♦సన్నం
బుగా సంఘటిం । తే ధర్మాత్మజుఁ డాత్మ మెచ్చుఁ బగ
సా ♦ ధింపంగఁ గాన్పల్పమే. 275

వ. అని పలికి కొండొక విచారించి. 276

క. వెలవక సంకేతించిన
తెఱఁగున నయ్యేడకు నరుగు ♦ దెంచునొకో కొం
దఱఁ దెచ్చునొకో వెడఁగై
యఱిముఱి వెలిపుచ్చునొకొ ర ♦ హస్యం బెల్లన్. 277

ఉ. అట్టిద యేల చేయు నన♦యంబు నయం బొడఁగూడఁ
బల్కె నీ । విట్టి తెఱంగు సేయు మని ♦ యేర్పడఁ జెప్పిన
వాని కర్తఱిం బుట్టినసంతసంబునను ♦ వుం బరికించితి కాదె
యింక ని । ట్టట్టనఁ డెట్టులైన హృద ♦ యంబున నెక్కుడి
శంక వానికిన్. 278

---

1. బొంగి.

ఉ. వచ్చు మదాంధవృత్తి నని ♦ వారణ నొక్కఁడు నాట్యశాల
కుం । జొచ్చు నవశ్యముఁ వెదకి ♦ చూచి ననుం గని
యప్డు సంగరం । బిచ్చు మదీయబాహుబల ♦ హీనబలుం
డంబు నీకుఁ బ్రీతిగాఁ జచ్చు నసంశయం బిది వి ♦ చారము
లిన్నియు నింక నేటికిన్. 279

వ. అని నిశ్చయించి వృకోదరుండు వెండియు నిట్లనియె. 280

మ. బలియుం డాసాబగుండు భావభవద♦ర్పభ్రాంతుఁ డై వచ్చి
ని । శ్చలసర్వాంగత నున్న నన్నరసి నీ♦చందంబు గా కున్న
నా । కులతం బొందెడు నప్డు మండపము సం♦క్షోభింపఁగా
1నేతుఁ గట్టలుకఁ బెబ్బులి 2గోల వేసినటు లు♦గ్రాకార
మేపారఁగన్. 281

క. ఎఱిఁగి పిఱుసనిన వెసఁ బై
కుఱుకుదు సాళువము గాకి♦నొడిసినభంగిన్
వెఱచఱవం బొదువుదుఁ బఱి
పఱిసేయుదునీదుపూన్కి ♦ పారం బెయిదన్. 282

ఆ. నాదుబాహుబలము ♦ నకు మాఱుకొనఁ జాలు
భుజబలంబు గలిగి ♦ పోక చిక్కఁ
బెనఁగి నన్నుఁ గొంత ♦ గినియింప నోపెడు
చంద మైన వినుము ♦ సరసిజాక్షి. 283

మ. అవనీచక్రము సంచలింపఁగ దివం ♦ బల్లాడ నాశాచయం
బవఘూతంబుగ గోత్రశైలనికరం ♦ బాకంపముం బొంద న

1. చ. లేతు. 'గోల' యనఁగా గంతు. 'ఇట్టలముగఁ గోల వేసిన (విదిప. 3-౧౫౯.) గోలురించు' అనఁగాఁ, బులి గంతుగొనుట.

ర్ణవముల్ ఘూర్ణన మొందఁ గ్రోధము గృతా ♦ ర్థత్వంబు
నొందించి చి। త్రివధప్రౌఢి వహించి సూతునకు రా♦ద్రిం
బేర్పడం జూపెదన్. 284

వ. అనినం బాంచాలి సంచలితస్వాంతయై నిజాంతర్గతంబున
నతనితీవ్రక్రోధంబు గుప్తసాధనంబునకు బాధకం బగు నని
బోధింపం దలంచి యిట్లనియె. 285

ఉ. ఒవ్వనివారు నవ్వ మహి♦ మోదధి ధర్మసుతుండు దీనికిఁ
నెవ్వగఁ బొంద భూజనులు ♦ నింద యొనర్పఁగ నేనొనర్చునీ
చివ్వకు నీవు నల్కమెయిఁ ♦ జేసినయాపని గూఢవృత్తికిఁ
దవ్వగు నేని నియ్యభిమ♦తం బొడఁగూడియు నిష్ఫలంబగున్.

క. కావున వంచన బాహిర
పోవక యుండంగ మనరి♦పుం బరిమార్పం
గా వచ్చునేని నట్టిద
నావల పటు గాక తక్క♦నను వలదు సుమీ. 287

వ. అనిన విని ద్రుపదనందనకుం బాండునందనుం డిట్లనియె. 288

చ. మదమునఁ గీచకాగ్రజుఁడు♦మాఱొకని నిల్చిన వీఁక మైమె
యిం। గదిసితిమేని నప్పుడు ప్ర♦కాశరహస్యవిభేదబుద్ధి నా
కొదవు నె యైన నేఁ దలఁచి♦యోపినభంగి నిగూఢవృత్తిమైఁ
బదిలముగల్గి తిన్ననియు♦పాయమునం దెగఁ జూతు నాతనిన్.

క. అనవుడు జయలక్ష్మిం జే
కొను మని దీవించి యింత♦కుం గేకయునం

దూలిన బెగ్గడిల్లు విచ్చలవిడిఁ బేర్చు నెవ్వగల ♦ సందడి
దెందము గంది చేడ్పడున్. 293

వ. ఇవ్విధంబున మదనకదనదోధూయమానమానసుం డగుచు
నిట్లని వితర్కించు. 294

సీ. పడఁతి నన్నూఱడఁ ♦ బలికినభంగిన
నిచ్చమై నిక్కకు ♦ వచ్చునొక్కొ
వచ్చితొల్లిటియట్ల ♦ వడిఁ ద్రోచిపోవక
పొలఁతి యిం పెసలారఁ ♦ బొందునొక్కొ
1తలపోఁత గలిగి యు ♦ మ్మలఁత వచ్చుటకు నొం
డొకవింత పుట్టక ♦ యుండునొక్కొ
గంధర్వులేవురు ♦ గలరని చెప్పిన
న్నెలఁతుకమాటలు ♦ నిక్కమొక్కొ
తే. తెఱవచిడిముడిపాటు సు ♦ దేష్ణ యెఱిఁగి
వేడ్కఁబని వంచు టుడిగి రా ♦ విడుచునొక్కొ
మదనుఁ డింతికి నొజ్జయై ♦ మఱకములను
నదను నెఱిఁగించి నాకడ ♦ కనుచునొక్కొ. 295

ఉ. నిక్కముపోలె నప్పుడొక ♦ నేరమిమై ననుఁ ద్రోచిపుచ్చఁగా
నక్కమలాక్షి పొందుదగ ♦ నాడి తుదిన్ నిజమేది నేఁటిరే
యిక్కకు రాక తక్కిన స ♦ హించునె నక్క మఱుఁ డట్టు
లైన నా। కెక్కడిప్రాణ మేటితను ♦ వెయ్యది నిల్కడ
యేమి సేయుదున్. 296

1. గ. తలఁపాత్మఁగలిగి.

క. అట్టేల రాక తక్కుం
గట్టెడిడియే యాలతాంగి ♦ గామాతురునక్
బెట్టి యచట దానికి మన
సెట్లు నిలుచుఁ దగవువిడువ ♦ నెట్టులు నేర్చున్. 297

ఉ. గానికి నేటినిక్కము వృ ♦ థా పరితాపము దక్కి [1]బాసమై
పూనికి డిగ్గఁద్రావి వెసఁ ♦ బోయెద నిప్పుడ పోయి ముట్టియ
బ్జాననఁ బట్టి తెచ్చి హృద ♦ యంబలరంగ ననంగతంత్రవి
ద్యానిపుణత్వ మేర్పఱిచె ♦ దం బ్రమదాంబుధి నోలలా 298
ర్చెదన్.

ఆ. అనుచు సంచలించు ♦ నడిమాసఁ గ్రమ్మఱ
బాసఁదలఁచి ధృతికిఁ ♦ బట్టువెట్టు
మరుని కోహటించి ♦ యురియాడుఁ [2]మదిముట్ట
గాన నిశ్చయించుఁ ♦ గలఁగుఁ దేలు. 299

వ. మఱియు నక్కోమలివలనిప్రేముడిం దగిలి. 300

సీ. పొడసూపినట్లైన ♦ వడిఁ బట్ట సమకట్టి
పరికించి కానక ♦ బమ్మరించు
మెలఁగినయట్లైనఁ ♦ బలికింపఁ దలఁచి ని
రూపించి లేమి న ♦ ౙ్రలు వహించుఁ
గదిసినయట్లైనఁ ♦ గౌఁగిలింపఁ గడంగి
[3]యూరసి బొంకైన ♦ నలఁత నొందు

1. ఖ. నాసమై. 2. మనమూఁత, గాన. 3. గ. యారఁడిబోఁకైన.

నోడఁబడ్డయట్లైన ♦ నడరి పైకొనఁ జూచి
చెన్నఁటి యగుట ♦ నిశ్చేష్టఁ బొరయు.

తే. లలిత వివిధవిహారంబు ♦ లకు లతాంగి
యెలసి పొలసినయట్లైన ♦ నెలమిఁ గలసి
యభిమతక్రీడ సలుపంగ ♦ నప్పళించి
వెదకి [1]రిత్తబయల్ గని ♦ విహ్వలించు. 301

—♦ కీచకుఁ డుద్యానవనంబున విహరించుట. ♦—

వ. ఇట్లు బహుప్రకారంబు లగుమన్మథవికారంబున కగపడి వెగ డంది యమంద సంతాప భరితాంతః కరుండగుచు సింహబలుండు పరిచారికా ప్రార్థనంజేసి మజ్జన భోజనంబు లోకభంగి నడిపినవాఁడై తదనంతరంబ మనోవేదనా పనోదనార్థంబు మందిరారామభూమికిం జని తత్ప్రదేశంబున. 302

చ. కమలవనంబుపొంత నును ♦ గాడ్పొకయించుక యాదరించుఁ జి । త్తమునకు దానఁ దల్లడము ♦ దన్కుటయుం జని గారవంపుఁజూ । తముకడ నిల్చు నిల్చి యది ♦ తాపముఁ బెంచిన లేఁతతీవజొం । పముఁ జొరఁబాఱునం దలఁత ♦ పైకొనినట్ల వెడలుట్ల వెనుంబడున్. 303

ఆ. సుడియుగాలిఁ బుప్పుఁ ♦ బొడిఁ దన్నుఁ [2]గప్పునో
యనుచు బెగ్గలించు ♦ నగ్గలముగఁ
గురియు తేనియలకుఁ ♦ గొంకు లతాగుల్మ
తరుసమీపములకు ♦ నరిగి యరిగి. 304

1. క. చ. తారిత్తబయ లని. 2. క. గప్పిన, నలఁగు.

వ. ఇత్తెఱంగున నొక్కయెడ నయినను గా లూఁదక లీలో
ద్యానంబు గలయం గ్రుమ్మరుచు. 305

సీ. 1ఇంపైన ప్రియకాన ♦ నిచ్చి నిల్చిన మధు
వాదట నానుమ ♦ త్తాలివిభుని
చెట్టుపల్ పచరించి ♦ చుట్టుఁ గ్రుమ్మరిమనో
రమ నియ్యకొలుపు మ ♦ రాళవిభుని
ఫలరసమొండొంటి ♦ కెలమిఁ జంచులనిచ్చు
మెయిన చొక్కెడు శుక ♦ మిథునములను
గమిఁ బాసి తలిరుజొం ♦ పమునకు మెయిమెయిఁ
దాఁకంగఁ జను పిక ♦ దంపతులను

తే. జూచి చూచి యుల్లాసంబున ♦ నేచి కోర్కె-
లడరఁ జిడిముడిపడు మారు ♦ పడు వెడంగు
పడు వెనుంబడుఁ దల్లడ ♦ పడు దురంత
చింతబారికి నగపడు ♦ సింహబలుఁడు. 306

వ. ఇట్టినలవంత నిక్కడక్కడ వడిఁ దిరిగి తిరిగి. 307

క. వగ ముట్టికొనినఁ జిత్తము
వెగ డొందఁగ మేను గలయ ♦ వెమ్మఁగ ధృతిపాఁ
తగల నొకతీవయింటికిఁ
దగి యుండెడు చంద్రకాంత ♦ తల్పము సేరెన్. 308

క. అం దొఱగి కీచకుండా
యిందీవరనయన నాత్మ ♦ నిడి వేడ్క మెయిన్

1. ఘ. చ. ఇంచినప్రియకాంత ♦ కిచ్చి.

డెందము చని విచ్చలవిడిఁ
గందర్పుఁడు వెట్టిఁ జేయఁ ♦ గా నిట్లనియెన్. 309

సీ. కెంగేలు గేలితోఁ ♦ గీలించి నెయ్యంపు
మాటలఁ దగుమాఱు ♦ మాటలార్చుఁ
గుచము లురంబునఁ ♦ గుదియించి క్రమమున
నిఱిసిన కౌఁగిట ♦ నింపొనర్చు
నంగుళంబుల నల్ల ♦ నలకలు గబళించి
కెమ్మోవి యాని మో♦కిఁ-ంతుఁగాయ్యు
మనము మనంబునఁ ♦ బెనఁచి కేళికిఁ జొచ్చి
సతిఁ జేల్చు సౌఖ్యర ♦ సంపునిట్ట
తే. దనివు మొదలైనఁ జిగురొత్తు ♦ తమకమునకుఁ
బ్రాఁకు వెట్టుచు మగఁడఁ బైఁ ♦ [1]బడుచునింతి
వింతభంగుల కెలయించి ♦ వెకలిఁ జేసి
యభిమతక్రీడనములకు ♦ నలవరింతు. 310

వ. అనుచు వెండియు నిగుడుమనోరథంబులను భావరతంబుల శిశిరోపచారంబులఁ బ్రొద్దుగడపి కడ గానక. 311

క. మాయఁరవి యేల క్రుంకఁడో
కో యను నిట్టేల లెడసె ♦ నో యనుఁ గ్రుంకఁ
బోయెడుఁ జూ యిప్పుడ యను
[2]దాయ పఱిచె నను మనోజ ♦ తాపము పేర్మిన్. 312

---

1. క. క. బడుదు. 2. చ. జ. దాయవెఱచె

ఆ. దివము కాని యింక ♦ భువనంబునం దిట
వట్టి రాత్రి లేని ♦ యట్టుగాఁగఁ
చేసెనొక్కొ విధి వి ♦ శేషించి నాకకా
నేఁడ దివము [1]సాఁగి ♦ నిలిచెనొక్కొ. 313

తే. అనుచుఁ గ్రుంగింప రానిప్రా ♦ ద్దరసి యరసి
శిశిరపర్యంకమున మేను ♦ సేర్చిచేర్చి
వంతఁ దలపోసి తలపోసి ♦ వసరి వసరి
మిగుల వందురి వందురి ♦ పొగిలి పొగిలి. 314

సీ. తనికెడు నారటం ♦ బున నంతకంతకు
వెమ్మచు నునికికి ♦ విడువరయును
గోలుమసంగెడు ♦ గోర్కుల వెనువెంటఁ
బొలుచు నునికికి ♦ నూఱటయును
వావిరిఁ [2]బొదివెడు ♦ పగలసందడిఁ బడి
యుఱియుచు నునికికి ♦ నుడుకువయును
నందంద కదిరెడు ♦ కొందలపాటుచేఁ
దలఁకుచు నునికికి ♦ నిలుకడయును

ఆ. లేమిఁ దాల్మిగొనఁగ ♦ లేక యలందురి
తనువు నింద్రియములు ♦ మనము ధృతియుఁ
దనవశంబు గాక ♦ తల్లడపడి సింహ
బలుఁడు విషమబాణు ♦ బాఱిఁ బాఱె. 315

1. గ. సాలఁ నిలిపెనొక్కొ. 2. ఖ. బొదలెడు.

క. ఇమ్మెయిని నధికపరితా
పమ్మునఁ బడు సూతుహృదయ ♦ పద్మం బలరం
దమ్మికొలంకులు మొగుడవ
నమ్మలు 1సోలంగ దివసనాథుఁడు గ్రుంకెన్. 316

వ. తదనంతరంబ. 317

—♦ సూర్యాస్తమయవర్ణనము ♦—

క. ఇనుండు దనకడకు నేతెం
చినరాగముఁ బొందుటది యు ♦ చిత మనఁగాఁ గెం
పున మెఱసి పశ్చిమాశాం
గన జనసంభావనముల ♦ గౌరవమందెన్. 318

ఉ. చుక్కలు తోడుతోడఁ దల ♦ చూపఁ దొడంగె మనోభ
వుండు వి । ల్లెక్కిడి చక్రవాకముల ♦ యిక్కలు రోయఁ
గఁ జొచ్చెనేల కెం । పెక్కుచు వచ్చె దీవియల ♦ యేడ్తెర
సోయగమూదె సందడుల్ । దక్కెఁ బురంబువీధుల మ ♦
దం బొలసెన్ విటచిత్తవృత్తులన్. 319

వ. పదంపడి జారచోరుల మనంబు లలరం జాంద్రాస్తమయం
బగుటయు. 320

క. పెనుమిఱ్ఱిది పల్లం బిది
యనకుండఁగ నోలమును బ ♦ యలు నొక్కటిగాఁ
గనువిచ్చుటయును మోడ్చుట
యును సరిగాఁ దమము పర్వె ♦ నుర్విం దోడ్తోన్.

1. "సోలంగన్" అనఁగాచొక్కుట. సూర్యతాపశాంతిచేవృక్షాదులు
ఖింపఁగాననుట.

వ. అప్పుడాకృశోదరి వృకోదరు కడకుం జనిసమయంబయ్యె ననవుడు. 322

తే. అతఁడు పెండ్లికిఁ బిలిచిన ♦ యట్లు వికచ
హృదయుఁడై తలచీర యా ♦ యితముసేసి
ద్రుపదనందనఁ జూచి నా ♦ తోన వెనుక
నల్ల నంతంత నరుగుఁడె ♦ మ్మని కడంగి. 323

చ. గమనము వీఁక వేఁకొక వి ♦ కారముపుట్టక సంగరోత్సవో
ద్యమరభసాతిరేకము బ ♦ యల్పడు టించుక లేక రోషసం
భ్రమమొకయింత రైనఁ బర ♦ భావనిరూప్యము గాక
ద్రౌపదీ । రమణుఁడు వోయి విక్రమధు ♦ రంధరతం దగ
నాట్యశాలకున్. 324

వ. చని వివేకరహితుహృదయంబునుంబోలెఁ దమోదూషితంబును పిదగ్ధవనితా ప్రేమంబునుంబోలె దుర్నిరూపంబును ఘోరాటవీభాగంబునుంబోలె నిర్మనుష్యంబును గాపురుషలక్ష్మీవిలాసంబునుంబోలె ననుపయోగ్యంబును ననభ్యస్త శాస్త్రంబునుంబోలె దుర్గమంబును స్వప్నలబ్ధపదార్థంబునుంబోలె నదృష్టిగోచరంబును విషమకావ్యంబునుంబోలె నస్పష్టాలంకారంబును బాలిశరాజ్యంబునుంబోలె జారచోరహృద్యంబును నైన యానర్తనాగారంబు ముఖభాగస్థలంబు సేరి. 325

క. కెలఁకులుఁ బిఱిందిదెసయుం
గలయం బరికించి తనయ ♦ ఖండిత బాహా

బలగర్వము యచ్చట ముం
గలిగా మదమత్త భద్ర ♦ గజసదృశగతిన్. 326

శా. ధ్వాంతాకారిత కుడ్యకుట్టిమఘన ♦ స్తంభావలీరూపముం
బ్రాంతాది 1ప్రవిభాగబోధరహిత ♦ 2ప్రాగ్ద్వారముం గాతర
స్వాంతత్రాసకరంబునై దురభివే ♦ శంబైనయాలోను ని
శ్చింతుండైసతికేలువట్టికొని చొ ♦ చ్చెన్ భీముఁ డత్యుగ్రతన్.

వ. ఇట్లుసొచ్చి తత్తియుం జని మధ్యప్రదేశంబున విరాటనందన లీలాపర్యంకం బరసి కని దానికనతిదూరంబునం బాంచాలి నోసరిల నునిచి తానాతల్పంబున నుండె నంతం గీచకుండు.

క. కై సేసి మదవికారో
ల్లాసంబున మేను వొంగ ♦ లఘుగతి నుత్కం
ఠాసవపాన విధాన
వ్యాసంగతరంగితాంత ♦ రంగుం డగుచున్. 329

శా. సింగంబున్న గుహానికేతమునకుం ♦ శీఘ్రంబునన్ వచ్చు
మా । తంగంబుం బురుడించుచుం బవనపు ♦ త్రస్వీకృతాం
గైన యా । రంగాగారము సేర వచ్చి మదిలో ♦ రాగంబు
ఘూర్ణిల్ల నిం । తిం గాముం డిట తేఁడె యింత కనియు ♦
ద్వృత్తాంగజోన్మాదుఁ డై. 330

ఉ. స్వాంతము బాహుగర్వమున ♦ సంతమసాంధము గాఁగ శంకే
యొ । కింతయు లేక కీచకుఁ డ ♦ హంకృతి ముంగలి
గాఁగ మండపా । భ్యంతరభూమిఁ జొచ్చి తతి ♦ యుం జని

1. గ. జ. ప్రతిభాగ 2. క. ప్రాగ్భాగముం.

యారసి సెజ్జ గాంచి య । త్యంత ముదావహం బగుడు ♦
నందు రయంబునఁ గేలు ♦ సాఁచినన్. 331

చ. ఘనతరకోపవేగమునఁ ♦ గంపము నొందునిజాంగకంబులం
దనధృతి పెంపుసొంపు చలి ♦ తంబులఁ జేయ సమీరు
కూర్మినం । దనుఁడు దదీయచేష్టలును ♦ దద్వచనంబుల
చొప్పు నేర్పడం । గనుమతి నూరకుండె నవి ♦ కార
నిగూఢ నిజప్రకారుఁడై. 332

ఆ. కీచకాధముండు ♦ కిమ్మీరవైరిపైఁ
గేలుసాఁచి యాని ♦ శాలనయన
గాఁ దలంచి మేను ♦ గరుపాఱ నిట్లను
మదనఘూర్ణమాన ♦ హృదయుఁ డగుచు. 333

చ. వనిత మనోహరంబు లగు ♦ వస్త్రము లెల్లను వేడ్క నేఁటి నీ
కని నియమించి తెచ్చితిఁ బ్రి ♦ యంబునఁ గైకొను మెచ్చ
నంగనా । జనములు నన్నుఁ జూచి మరు ♦ సాయకముల్
దమచిత్తవృత్తు లే । చినఁ గొని వచ్చి యిత్తురు వి ♦ శిష్ట
ధనంబులు నాకు లంచముల్. 334

సీ. నాదురూపంబు మ ♦ నంబునఁ జిక్కిన
తరుణి దక్కొఱు నేల ♦ సరకు సేయు
నాదులావణ్యంబు ♦ నకు నిచ్చు మెచ్చిన
యొలనాఁగ పైఁబడఁ ♦ గేల నిలుచు
నావిలాసంబులు ♦ భావింపఁ బడసిన
యింతి పుష్పాస్త్రుచే ♦ నెట్లు బ్రదుకు

నావివేకమున కా ♦ నందింపఁ గనినయం
గన యెట్లు [1]నిలువునఁ ♦ గ్రాఁగ కుండు
తే. మెఱయ [2]నాయాఁడుమాటలు ♦ తెఱవపించు
నుల్లములకు నింపారెడు ♦ నురులుగావె
యిట్లు నీ వొక్కతవె నన్ను ♦ [3]నేలుకొంటి
గాక మాటలిం కేటికిఁ ♦ గపులవదన. 335
క. అనవుడు మనమున నిస్సీ
యని యుచితనిగూఢభంగు ♦ లగుభాషణముల్
దనప్రియ వినిపించుట కి
ట్లనియెఁ మృదురీతి భీముఁ ♦ డాతనితోడన్. 336
తే. ఇట్టివాఁడవు గావున ♦ నీవు నన్నుఁ
బొగడికొనఁ దగు నకట నా ♦ పోల్కి యాఁడు
దాని వెదకియు నెయ్యెడ ♦ నైన నీకుఁ
బడయ వచ్చునె యెఱుఁగక ♦ పలికి తిట్లు. 337
క. నాయెడలు సేర్చినప్పుడ
నీయెడ లెట్లగునొ దాని ♦ నీ వెఱుఁగుదు త
న్నేయబలతోడిదిగాఁ
జేయఁ దలంచితివి తప్పు ♦ సేసితి గంటే. 338
క. నను ముట్టి నీవు వెండియు
వనితలసంగతికిఁ బోవు ♦ వాఁడవెవ్వైనం
దను వేఁ బడసినఫలమే
కనియెద విదె చిత్తభవ వి ♦ కారము లెల్లన్. 339

1. విరహాగ్నిఁ 2. నాతోడిమాటలు. 3. జ. నేలుకొంటి

మ. అనుచుం గ్రక్కున లేచి రోషకలితం♦బౌ హాసమాసూతు
నె । మ్మనముద్వేగముఁ బొందఁ జేయఁ బలసా 1మగ్రీ
సముజ్జృంభణం । బున వానిం దల వట్టి వంచుటయు నే♦
పుం జేవయుం దోఁప వాఁ । డనుమానింపక పెట్టదల్చికొని
కో ♦ పాటోప 2దీప్తాంగుఁడై. 340

—♦ భీమసేనుఁడు కీచకుని సంహరించుట. ♦—

వ. గంధర్వుం డనుతలంపున. 341

చ. పవనతనూజు బాహువులు ♦ పాణియుగంబునఁ బట్టి వీఁకమై
నవనిపయిం బడం దిగిచి ♦ యంగము 3జానులు 4నూఁదినం
గడుఁ । జనమున దండ తాడితభు ♦ జంగముభంగి సముత్థి
తాంగుఁడై । యవయువముల్ ప్రకోపరభ ♦ సాతిశయం
బునఁ బొంగ నుద్ధతిన్. 342

మ. మగుడం గీచకుఁ బట్టి వాఁడును బలో ♦ న్మాదంబునన్
బాహులగ ♦ ర్వగరిష్ఠుం డగు నాహిడింబరిపుఁ డీ ♦ ప్రక్రో
ధుఁడై పట్టి పెట్టుగఁ ద్రోపాడఁగ నిద్దఱున్ భుజబలా♦
టోపంబునై నొండొరున్ । మిగులంజాలక కొంతసేపు
వడి మే ♦ మేఁ బోరి రుద్రాకృతిన్. 343

వ. అట్టియెడ. 344

క. తన యగపాటొరు లెఱుఁగుదు
రనిసూతుఁడు సమయభంగ ♦ మగుటకు భీముం

---

1. ఘ. మగ్రిన్ సముజ్జృంభ. 2. చ దీప్తాత్ముఁడై. 3. ఖ. సంధుల
4. జ. నూనినం.

దును గొంకుచుఁ జప్పుడు సే
యని గూఢవిమర్దనప్ర ♦ హారములఁ దగన్. 345

వ. మల్లయుద్ధనైపుణ్యంబు మెఱయం గడంగి. 346

సీ. తిగిచిన నడుగులు ♦ దెరలక యొండొరుఁ
గ్రమ్మఱఁ దిగుచుచుఁ ♦ గడిమి మెఱయఁ
బొడిచిన వెస బీఱు ♦ వోవక యొండొరు
నందంద పొడుచుచు ♦ నవనిఁ బెట్టి
యెత్తిన బెగ్గలం ♦ బొందక యొండొరు
బలువిడి నొత్తుచు నలవు మిగిలి
యడఁగంగఁ బొదివిన ♦ నడిచి పాటించుక
యును లేక వీఁక నొం ♦ డొరుల నదరి

తే. యడఁగఁ బొదువుచు నలుక యం ♦ తంత కగ్గ
లించి యాయముల్ నొంచి దో ♦ ర్లీల నెఱపి
యుల్లసిల్లిన స్రుక్క- కొం ♦ డొరుల రౌద్ర
వృత్తి నొంచు చొందురులకు ♦ [1]చెక్కసముగ. 347

క. కదియుచుఁ బాయుచుఁ బట్టుచు
[2]నుదలుచుచుం బడుచు లేచు ♦ చుడుగుచు [3]వడిగొం
చొదవెడు కినుకం గడు బె
ట్టిదముగఁ బెనఁగిరి చలంబు ♦ డింపక కడిమిన్. 348

1. క. వెగ్గలముగ. 2. జ. ఇది 'ఉదలుచు' ధాతువు 'ఉదల్చు' అని శాంతిపర్వము. 'ఉదల్చు' అని భీమేశ్వరపురాణము.
3. వడిఁగొం, పొదవెదు.

ఆ. ఇవ్విధమున నేచి ♦ యిరువురుఁ బెద్దయుఁ
బ్రొద్దు పోర ♦ వాయుపుత్రుబలము
దోడుతోడఁ బెరుఁగఁ ♦ దొడఁగె నాకీచకా
ధముఁ డలసి పిదపఁ ♦ దలఁకఁ జొచ్చె. 349

ఉ. దాని నెఱింగి యెంతయు నుదగ్రత నాబకవైరి గ్రక్కునన్
వాని నడుంగఁ బట్టి పడఁద్రోచి మహోగ్రత నాక్రమించెఁ బం
చాసన మేణముం బొదువుకొన ట్లతఁ డూర్జితశక్తి నుద్భటుం
డై నగనేక సమీరసుతు♦నల్కకుఁ బ్రాఁకిడిన ట్లువీఁకతోన్.

క. నగియు నెడ నగ్గమైనను
1బిగి యూరుచుఁ బెలుఁకుసనినఁ ♦ బిడికిట గోఱసం
దిగను బెడిదముగఁ బొడిచెం
బగతుఁడు గను మిడిసి నేలఁ ♦ బడి తన్నుకొనన్. 351

ఆ. పల్లవప్రసూన ♦ ఫలభరితం బగు
ద్రుమము గూలఁ దోఁచు ♦ మత్తగజము
పోల్కి వివిధరత్న ♦ భూషణాభూషితుం
డైన సూతుఁ గూల్చె ♦ ననిలసుతుఁడు. 352

చ. వివృతపుఁజాన్ను సంపద మది ♦ వేడుక నుబ్బినఁ గిట్టి పట్టి మ
స్తకమును బీనదీర్ఘభుజ ♦ శాఖలఁ బాదయుగంబు మేనిలో
నికిఁ జొర నుగ్గుగాఁ బొలిసి ♦ నించినగంతలతిత్తి యైన కీ
చకు ఘనదేహముం బడిపి ♦ చక్కనిముద్దగఁ జేసెఁ దుష్టునై.

1. చ. జ. బిగియూడుచు.

క. తనకడిమికలిమి నచ్చియు
మనమునఁ దలఁకడర సూతు ♦ మరణంబు గనుం
గొనుటకుఁ దల్లడపడు ప్రియ
వనిత కతనిచావు సెప్పి ♦ వడిఁ దన్మాత్రన్. 354

చ. అనలము గూఢయత్నమున ♦ నయ్యెడకుం గొని నచ్చి దానిఁ
జ। య్యన వెలుఁగొందఁ జేయుటయు ♦ నచ్చెరువున్ భయ
మున్ బ్రియంబునుం। బెనఁగొనఁగాఁ గనుంగొనియె ♦ భీత
మృగేక్షణ భీము డాయఁగాఁ। జని కడునక్కజం బయిన ♦
చందమునం బడి యున్న పీనుఁగున్. 355

ఉ. చూచుచుఁ జేరి ప్రేల్మిడుచు ♦ చుం దల యూఁచి 1విలక్ష
చిత్తయై। యాచపలాక్షి ముక్కుపయి ♦ నంగుళముం
గదియించి దీనికై। కీచక యింత సేసితి సు ♦ ఖిత్వముఁ
బొందుదుగాక యింక న। ట్లేచిన నిట్లు గాకుడుగు ♦ నే
యనుచుఁ వెఱఁగందుచుండఁగన్. 356

క. పూనిక నెఱపితి సతి యవ
మానముఁ బరితాపభరము ♦ 2మాన్పితి నిపు డి
ట్లే నని మదిఁ బొంగెడు పవ
మానసుతుం డిట్టు లనియె ♦ మానినితోడన్. 357

శా. చింతాశల్యము వాసెనే భుజబలో ♦ త్సేకంబు నీకెక్కెనే
శాంతిం బొందెనె రోషపావకుఁడు దు ♦ శ్చారిత్రునిం జూచితే

1. క. విషణ్ణచిత్తయై. 2. గ. మాన్పించితి నిట్లే.

సంతోషించితే యిట్లు గాక బ్రతుక ♦ శక్యంబె దుర్వృ
త్తి నీచెంతం జేరినయట్టివీరులకు నా ♦ చేతం బయోజాననా.

క. అనిన విని సింహబలము
గ్గను నవలోకించి ద్రుపద ♦ రాజతనయ యి
ట్లనుఁ దనమనమున నిండా
రిన సమ్మోదంబు వెలి వి ♦ రిసి పెరయంగన్. 359

సీ. కొలువులోపల నిన్న ♦ కోప మగ్లైత్తినఁ
దలఁకక నిలిచిన ♦ ధైర్యమహిమ
నేఁ డింపుఁ జనుదెంచి ♦ నిర్వికారతఁ బ్రజ
కన్నులు ¹గప్పిన ♦ గౌరవంబు
మనవారిలోన నొ ♦ కనినైనఁ బిల్వకు
త్సాహంబు సేసిన ♦ సాహసంబు
లోకదుర్జయుఁ డగు ♦ సీకీచకునిని వే
ల్మిడి రూపు మాపిన ♦ కడిమిసొంపు

తే. సూడఁ దలఁపోయ మెచ్చ సం ♦ స్తుతి యొనర్ప
నాదలంబె నీయుత్తమ ♦ నాయకత్వ
మెఱిఁగి నినుఁ గొనియాడ నే ♦ నెంతదాన
మహిత విస్మయానంద ని ♦ ర్మగ్న నైతి. 360

క. అనుపలుకులు కర్ణరసా
యనము లగుడు నయ్యుధిష్ఠి ♦ రానుజుఁడు ముదం
బునఁ బేలి యింకఁ దడయం
జనదని ద్రౌపదికిఁ జెప్పి ♦ చయ్యన నేఁగెన్. 361

1. చ. గట్టిన.

క. అనిన విని కీచకుఁడు స
చ్చిన పిమ్మటఁ బుట్టినవి ♦ శేషము లెల్లన్
వినువేడుక మన మలరెడు
ననఘా యేర్పడఁగఁ జెప్పు ♦ మనుటయుఁ బ్రీతిన్. 362

చ. పరమకృపావిధేయ నిరు♦పాధికచిన్మయకాయ [1]గాఢవి
స్తరనిగమైకవేద్య గుణ ♦ తత్త్వవికారనియత్యభేద్య సం
స్మరణనిరస్తతాప ఘన ♦ సంసృతిసంతమసప్రదీప ని
ష్ఠురభుజసారదానవని ♦ షూదన భక్తిజనప్రమోదనా.

క. చతురానందమయా దు
ర్గతిరోగోద్గమచికిత్స ♦ కా భువనభవ
స్థితిసంహారకరా ని
ర్వ్యతిపణ్యాపణపదార ♦ విందవికాసా. 364

మాలిని. [2]సురపరివృఢ చూడా ♦ శోభిరత్నాంశు వీచి
స్ఫురణ సుభగపాదా ♦ భోజసంచారకేళీ
పరిచయకలనాల ♦ బ్ధవ్యయాతీతసౌఖ్యో
త్కర మునిజనహృన్నా ♦ ధ్యన్మరాళప్రతానా. 365

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతంబయిన శ్రీ మహాభారతంబున విరాటపర్వంబు నందు ద్వితీయాశ్వాసము. 366

---

1. క. గూఢదుస్తర. 2. చ. సురపతిదృఢ.

శ్రీ హయగ్రీవాయ నమః

# శ్రీమదాంధ్ర మహాభారతము

# టిప్పణి

## విరాటపర్వము-ప్రథమాశ్వాసము.

పాండవు లజ్ఞాతవాసమునకై విరాటుని నగరమందు నివసించుటం జేసి యీ పర్వమునకు విరాటపర్వమని పేరు వచ్చెను.

(1) 'శ్రీయన గారివాఁ బరఁగు చెల్వకు' ఇట గ్రంథాదియందు శ్రీకార ప్రయోగంబు మంగళార్థంబు.

'దేవతా వాచకాశ్శబ్దాయేచ భద్రాది వాచకాః
తే సర్వే నైవనింద్యా స్స్యుర్లిపితో గణతోపిచ'

మఱియు

క॥ శుభ దేవతా త్రయంబును
శుభఫలచరిత్రయును గలిగి శుభవాచకమై
యభినుతి గాంచినకతమున
శుభములు శ్రీకారమునను జొప్పడు టరుదే? (అప్పకవి)

శ్రీకారమునందు శవర్ణము రేఫము ఈకారమును గలవు. ఇందు శవర్ణమునకు ఈకారమునకును అధిదేవత లక్ష్మి. రేఫమునకు అగ్నిదేవుఁ డధిదేవత. అగ్నియు 'శ్రియమిచ్ఛేద్ధుతాశనాత్' అను పురాణవచనముచే లక్ష్మీప్రదుఁ డగుటచేత శ్రీకారఘటితవర్ణంబు లన్నియు లక్ష్మీప్రదంబులు. మఱియు శవర్ణమునకు గ్రహము గురుఁడు, రేఫమునకు ఈకారమునకును గ్రహము శుక్రుఁడు. కనుక మూఁడువర్ణములకును శుభగ్రహంబులే కావున శ్రీకారమునే కవులు తొలుదొల్త ప్రయోగింతురు. శ్రీ అనఁ బరఁగు చెల్వకును గారి నాఁ బరఁగు చెల్వకును అని విభజించుకొనవలయును. లక్ష్మీపార్వతులకని భావము.

భద్రాయితమూర్తి భద్రవత్ ఆచరితా మూర్తిః యస్యతత్ — భద్రాయితమూర్తి — మంగళకరమగు శరీరము గలది. భద్రాయిత అనునది

'కర్తుః క్యఙ్ సలోపశ్చ' అను సూత్రముచే క్యఙ్ 'అకృత్సార్వధాతుకయోర్దీర్ఘః' అను సూత్రముచే దీర్ఘము రాఁగా నిష్పన్నమాయెనని యెఱుంగునది.

హరిహరంబు అగు రూపము = హర్యాత్మకమును హరాత్మకమును అగు ఆకారమును అనఁగా లక్ష్మీదేవిచిత్తము పల్లవించుటకు హర్యాత్మకరూపమును (విష్ణురూపమును) పార్వ దేవి చిత్తము పల్లవించుటకు హరాత్మకరూపమును (శివరూపమును) దాల్చెనని క్రమమనుసంధించుకొనవలయు

విష్ణురూపాయ నమః శివాయ
విష్ణురూపాయ=విష్ణుస్వరూపుఁడగు
శివాయ=శివునికొఱకు
నమః=నమస్కారము
శివకేశవులకు భేదము లేదని యద్వైతసిద్ధాంతము

(3) సంయమి పరికర సంభావ్య అనుభావుండు = మునిసమూహముచే గౌరవింపఁబడఁదగిన మహిమగలవాఁడు, కృష్ణద్వైపాయనుఁడు = వేదవ్యాసుఁడు ద్వీపమేవ అయనం యస్య సః-ద్వీపాయనః. ద్వీపాయనుఁడు (యమునాద్వీపమే స్థానముగాఁ గలవాఁడు యమునాద్వీపములోఁ బుట్టినవాఁడనుట) ద్వీపాయనుఁడే ద్వైపాయనుఁడు ద్వైపాయనుఁడు + కృష్ణుఁడు కృష్ణద్వైపాయనుఁడు మయూరవ్యంసకమునకువలె విశేషణమునకుఁ బరనిపాతము వచ్చినది కృష్ణుఁడని వేదవ్యాసునకుఁ బేరు

'భారతాఖ్యము అగు లేఖ్యంబు ఐన ఆమ్నాయము' 'భారతం పంచమో వేదః' అను సూక్తి యిట అనుసంధేయము ఆ వేదమపౌరుషేయము భారతమను వేదము పౌరుషేయము ఇంతియే భేదము- ఆమ్నాయము=వేదము (వ్యుత్పత్తి) ధర్మాధర్మముల నుపదేశించునది

(4) మూచల-నిర్ణాయకము (నిశ్చయించునది) మూల + తల మూదల

(5) తొడంగి=ప్రారంభించి, కృతులు=గ్రంథములు (పర్వములు) విద్యాదయితుండు - ఇది తత్పురుషముగాఁ జేసికొన్నచో విద్యలకుఁ బ్రియుఁడు అని యర్థము వచ్చును నన్నయభట్టు సకలవిద్యారమణులచే

వరింపఁబడినవాఁ డనుట బహువ్రీహి గావించుకొన్నచో విద్యలే ప్రియురాండ్రుగాఁ గలవాఁడు అను నర్థము వచ్చును సర్వవిద్యలు ప్రియురాండ్రవలె నమ్మహామహునకు వశ్యములని భావము ఉభయ కవి మిత్రునంతవానిచే 'ఆంధ్రకవిత్వవిశారదుండు విఖ్యాతయుతుండు మహితాత్ముఁ'డని పొగడ్తఁగాంచిన నన్నయభట్టు సర్వవిద్యాపారీణుఁ డనుటలో సందియ మెుండదుగదా! నన్నయభట్టు 'ఆదిఁ దొడంగి మూఁడు కృతులు' రచించె నని తిక్కనార్యుఁడు చెప్పియుంటచే నన్నయకవి అరణ్యపర్వముగూడఁ బూర్తిగా రచించియుండెననియు నందే కారణము చేతనో కొంత యుత్సన్నము కాఁగాఁ బ్రబంధపరమేశ్వరుఁడగు నెఱ్ఱాప్రగడ తన్నామకముగనే పూరించె ననియు స్ఫురింపక మానదు

(7) తిక్కనార్యుఁడు విరాటపర్వమును హృదయాహ్లాది యూర్జితకథోపేతంబు నానారసాభ్యుదయోల్లాసి అని విశేషించుటంజేసి యీ పర్వ మెంతయుఁ గథాచమత్కృతమై నవరసాలయంబై పాఠకుల హృదయ మాకర్షించునని తెలియవచ్చెడిని

(11) 'కిమస్థిమాలామ్' అను శ్లోకము శ్రీతిక్కనార్యునిచే నద్వైత భావనతోఁ జెప్పఁబడినది దాని యర్థము (హే) ప్రభో! = ఓ హరిహర నాథా! త్వమ్ = నీవు పరిష్క్రియాయామ్ = అలంకారము విషయమై అస్థిమాలామ్ = ఎముకల పేరును బహుమన్యసే కిమ్ = గౌరవించుచున్నావా? వా = కానిచో కౌస్తుభమ్ = కౌస్తుభమణిని బహుమన్యసే కిమ్ = గౌరవించుచున్నావా? తవ = నీకు కాలకూటః = విషము స్వాదు కిమ్ = రుచ్యమా? వా = కానిచో యశోదాస్తన్యమ్ - యశోద పాలు స్వాదు కిము - రుచ్యమా? బ్రూహి - నాకు వద - చెప్పుము

(12) ఈసీసపాదములయందు బేసిసంఖ్యయందు హరుని లక్షణములును సమసంఖ్యయందు హరిలక్షణములు నభిహితంబు లయ్యె జాలువాఱక్ - ప్రవహింపఁగా హరినీలపాత్రికక్ - ఇంద్రనీలపాత్రయందు ధవళ పంకజము - తెల్లఁదామర

(14) అనుకంపా అతిశయంబునక్ - దయావిశేషంబుచే, సుధారోచి - చంద్రుఁడు సూర్యచంద్రులు భగవంతునికి నేత్రంబు లనుట

(30) (సాదర తుచ్ఛచిత్తంబునకా' ఇటఁ దుచ్ఛశబ్దంబున కత్యల్పమని యర్థము చిత్తము పరమాణురూపమని నైయాయికులు వచింతురు ,తచ్చ ప్రత్యాత్మనియతత్వాదనంతం పరమాణురూపం నిత్యంచ' (సర్వ-సంగ్రహము) అతి విస్తారమగు నీదయ యను పాలమున్నిటిని అత్యల్పమగు నా చిత్తంబున విశాలంబుగ నుంచుట యాశ్చర్యమని భావము

(32) ఓంకారవాచ్యునకున్—ఓంకారముచేఁ బ్రతిపాద్యుఁడైనవానికి నిరహంకారనిరూఢ భావనా ఆరాధ్యునకున్ — అహంకారము లేనిదియు, నిశ్చలమును అగు చిత్తవృత్తిచే ఆరాధింపఁదగినవానికి హ్రీంకారమయ — హ్రీంకారబీజస్వరూపమగు మనోజ్ఞ—రమ్యమగు అలంకార—ఆభరణము యొక్క ఉల్లాస—ప్రకాశముచే నిత్య—శాశ్వతమగు లాలిత్యునకున్— అందముగలవానికి

(33) త్రిభువన శుక దృఢపంజర విభవ మహితునకున్ — త్రిభువనమనెడు చిలుకకు గట్టి పంజరముయొక్క వైభవముతోఁ బూజ్యుఁడైనవానికి - చిలుకలకుఁ దప్పించుకొనిపోవుటకు వీలులేని పంజరమువలె ముల్లోకములవారికి నాశ్రయమైనవాఁడని భావము - కుక్షిస్థాఖిలభువనుఁ డనుట— లేదా త్రిభువనమనెడు గట్టి చిలుకపంజరమునందు వైభవముతో నధికుఁడైనవానికని యేనిఁ జెప్పికొనవచ్చును - త్రిలోకములందు నంతర్యామిగా నున్నవాఁ డనుట 'అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః' సమస్త విష్టప నిర్మోక భుజంగపతికిన్—సమస్తలోకములే కుబుసములుగాఁ గల శేషునకు - అనఁగా శేషుఁడు కుబుసములచే నావృతుండయ్యు దానిని విడిచిపెట్టుటకును సమర్థుఁడగువల్లె హరిహరనాథుఁడును జగత్తుచే నావృతుండయు నవసరమైని దానిని విడనాడుటకును శక్తిగల వాఁడని భావము

(36) మరుత్ సరిత్—వేల్పుటేటిచే(ఆకాశగంగచే) ఆకల్పిత—అలంకరింపఁజేయఁబడినది గనుకనే మనోజ్ఞ—రమ్యమైన చరణ—పాదముచేతను శిరః—శిరస్సుచేతను సుందర = అందముగల మూర్తికిన్ == శరీరముగలవానికి ఇందు హరి మరుత్సరిదాకల్పితమనోజ్ఞచరణసుందరమూర్తియనియు హరుఁడు మరుత్సరిదాకల్పితమనోజ్ఞశిరస్సుందరమూర్తియనియుఁ గ్రహింపఁదగినది. గంగ విష్ణుపాదమునఁ బొడమిన దనియు (విష్ణుపాదోద్భవా గంగా) ఈశ్వరుఁడు గంగాధరుఁడనియుఁ దెలియవలెను.

39 అజగవ, శార్ఙ్గ, అలంకృత, భుజ, గర్వ, నిరస్త, దైత్య! పినాకము శార్ఙ్గము, అనుధనస్సులచే అలంకరింపఁబడిన భుజములచే గర్వమునుండి మరలింపఁబడిన రక్కసులుగలవాఁడా! భుజమునందజగవశార్ఙ్గముల ధరించి రక్కసులగర్వమడంచినవాఁడా! యని సంబుద్ధి. ఇందు 'భుజగసమాచరిత శయనభూషణకృత్యా|' అనుస్థలమునందువలెఁ గ్రమముపాటింపఁబడలేదు. హరిహరనాథ పదములో మొదట 'హరి' పదమును దరువాతహర పదమును గలవుగనుకఁ గ్రమముపాటింపఁబడినచో అజగవాలంకృతభుజుఁడు హరియు, శార్ఙ్గాలంకృతభుజుఁడు హరుఁడునుగా వలసివచ్చును. అదివిరుద్ధము. 'కపర్దోఽస్యజటాజూటః పినాకోఽజగవంధనుః' అనుకోశముచే అజగవము హరధనుస్సుకాని హరిధనుస్సుకాదు. 'చాపశ్శార్ఙ్గంమురారేస్తు'అనుకోశమువలన శార్ఙ్గము హరిధనుస్సుకాని హరధనుస్సుకాదు. సర్వజ్ఞకల్పులగు తిక్కనార్యులిట్లు క్రమమును బాటింపకుండుట తాను చెప్పికొనినట్లు 'భేదములేని భక్తి'ని (హరిహరులకభేదమును) స్పష్టీకరించుటకేమోయని తోఁచెడిని. ఇట్లే 'శరద్వరాబర్హిబర్హచారువిభూషా' అనుచోటను గ్రహించునది.

40 జలనిధి=(పాల) మున్నీటిచేతను, హిమవత్, భూధర=మంచుకొండచేతను, కలిత=ఏర్పఱుపఁబడిన, జనన=పుట్టుకయనెడు, కేళి=ఆటయొక్క, కౌతుక=సంతసముకలవారు, (పాలసంద్రమునందునుమంచుకొండయందును బుట్టినవారనుట) వ్యక్త=స్పష్టమైనదియు, అవ్యక్త = కొంచెము స్పష్టమైనదియు, (ఇచటనఞ్ పదమీషదర్థకము) లక్ష్మీవిష్ణునురంబున నుండుటనుగాన నామె సౌందర్యము స్పష్టముగాఁ గానవచ్చుననియుఁ బార్వతి యీశ్వరుని సామేననుండుటచే నామె సౌందర్యము కొంతభాగమే స్పష్టముగాఁ గానిపించుననియు భావము. లలిత=సుకుమారమైనదియు(అగు) సౌందర్య=చక్కఁదనముచే, స్ఫురత్=ప్రకాశించుచున్న, అలఘు=గొప్ప (మహిమగల) తను=శరీరములుగల, స్త్రీ=స్త్రీలతో (రమాపార్వతులతో)సనాథ=కూడినవాఁడా!

46 సఁయోధనుచేసిన కుటిలవిచేష్టితంబు—ఇటధాతుజ విశేషణపూర్వావ్యవహితకర్తృపద ప్రథమకు యొక్క షష్ఠియని యెఱుంగునది.

సర స్తవిష్ణులరు— 'ప్రథమాంతంబులగు యుష్మదస్మద్విశేషణంబులకే కర్త్వంబున 'వు, ను, లును, బహుత్వంబున 'రు, ము' లునగు తాగమంబులు ప్రాయికంబుగనగు. (బాల. కార.) 'ఈయాగమంబులు పరంబులగునపు డుత్వంబున కత్వంబగు. (బాల. కార.)

48 విడుమరల్ = విడుదలను,

చుట్టలల్—రూ—చుట్టములల్—

'బహువచనంబుపరంబగునపు డావు ప్రభృతుల తుదియక్షరంబునకు లోపంబు విభాషనగు - అనుసూత్రముచే నిట ముద్దకంబు వికల్పముగా లోపించెనని యెఱుంగునది.

55 భవత్, ఆజ్ఞా, దృఢ, బంధ, సంసమిత, శుంభత్, వేగము= మీయానతియను గట్టిగొలుసుచే అణంచబడినయొప్పిదమగు వేగముకలది.

క్రోధ=కినుకయొక్క, ఆవేశ=పూనికవలని, దుర్దాంత = అణంచ శక్యముకాని, దర్ప=గర్వముయొక్క, విలాస=ప్రకాశముయొక్క, ఉద్భట=అధికమగు, భంగిల్=విధముచే, ఏపు=ఆధిక్యము, అర్జునద్విపము— కౌరవ్యాంబుజశ్రేణి—ఈరెండు భావులనురూపకము.

విశృంఖలమగు మదేభము తామరకొలనుసొచ్చి పద్మంబులంజిందర వందఱచేయునట్లు మనయర్జునుండు నీ నిర్బంధములేని-చో౯ గౌరవుల నాఁడే తునుమాడియుండెడువాఁడని భావము.

56 కావుతల్+అని—కావుతమని—సూ—ఏడు, తల దుతంబునకచ్చు పరంబగునపుడు మకారంబగు.

(బాల. క్రియా.)

57 నాఁటిరేయి, క్రోశమాత్రమ్ము.ఇట సూ-కాలాధ్వములకు౦ ప్రాయి కంబుగాఁ బ్రథమయగు. అనుసూత్రముచేఁ బ్రథమ.

58 'ఈయంగనయొందోనరుగుదేర' ఇట 'తోల్',

అనుదానికిఁ బ్రత్యేకప్రయోగమారయునది.

66 చాగంబు= దానము— (త్యాగశబ్దభవము)

68 ఇటఁబ్రాసములోని విశేషంబుగమనించునది. 'సన్న్యాసివేషమున౯' ఇచట 'సన్న్యాసిల్' శబ్దములో నకారద్విత్వముగలదు, ఎట్లన. సమ్+

న్యాసిన్' అనియుండఁగా సూ- మోఽనుస్వారః అని 'సమ్' లోని 'మ్' కారము సున్న యగును. ఆసున్నకు సూ-అనుస్వారస్యయయి పరసవర్ణః' అను సూత్రముచే 'పరసవర్ణ'మగు 'న'కారము వచ్చును. కావున 'సన్యాసి' అను ఏకనకారరూప మసాధువు. ఈ పద్యమునందుఁ దొల్తిసన్న్యాసిపదము ప్రాసస్థానంబునఁ బ్రయుక్తమగుటం జేసి 'ప్రాసస్సర్వేషు చైక ఏవ స్యాత్' అను నియమంబునఁ దక్కిన ప్రాసస్థానంబులందును నకారద్విత్వసహితరూపంబులే యుండవలయును. గాన 'రాజన్య' మాన్య, విన్యాస, పదంబుల ఒకనకారముండుటయే న్యాయ్యమైనను 'అచచిచ' (అచ్చుకంటెం బరంబయిన 'యర్'నకు ద్విత్వము వికల్పముగా వచ్చును. అచ్చుపరమగుచో రాదు.) అనుసూత్రముచే నకారమునకు వైకల్పికద్విత్వము గావించుకొని ప్రాసదోషము వారించుకొనవలయును.

69 శ్రౌత, స్మార్త, నిమిత్త జ్యోతిర్, విద్యలు-ఇట 'విద్యలు' అను పదమును బ్రత్యేకముగా నన్వయించుకొనవలెను. 'ద్వంద్వాంతే శ్రూయమాణాం పదం ప్రత్యేకం సంబధ్యతే' అని శాస్త్రనియమము. ద్వంద్వసమాసము చివరవినఁబడు పదము ద్వంద్వఘటితశబ్దములతో నొక్కొకదానితో సంబంధించునని పై నియమముయొక్క భావము. కావున శ్రౌతవిద్య, స్మార్తవిద్య, నిమిత్తవిద్య, జ్యోతిర్విద్యయని గ్రహింపవగును. నిమిత్తవిద్యయనగా శకునశాస్త్రము.

ధర్మరాజుఁడు సన్న్యాసివేషంబునే వహించుటకుఁ గారణమేమన – ఇదివఱకు సామంతరాజు లాదటిచే నమస్కృతులఁబడయుచు గౌరవమందిన తాను విరటునికి నమస్కరించుచు నందుఁ గాలముగడుపుటలో నేమఱుపాటువచ్చునేమోయని యతనిచేతను నమస్కరింపించుకొనఁదగిన సర్వజనపూజ్యమగు యతివేషమూనెను. అందును గితవుండగు శకునితన్ను వెండియుఁ గపటద్యూతంబున జయింపకుండుటకై బృహదశ్వపరిగృహీతమగు నక్షహృదయాభ్యాసమునకు విరటునితో జూదమాడుచుండెను.

71 కలధౌతమయములుగా = వెండితోఁజేయఁబడినవనుట. అక్షసాళులు=పాచికలుఅక్షము+సారెలు—

73 'ధర్మపుత్రునితోడి మైత్రిం డగిలి యతనిపాలపసింతుగా' ధర్మశబ్దమునకు యముఁడనియు నర్థముకలదుగాన (ధర్మః) చాపన్యాయాద్వారా

హింసాయజ్వాచారయమేషునా' నానార్థరత్నమాల. యమునిదగు (సూర్య) పుత్రునితోడి చెలిమిగలిగి యతనివశమునందు నుందునని గూఢాభిప్రాయము.

75 గరగర+కాన్=శుచిగా,

76 విన్ననువు=నేర్పు, బానసీనిన్=వంటవానిని, కాతియపెట్టి = కష్టపెట్టి, ఒడికంబు+కన్=అందముగా

భీముఁడు వంటలవాఁడే యేలకావలసివచ్చెనన,
'పరపాకోగృహస్థస్య క్షత్రియస్యవిశేషతః
నయోగ్యఇతిసూదస్యబభ్రే వేషంవృకోదరః'

పరపాకము గృహస్థునకేకూడదన గృహస్థుఁడగుటయేగాక క్షత్రియుఁడుఁగూడ నగు తనకదికూడదని యెంచి భీమసేనుఁడు పాచకుఁడయ్యెనని యెఱుంగునది. అర్జునుఁ డూర్వశీశాపంబుకతనఁ బేడిరూపుదాల్పవలసెను. నకులుఁడు సూతవేషమూని యశ్వపాలకుఁడగుటకు హేతువేమన — తాను మహాక్షత్రియులగు ధర్మజభీమార్జునుల కనంతరజాతుఁడనని గూఢముగాఁదెల్ల డించుటకుఁ గాను క్షత్రియజాతి యగు సూతజాతివాఁడాయెనని యెఱుంగ వలెను. సూతజాతిక్షత్రియజాతికంటెఁ గొంచెము తక్కువదియనుటకు,

బ్రాహ్మణ్యాంక్షత్రియాత్సూతః ప్రాతిలోమ్యేనజాయతే
క్షత్రియాణామసౌధర్మంకర్తుమర్హత్యశేషతః
కించిచ్ఛక్షత్రిజాతిభ్యోన్యూనతా తస్యజాయతే,

సహదేవుఁడు ప్రస్తుతము సూతవేషుఁడుగానున్న నకులునితమ్ముఁడనని సూచించుటకుఁగా వైశ్యజాతివాఁడాయెను. వైశ్యజాతిధర్మములలోఁగూడ నుత్తమధర్మమగు గోపాలకత్వమునె చేకొనెను.

ద్రౌపదిభీమానువర్తనకై శూద్రజాత్యుచితమగు సైరంధ్రీవేషమూనెను. ఇట్లు ధర్మజాదులవేషధారణౌచిత్యమెక్కింత తెలియునది.

77 పటియవాయన్+కన్=చిల్వఁగా,

80 హాంతకారి=జెట్టివాఁడు, అగ్గలికన్=పూనికతో, లాఁగుపేగం బు=లంఘనమునందలివడి,

83 బానసంబు=వంట, ఘూర్ణమాన, మానసుండు=కదలుచున్న మనస్సుగలవాఁడు,

84 ఏర్చు = కాల్చు,

86 నాకి + ఈశుండు = ఇంద్రుడు (దేవతలకు ప్రభువు)

88 లాసికతనమునన్ = ఆటకత్తెనడతతో,

90 ఉమ్మలికమ్ము = దుఃఖము

91 దెప్పరము = దుస్సహము (రూ) దెప్పరము

94 గోడిగజాతిలోన్ = ఆడుగుఱ్ఱముల తెగలో, కోదమచెట్టులన్ = జవ్వనము తలచూపిన యాడువానిని, మావులన్ = గుఱ్ఱములతో, సంచులు = జాడలు, క్రొత్తముట్టునకున్ = క్రొత్తపనిముట్టునకు, పెనగుకూకలములన్ = కలసెడు అశిక్షితములగు దుష్టాశ్వములను,

లాయమునన్ = గుఱ్ఱపుచావడియందు, మందడీలకున్ గుఱ్ఱపువాండ్రకు (రౌతులకు)

96 మీకడవాడన్ = మీచెంతనుండువాడను, మీచివరవాడనని గూఢము. చివరవాడు సహదేవుడుగదా యన్నచో నకులసహదేవులు కవలవారుగాన నిరువురకు భేదమని భావము.

99 కీలాలితనమునకున్ = గొల్లవానిధర్మమునకు, (వృత్తికి)

100 వంజలన్ = గొడ్డుటావులను, బడుగులన్ = చిక్కినవానిని, (ఆవులననుట) లేవులు గోటులన్ = రోగములుగల చెడ్డయావులను, నట్టలన్ = ప్రయాసముచే బిడుకదగిన యావులను, పసికిన్ = ఆలమందకు,

102 మృదువు = మెత్తనిది (ద్రౌపదికివిశేషణము) ఇది స్త్రీలింగమునందును 'మృదువు' అనియుండవచ్చును, రూపాంతరము 'మృద్వి' 'వోతో గుణవచనాత్' (ఉదంతమగు గుణవాచికి స్త్రీత్వవివక్షయందు ఙీష్ప్రత్యయము (ఈ) వికల్పము) మృదుః మృద్వీ—

(సిద్ధాంతకౌముది)

104 సైరంధ్రీవేషంబునన్ సైరంధ్రివేషముతో, సైరంధ్రియనగా—

శ్లో|| చతుష్షష్టికలాభిజ్ఞా । శీలరూపాదిసేవినీ
ప్రసాధనోపచారజ్ఞా । సైరంధ్రీపరికీర్తితా ॥

అరువదినాల్గుకళలను దెలిసి, మంచినడతగలిగి, రూపాదులతో నొప్పి, యలంకారాదివిధుల నెఱిగిన యొకపరిచారిక.

105 మలీమసవృత్తంబున పొంతఁ=మలినవర్తనముయొక్క సమీపమున, (చెడునడతవైపు) ఇందు 'న' కారంబు సూ - 'షష్ఠీతత్పురుషంబులందున గాగమంబువిభాషనగు' అనుసూత్రంబుచే వచ్చినది. అనుక్రోశకందనంబు= అనెడు గౌరవము.

106 మాలిని=మాలలుకలది. (దండలనుగ్రుచ్చుదాని)

107 కలపంబులు=పరిమళద్రవ్యములఁజేర్చి కలపినచందనములు,

108 పాంచాలికిఁ అనుచానికిఁ—అనుచోట 'రాహోశ్శిరః' అనుచోటునందువలె అభేదార్థంబున షష్ఠియనిభావము. పాంచాలివగు (పాండవుల) భాగ్యవనిగూఢాభిప్రాయము.

124 'పుత్రులు' పున్నామ నరకమునుండి రక్షించువారు వ్యుత్పత్తియందు 'తకార' ద్విత్వ ముండవలెను (పుత్త్రులు) అన్నవస్త్రాదులొసఁగి పాలించువారును, ఇతరులవలన రక్షించువారును అను వ్యుత్పత్తియందు 'తకార' ద్విత్వ మవసరములేదు. ప్రస్తుత మీపద్యమునఁ బ్రాసమునందు 'పుత్ర' పద మేకతకారముగాఁ బ్రయోగించుటయు సాధువనియే గ్రహింపనగు. మొదట వ్యుత్పత్తినే గ్రహింతుమన్నచో 'పుత్త్రులు' అని ద్వితకారముగాఁ బ్రయోగించి తక్కినచోటుల 'అనచిచ' అను సూత్రముచేఁ బాక్షిక తకార మొనర్చుకొన్నను భంగములేదు.

131 అంతిపురముచుట్టరికము — ఇట గ్రామ్యతాప్రసంగమున్నను సచమత్కారముగా నయ్యర్థమును స్ఫురింపఁజేయుటఁజేసి 'ఔదార్య' మన్నర్థగుణము నెఱుఁగునది. 'అగ్రామ్యత్వముదారతా'

(వామనాచార్యుఁడు)

134 ఎట్టిపాలసుండుఁ=ఎటువంటిమూర్ఖుఁడును,

135 అకొండుఁ=అకొందును. ఇట 'దు' వర్ణంబునకు 'డు' వర్ణంబు వచ్చెనని యెఱుఁగునది.

'క్షితిని నుత్తమపురుషంబుసెప్పుచోట, నంద మైయుండకుండు మాఱొక్కొందుననఁగ, నుండుమూర్తులనేన మాఱొక్కొందుననఁగ' భుజగకేయూర! కాశికాపురవిహార! (కవిసంశయవిచ్ఛేదము)

148 దప్పి=దప్పి—తెల్గునుడులలోఁబదాది దకారమునకుఁ బ్రాయికంబుగా 'డ' కారముపచ్చును. దగ్గఱ—డగ్గఱ, దిగి—డిగి, దెప్పరము—డెప్పరము,

ఇత్యాదులు, ఈపద్యము చిన్నిచిన్ని పదంబులతో హృద్యముగాఁ గూర్పఁబడుటంజేసి 'మాధుర్య' మను కావ్యగుణంబునకు లక్ష్యముగా నెఱుంగనగు.

సూ- పృథక్పదత్వం మాధుర్యమ్- (వామనాచార్యుఁడు)

161 ఉరియాడు చిత్తంబును త్తలంబు=ఊగులాడుమదియందలికలఁత,

162 కవటలు=పెద్దకొమ్మలు, ప్రబ్బు+కన్ = వ్యాపింపఁగా, లోని జొంపము=లోపలిగుబురు,

164 శస్త్రాస్త్రముల్-ఇట 'సూ-అజాద్యదంతమ్' ద్వంద్వసమాసమునందు అదంతమును అజాదియగు పదము తొల్తఁ బ్రయోగింపవలయునను నియమము కలదుకాన 'అస్త్ర' శబ్దమట్టిది యగుటచే దానికిఁ బూర్వప్రయోగము వచ్చి 'అస్త్రశస్త్రముల్' అని కావలసియుండఁగా 'శస్త్రాస్త్రముల్' అనుట యెట్లుపొసఁగునని శంకింపరాదు. 'ధర్మాదిష్వనియమః' ధర్మాదులయందు నియమములేదు, అను అనుశాసనముచే 'అర్థధర్మములు, ధర్మార్థములు' అను నుభయరూపములు సాధువులైనట్లే 'శస్త్రాస్త్రముల్, అస్త్రశస్త్రముల్' ఈ యుభయవిధరూపములును నిర్దుష్టంబులని యెఱుంగునది.

166 కైదువులు=ఆయుధములు,

168 అలందురి=దుఃఖించి (రూ) అలఁదురి.

170 మోపు=వింటనారిని,

172 గొనయములు=వింట నారులను, దొనలు=అమ్ముల పొదులు, ఇందు సంబోధ్యులు భీమ నకుల సహదేవులు ముగ్గురే గాన నాల్గవవాఁడు లేమింజేసి మొదట మూఁడుపాదంబులయందుఁ గ్రమముగాఁ బోషితమగు సంబుద్ధ్యంత ప్రయుక్తమగు సమతపీడ వలసివచ్చెను.

186 ఇభఘటలు=ఏనుఁగుల సమూహములు. 'కరిణాం ఘటనా ఘటా' అను కోశమువలన 'ఘటలు' అనఁగనే యేనుఁగు గుంపులనెడు నర్థము వచ్చుచుండఁగా 'ఇభ' శబ్దము పునరుక్తముగాదాయని యొకశంక. దానికి సమాధానమేమన. 'విశిష్టవాచక పదానాంసతిపృథగ్విశేషణవాచక పదసమవధానే విశేష్య మాత్రపరతా' (విశేషణ విశిష్టపదములకు వేఱుగా విశేషణవాచకపదము దగ్గఱనున్నపుడు కేవల విశేష్యపరముగనే యర్థము చెప్పికొనవలయును) అను నియమముచే ఇట 'ఘటలు' అను విశిష్టవాచక పదమునకు 'ఇభ' అను విశేషణవాచకపదము దగ్గఱనున్నది కాన 'సమూహములు'

అని విశేష్యమాత్ర పరముగనే యర్థము చెప్పవలయును. 'ఘటలు' అని ఒకే పదమున్నచో గజసమూహములనియు, ఇభాదిపదములతోఁ జేరియున్నప్పుడు కేవల సమూహములనియు నర్థమని భావము. కరిబృంహిత, కరకంకణాదులం దిట్లే చూచుకొనునది.

191 ఇందు ధర్మజుఁడు తమ కనృతదోషము లేకుండుటకు తాము పల్కినది కల్లయను విషయమును ముందే విరటునకు సూచించినట్లు కన్పట్టుచున్నది.

ఉన్నరూపు+అ, పల్కినన్నరులు ఎక్కడఁగలరు? సత్యమే పల్కెడు నర్జునుఁడున్న వెక్కడను లేఁడని వ్యతిరేకము. కనుక నేను చెప్పునది కల్ల. 'నరులు' అని బహువచన ముంచుటచే భీమార్జున నకుల సహదేవులు ద్రౌపదియుఁ జెప్పునవికూడఁ గల్లలేయని సూచన. మఱియు—ఉన్నరూపు+అ, నూ— 'ఒకానొకచో ఒకవిభక్తికి మఱియొక విభక్తియునగు' నను సూత్రముచే 'సుఖమున్నారు' అను స్థలంబునందువలె 'ఉన్నరూపు' అను చోటఁదృతీయార్థంబునఁ బ్రథమయని గ్రహించినచో 'ఉన్నరూపముతో' అని యర్థమువచ్చుటంజేసి మేము పల్కుట ఉన్నరూపములతోఁగాదు మారు వేషములతోననియు సూచితమగు చున్నది. ఇట్లే తక్కినచోటులఁ జూచుకొనునది.

192 మందహాసము చేయుచుఁ జెప్పుటచే మానుడువునది కల్లయనియు వెల్లడి యగుచున్నది.

193 'సత్యము చెప్పుట యెట్టివారికిని గష్టము' అనుటకు నిందుఁగాఁగల ములు పొందుపఱపఁబడియె.

195 ఈపద్యము మొదలుకొని 198 వ పద్యము చివరవఱకు ధర్మజుని మాటలయందు అర్థద్వయము స్ఫురించెడిని.

ద్విజుఁడ=బ్రాహ్మణుఁడను,

'ద్వాభ్యాంజాయతే' రెంటిచేఁబుట్టుచున్నాఁడు—(అనఁగా జన్మచేతను, ఉపనయనసంస్కారముచేతనని భావము) అనువ్యుత్పత్తిచే ద్విజశబ్దము బ్రాహ్మణక్షత్రియవైశ్యవాచకముగూడ నగునుగాన, ద్విజుఁడ=క్షత్రియుఁడనని సత్యముగూడఁ జెప్పికొనుటచే ననృతదోషములేదని భావము. ఇట్లే యంతట నెఱుంగునది. కురువిషయజాతుఁడ=కురుదేశమునందుఁ బుట్టి

నవాఁడను. కురువిషయ = కురుదేశమునఁగల పాండుమహారాజువలన, జాతుఁడన్ = పుట్టినవాఁడను, (ధర్మరాజుననుట) ధర్మసుతసఖుఁడన్ = ధర్మరాజునకు మిత్రుఁడను, రెండవయర్థమునందు 'రాహోశ్శిరః' అనుచోట రాహ్వాఛిన్నము శిరము (శిరము రాహువే) అనియభేదము చెప్పికొనినట్లు 'ధర్మసుతసఖుఁడన్' అనుచోటఁ గూడనట్లె సఖ్యభిన్నుఁడు ధర్మసుతుఁడు—అనఁగా (ఈ,నీ) సఖుఁడు ధర్మసుతుఁడే యని యర్థము చెప్పికొనవలయును.

పరివ్రజన, ఆశ్రమ, కలితుండన్ = యత్యాశ్రమముతోఁ గూడినవాఁడను, రెండవయర్థమునందు, పరివ్రజనాశ్రమ కలితుండన్ = అరణ్యమునందు నలువైపులఁ దిరుగుటచేనగు అలసటతోఁ గూడినవాఁడను, మనుజవల్లభ, యోగ్య, బహు, వినోద, కరుండన్ = రాజులకుఁ దగిన పెక్కుప్రొద్దుపుచ్చు పనులను జేయువాఁడను, రెండవయర్థమున, రాజులకు యోగ్యములగు పెక్కు వేడుకలను జేయువాఁడను, రాజార్హములగు రాజసూయయాగాది మహోత్సవములఁ జేయువాఁడననుట.

196 ద్యూతక్రీడకుఁ గొండొక నేతున్ 'నేరతున్' అనుక్రియలోని లుప్త 'ర' వర్ణరూపము. ఇందుభయత్ర అర్థము సమానము. బృహదశ్వుని వలనన క్షహృదయము గ్రహించుటచే నిప్పుడు జూదము బాగుగా నాడఁగలను. వెనుక సంతగాఁ జేతఁగామిచే మా జ్ఞాతులు కపటద్యూతంబున నా రాజ్యమంతయు నపహరించి మమ్ముఁ బరాభూతులఁ జేయఁగా నాసమయప్రకార మిటువచ్చితినని గూఢాభిప్రాయము.

197 'నృప ! నయవిద్యకున్' అని ప్రకృతార్థమున ఛేదము. నయవిద్యకున్ = నీతివిద్యకు, రెండవయర్థమున 'నృపనయవిద్యకున్' అని యేకపదము. రాజనీతివిద్యకు అనిభావము. ధర్మపరులసంగతిన్ = ధర్మాసక్తులతోడి చెలిమిని, రెండవయర్థమున, ధర్మశబ్దమునకు 'విల్లు' అనియర్థముకలదు గాన, 'ధర్మపరులసంగతిన్' అనగా విలుకాండ్రగుసోదరులకేయికను, అని హృదయము.

'పేరుకంకుఁడు' నా పేరు కంకుఁడందురని ప్రకృతార్థము. రెండవయర్థమున—'కంకశ్ఛద్మద్విజే ఖ్యాతో లోహపృష్ఠకృతాంతయోః' అనువిశ్వనిఘంటువువలన, కంకశబ్దమునకు 'యమధర్మరాజు' అను అర్థము కూడఁగలదు కాన. నేను యమధర్మరాజునని చెప్పుట. ధర్మరాజు యమధర్మరాజని చెప్పుట యెట్లన్న 'ఆత్మావై పుత్రనామాసి' (తానే పుత్త్రుఁడగును) అనుశ్రుతిప్రామాణ్య

యణులలో నొక్కఁడగు నరుని జెప్పుకతంబునఁ దదవతారమగు నర్జునుని తెలుపును. నరునియందలి బృహత్త్వము (గొప్పతనము) ఏమనఁగా కృష్ణ సఖత్వమని యెఱుంగునది... అట్లని 'బృహన్నరుఁడు' అని పుంలింగముండ వలయుఁగదా 'బృహన్నర' యని స్త్రీలింగమెట్లు వాడఁగున్నచో ఆకార గోపనార్థమిట స్త్రీత్వము స్వీకరింపఁబడియెనని తెలియవలెను. మొత్తము మీఁద 'బృహన్నల' అనుటచేఁ గృష్ణసఖుఁడనగు అర్జునుఁడని చెప్పినట్లయ్యెను.

234 శ్రేణి + చేయున్ = పరివేష మొనర్చును కౌశికున్ = ఇంద్రుని 'అథ కౌశికాః గుగ్గులూలూకవసులమునిశక్రాహితుండికాః' అను నానార్థని ఘంటువలనఁ గౌశిక శబ్ద మింద్రవాచక మగుచున్నది. ఇట భుజవక్త్రాక్షి ముఖంబులచే నింద్రుని మించుచున్నాఁడనుటచేఁ గొమరుఁడు తండ్రింబోలి యుండుం గాన నీతఁడింద్ర పుత్త్రుఁడగు నర్జునుఁడని మఱలి కవి గూఢముగా స్ఫురింపఁజేసి యానందము గలిగించుచున్నాఁడు.

235 భాస్వత్, కాండంబులు = ప్రకాశించెడు బాణములు,

238 'ఆఁడుదనంబు నిక్కముగాఁ గారసి చూచిన లేదు' అనుటచే నిజముగా నే నాఁడుదానను గాను, అర్జునుఁడననుట పుంస్త్వమున్, పోఁడిమి తప్పియున్నది' పౌరుషముకూడ సౌందర్యము చెడియున్నది యనుటచేఁ బ్రస్తుతము ప్రతిజ్ఞా ప్రకార మజ్ఞాతవాసము చేయవలయును గాన, పౌరుషమునకుఁ బ్రసక్తి లేదని భావము, నపుంసక జన్మము, అవశ్య భోగ్యము + ఐ, వాఁడిమి గల్గు శాపమునన్ వచ్చెన్' తప్పనిసరిగా ననుభవింపవలసినదై యీ పేడితన మ్మూర్వశీ శాపంబుచే వచ్చెను. ఊర్వశి తన కొలువులోనిది గాన నీతండ్రియగు నింద్రుఁడైన నామెను మందలించి నీశాపమును దొలఁగించలేక పోయెనా? అన్నచో — శాశ్వతిక షండత్వమును సంవత్సరాను భావ్యముగఁ దగ్గించెనే కాని 'పురాకృతకర్మ భావ్యము, ఎవ్వాఁడున్, నేర్చున్, ఏ తొలఁగన్, నైవస్, కన్' తొల్లిచేయఁబడిన యూర్వశీ ప్రార్థనా నిషేధకర్మముచే నవశ్య భోగ్యమగు శాపమును ఇంద్రుఁడైనను బూర్తిగఁ దొలఁగింప లేక పోయెనని రహస్యము. 'ఓర్వకపోవన్ వచ్చున్, ఏ' కనుక నీయాఁడు రూపు సహింపక తప్పదయ్యె ననుట.

240 దండలాసక నిగ్రహమున్ = దండము (కఱ్ఱ) త్రోసి నృత్యమును, మండలియున్ = మండలాకార నృత్యమును, ప్రెక్కణంబు తెఱంగున్ = అభి

నయముతోఁడి నృత్యము విధమును, పేరణంబున్ = కుండమీఁది నృత్యమును ఈపద్యమున శైశవపదముండుటచే శిశుత్వ క్రీడాయోగ్యముకాన నీయాటల నేర్చుకొంటినని గూఢాభిప్రాయము.

242 నట్టువొజ్జన్ + ఐ = నృత్యోపాధ్యాయనై,
243 పొచ్చెము = న్యూనత,
245 అల్లఁదనంబునన్ = మెల్లఁదనముతో, కడ వెడ = సూక్ష్మముగ నూఁగు = లేఁతఁ దనము, నిట్టలు = నిక్కుటలతో, (లేదా) స్థానములు, కప్పున్ = నలుపును,

262 'దామ గ్రంధియను వాఁడన్ దామము (హారము) వలెఁగంఠ స్థములగు నాయుర్వేద గ్రంథములుగలవారు — అనఁగా అశ్వనీ దేవతలని భావము. వారి పుత్త్రుఁడ నగుటచే 'ఆత్మా వై పుత్త్రనామాసి' అని నన్ను దామ గ్రంధి యందురు. అనఁగా నకులుఁడనని యభిప్రాయము. దామము వలెఁగంఠస్థములగు అశ్వశాస్త్ర గ్రంథములు కలవాఁడనగుటచే నన్ను దామ గ్రంధి యందురని ప్రకృతార్థము అశ్వ విషయంబు + అయిన విచక్షణత్వంబు, న + శ్వః (రేపు) యేషాంతే అశ్వాః రేపనుమాట లేనివారు యుద్ధములందఁ ప్రాణముల గడ్డి పోచగాఁ జూచెడు శూరులని భావము. తద్విషయికమగు పాండిత్యమని గూఢాభిప్రాయము.

267 'తన తమ్ములలోని వానిఁగాన్' నేను ధర్మరాజు తమ్ములలోని వాఁడను అని గూఢముఁగా జెప్పికొనుట.

273 అధిక, సమ్మానన, పూర్వము, కాన్ + కన్ = ఎక్కువ గౌర వింపఁజేయుట ముందుగలుగునట్లు, 'సమ్మానన' పదము — సంపూర్వకమన్ ధాతువునకుఁ బ్రేరణమునఁ ను ల్యుడంత (అన) రూపమని తెలియువలెను. సమ్మానము = గౌరవము, సమ్మాననము = గౌరవింపఁజేయుటయని యీరెండు పదంబులకు భేదమరయునది.

275 తలుగుల పొది = పసులఁగట్టెడు పలుపులమోపు, పెయ్యల దామెన = పాలు విడిచిన యావుల పెక్కు పలుపులుగల నిడిత్రాడు,

279 తొలఁగు + పోక + ఉండన్ = తప్పించుకొని పోకుండ.

284 'హీనకులుఁడన్' ఇది హీన నకుల పదములోని 'న' వర్ణచ్యుతిక రూప మనుకొన్నచో నకులునికంటెఁ జిన్నవాఁడనుఁ (సహదేవుఁడను) అను అర్థము స్ఫురించును.

286 'తంత్రపాలుండనఁబరంగినవాఁడ౯' పశువులబంధించెడు పెద్ద త్రాఁడు బాలించువాఁడనని ప్రకృతార్థము. 'తస్యవా క్తంత్రిర్నామానిదామాని' అనుశ్రుతివలన 'తంత్రి, (తంత్రీ)శబ్దమునకు వాక్కనియు నర్థముండుటచే (ధర్మజునియొక్క వాక్పాలకుఁడనని గూఢాశయము. పురాణించుట౯ జేసి= వర్ధిల్లుటచే, ఉంగిడి, అదురు, త్రిక్క, ఇయ్యవి పశువులకువచ్చు జబ్బులు,

291 కుఱుమాపుడుఁబుట్టంబు= చిన్నమాసినగుడ్డను,

294 తుఱఁగలి మెఱుఁగులు=ప్రకాశముగల మెఱుపులు,

298 గట్టువాల్గుదాన౯=సైరంధ్రిని (గట్టుపర్వతము) వలె స్థైర్యముతోఁ బ్రవర్తించుదాననని భావము.

301 తత్, జాలకముల౯=ఆకిటికీలగుండ,

310 సామినిర్గమంబుక=సగమెదురువచ్చుట,

313 'సైరంధ్రీశబ్దమునకు రాజమహిషి' యనియు నర్థముకలదుగాన నేను ధర్మజుని మహిషినను నర్థమును జెప్పినట్లయ్యెను.

317 'నాకుఁ బ్రాణంబుప్రాణమై నన్నుఁదన్న కాఁగభావించి యాదేవి గారవించు'ద్రౌపదీదేవి నన్నుఁ దన్న, గానేభావించుననుటచే నేనే ద్రౌపదినని సూచితము.

322 'కర్కటిగర్భముధరియించునట్లు'ఎండ్రిచూలుదాల్చినట్లు. కర్కటివమున్నగునవి వినాశకాలమునకే చూలుదాల్చుననుట 'అలీన లీకర్క టవేణుసారం భావినాశకాలే ఫలముద్భవంతి.'

333 ఇందన్నియు హరిహరనాథునకు సంబోధనములు.

బాంధవ, శాత్రవ, ఆకలిత, భావభవా=(భావమునుండి పుట్టినకళలవాఁడు అనువ్యుత్పత్తిచే భావభవశబ్దము మన్మథవాచకమగును) చర్మముగాను విరోధిగనుజేసికొనఁబడిన మన్మథుఁడు కలవాఁడా! మన్మథుఁడు హారికిఁబుట్టమును (కుమారుఁడు) హరునకు విరోధియునని భావము. భవ,పాశ, బంధ, సంబంధ, విరామ, రామ! సంసారపాశమను కట్టుయొక్క సంబంధము

తోను నాశముతోను రమించువాఁడా! అనఁగా హరిసంసారపాశబంధవ
తో రమించుశృంగారియనియు హరుఁడు సంసారపాశవిరామముతో గమిం
చువిరాగియనియుఁ దాత్పర్యము. పరిపక్వ, వివేక, నిరూఢ, భక్త, హృత్
గ్రంథ, విభేదనా!=పరిపాకము చెందినజ్ఞానముచే నిశ్చలులగుభక్తులయొక్క
హృదయమందలి ముడులను (అట్టిసంశయములను భేదించువాఁడా! ఈ
యత్ర అర్థముసమానము—'భిద్యతే హృదయ గ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయా
అనుదాని భావముసూచితము. పరిమాణదూర!= కొలతలేనివాఁడా
'అణోరణీయాన్ మహతో మహీయాన్' (చిన్నవానిలో మిక్కిలిచిన్నవాఁ
పెద్దవానిలో మిక్కిలి పెద్దవాఁడు) అనిభావము.

దుఃఖ, ఇంధన, పావకాయిత, సమీక్షణ! దుఃఖములు, అను చి
గులకు అగ్నిహోత్రునినంటి చూపుగలవాఁడా! చైత్త, మహాత్, అద్భుత
ప్రభా!=మానసికమగు గొప్పకాంతి (వెలుఁగు) కలవాఁడా!



# విరాటపర్వము - ద్వితీయాశ్వాసము

## టిప్పణి.

---

(1) శ్రీమత్ = సంపదగల, అపాంగ, ఆలోకన = క్రేఁగంటిచూపుల యొక్క, ధామ = కాంతులయొక్క, సకృత్ సంగ = ఒకసారికలయికచేతనే, లబ్ధ = పొందుకొనిన, తాదృశ = అట్టి, విభవ = ఐశ్వర్యముచేత, ఉద్భాస = ప్రకాశించెడు, ఆశ్రితలోకా! = భక్తజనముకలవాఁడా ఒకమారు హరి హృన్నాథుని క్రేఁగంటిచూపులుపడినంతనే భక్తజనులు మహైశ్వర్యసంపన్నులగుదురని భావము.

(3) తాల్మి = ఓర్పు, పులిలోట = సంకోచము.

(7) అగ్గలించి = అతిశయించి, బాహు = బాహువు, సూ. రాహు బాహుశబ్దంబులకంతట వువర్ణకలోపంబు వైకల్పికము. (ప్రౌఢవ్యాకరణము)

(14) కృత, పరికర, బంధుండు + ఐ = చేయఁబడిన నడికట్టు కట్టుకొనుటగలవాఁడై

(15) ఉపలాయిలోన్ = మల్లవిజ్ఞానములో, తోరహత్తము = మల్లబంధవిశేషము, సీసాన = ఇదియొకమల్లబంధము,

(17) కచ్చ = కాసె,

(18) మండి = ఒకకాలు నేలమోకరించుట

(19) పెలుకుడి = విలవిలపోయి, తాళంబు = మల్లురయొకపట్టు.

(22) ఏఁడుకాలంబు = సంవత్సరకాలము,

(23) అక్కజము = అధికము, ఇందలినాల్గవపాదములోని 'ఐ'అనునది కతిగియను నర్థంబునవచ్చినది. 'కతిగియనుచోట నైనయని పలుకవచ్చునందురు— ఆనందరంగరాట్ఛందము. ఇందు— 'హత్తిపై నెక్కొనుచూపు గ్రమ్మరుపనేరక' యనుటచేఁ గామదశలలో మొదలిటిదగు దృక్సంగము చెప్పఁబడియె. 'ఊరకనిల్చె' ఇత్యాదులచే స్తంభాదిసాత్త్వికభావములు కీచకునియందు వర్ణితములయ్యెను.

(24) ఉడిలకొనుచున్ = పరితపించుచు, ఇందు రూపకాలంకారము చక్కఁగా నిర్వహింపఁబడినది.

(26) సంక్రందన సూతికిన్ = జయంతునకు (అర్జునునకనియు గూఢము) ప్రబ్బదె = అతిశయింపదా ?

(27) కనుకలిన్ = చూచుటచే, నేరిమి = నేర్పు, ఇందలి గీతము ద్రౌపదియందలి సౌకుమార్యాతిశయము నిరూపించెడిని. మనుచరిత్రములోని 'నేరెటేఁటియసల్ దెచ్చి నీరజాప్తు' అనుగీత = మిద్దాని కనుకరణమని తోఁచుచున్నది.

(28) 'మన్మథుఁడు + ఐనన్' ఇందలి అప్యర్థకముచే త్రిలోకసుందరుఁడగు మన్మథుఁడే ద్రౌపదికి వలచుననుటచే నామె లోకోత్తరసౌందర్యమభివర్ణితము. విరహతాపముఁ బాపికొనుటకు మరుఁడు తనచిగురుగొడుగును బువ్వుటమ్ములపాదులను సైతము సెజ్జచేయించుకొనుననుటచే నతని విరహాతిశయపరకాష్ఠ చెప్పఁబడియె. 'మన్మథుడు' ఈపదమునే యిందువాడుటచే నెల్లరమనస్సుల మథించి విరహతప్తులఁ జేయువాఁడనునది ఇప్పుడు 'ఆత్మవత్సర్వభూతాని' అనుమాట యెఱుకపడెనని యభిహితమయ్యె.

30 'ఠీవిఁబొందఁగాంచు తెఱఁగు నాకెయ్యది యొక్కొ' ఇందలి విసంధి(విరుద్ధసంధి) కృతాసభ్యస్మృతి కవికాలమున లేదని తోఁచెడిని. ఇట్లే 93 వ పద్యమునన

ఉ॥ 'ఉత్పలగంధి! నన్నుడుగు మొల్లనుబంపుముకల్లుదేర

ప్రథమాశ్వాసములోని 221 పద్యమునను

క॥ 'అనుటయు మోఱకుచందం
బున మోమడ్డముగదల్చి' ...

దెలియునది. కవికాలమునందసభ్యస్మృతిలేకున్నను ప్రకృతమసభ్యస్మృతిహేతువగుటలేదా? యన్నచో శిష్టలోకపరిగృహీతములగుటచే సుభగా భగినీ శివలింగాదులంబోలె నసభ్యతాభావనలేదని యెఱుంగునది.

'సంవీతస్యహిలోకేన నదోషాన్వేషణంక్షమమ్। శివలింగస్యసంస్థానే కస్యాసభ్యత్వభావనా' (లోకపరిగృహీతములందున సభ్యస్మృతిహేతుకంబగు నశ్లీలత్వము నుడువరాదు. శివలింగమన్నచో నెవ్వనికిని నసభ్యార్థస్ఫూర్తియుండదుగదా? కావ్యాలంకారసూత్రవృత్తి - 'భగినీభగవత్యాది సర్వత్రైవానుమన్యతే' (భగినీభగవతీత్యాదిపదము లెల్లచోటుల నంగీకృత

ము లే) ఆచార్యదండి. 'మఱవకనుష్ఠించునది సమంజసబుద్ధిచేన్' ఇత్యాద్యదు లందు నిదే సమాధానమని యెఱుంగనగు.

31 ఉగ్గడించుట = పలుకుట, ఓరగించుట = త్రిప్పుట, అప్పళించుట = మెత్తుకొనుట, కళవళించుట = కలఁతపడుట.

'తనుఁగనిరోసిన దెందంబుఁగల తరుణిచేన్' అనుటచే ద్రౌపదికిఁ గీచకునియెడ మనస్సులేమికతనఁ గీచకునకు ద్రౌపదియెడఁగల శృంగారము రసాభాసమని యెఱుంగునది.

ఏకత్రైవాను రాగశ్చే త్తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపివా, యోషితో బహుసక్తిశ్చే ద్రసాభాసస్త్రిధామతః' (ప్రతాపరుద్రీయము)

33 అన్యహేతుకంబులగు ద్రౌపదీగత స్వేద, స్తంభ, కంప, వైవర్ణ్యములను వివేకహీనుఁడగు కీచకుఁడు తనయెడ ననురాగమును సూచించు కామవికారంబులగు సాత్త్వికభావంబులుగాఁ దలఁచి యుప్పొంగెనని భావము.

సాత్త్వికభావము లెవ్వియన.

గీ॥ 'సత్త్వమనమనోవృత్తిజంబులైన
భావములు సాత్త్వికము లష్టభావితములు
స్తంభ, రోమాంచ బాష్ప వైస్వర్యకంప
విలయమైవర్ణ్య ఘర్మసంజ్ఞలఁదనర్చు'

(కావ్యాలంకారచూడామణి)

35 పొలి + పోవక + ఉక = వ్యర్థముగానీక ఎసలారుతారక = అతిశయించెడు కనుగ్రుడ్లతో, 'నయనం ప్రధానమ్' 'సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్' అనుట. ఇంద్రియములన్నింటిలోఁ గన్నే ముఖ్యమైనదని భావము. ఎలమి = వికాసము. కీచకుఁడు నిశ్చలదృష్టితో ద్రౌపదిని దనివితీఱఁజూచెనని తాత్పర్యము.

'నయనంప్రధాన'మను ... ఇచట 'నయనంప్రధాన'మ్మను — అని ద్విరుక్తిరావలదాయన్నచో.

సూ - అనుకరణంబునందహామాదుల మకారంబునకు ద్విరుక్తివిభాషనగు [బాల-వ్యాక] అనుసూత్రముచే వైకల్పికమని యెఱుంగునది.

37 మున్నెవ్రుందసులతన్ = కోమలమగు తీగవంటి మేనునుండి, ... లే మెఱుంగుల మొత్తంబుపఁ = లేఁత కాంతుల సమూహము నెదు సేన,

'అనంగుపట్టియాడెదు జంత్రంబుపగదినుండె' ధాతుజవిశేషణపూర్వ వ్యవహితకర్త్రప్రథమకుయొక్క షష్ఠియనియెఱుంగునది.

42 కుట్టాడుచున్ = చుట్టిచుట్టి తిరుగుచు,

45 అప్పళించున్ = పూనును, (ప్రయత్నించును)

ఇట, స్త్రీలుపురుషుని సంబోధించునపుడువాడు "ఓయన్న" అను సంబుద్ధిచేతనే కవి కీచకునియందు ద్రౌపదికి వలపులేదనుటను సూచించుచున్నాఁడు.

50 ... పతిపత్నిన్ = భర్తలు గలదానిని,

54 "నీచు" = నీచుఁడు. వృద్ధు, వృద్ధుఁడు, అన్నట్లు

గీ|| వెలయుమూర్ఖధూర్తవృద్ధ నీచపదాళి
కొనరుదుత్వమైననుత్వమైన ...

(అనందరంగరాట్ఛందము)

55 దుర్వార, ఉద్వృత్త, బాహు, విక్రమ, రస, అస్తోక, ప్రతాప, స్ఫురత్, గర్వ, అంధ, ప్రతివీర, నిర్మథన, విద్యా, పారగుల్ = వారింప రానిపూనికగల భుజముల పరాక్రమరసముచేఁ దక్కువగాని తేజస్సుతోఁ బ్రకాశించువారును, గరువముచేఁ గన్నులు కానని ప్రతివీరులను(శత్రువులను) నశింపజేయుటయను విద్యయందుఁదుదఁగాంచినవారును విశేషణోభయపద కర్మధారయము. లేదా "తేజస్సుతోఁ బ్రకాశించువారు అనునదియుఁ బ్రతివీరులకే విశేషణము చేయవచ్చును. అట్లేని గంధర్వులయందు బలాతిశయ ప్రకటనమెట్లని శంకింపరాదు. "తజ్జయాన్నాయకోత్కర్ష వర్ణనంచ ధినోతినః" అనియాచార్యదండి నుడివినట్లు లిట్టిబలవిక్రమ సంపన్నులఁ దెగటార్చువాతనుటచేతనే గంధర్వుల ప్రతిమానబలులనుట స్పష్టము.

60 దందడి = తఱచు,

64 ఎడమేని నెత్తావి = యౌవనముగల మేనియొక్క నిండుపరిమళము. సుడియన్ + కన్ = చుట్టిచుట్టి వీవఁగా, సొగయించుమాటలన్ = సుఖించు పలుకులతో,

67 ...త్తో౯=చిగురుటాకులఁబోని శాలి(వేళులతో౯, సంధి=కలయికను చేసి=చేసికొని. అంబుజంబులపైనెత్తి = తామరలనెత్తిపైన, అనికొండొకయర్థము స్ఫురించెడిని, ఇందుసీసపాదంబులకు గీతపాదముల యందుఁ (గమముచూపఁబడినది.

74 మల్లడిగొనుచు౯=పరితపించుచు,

78 కావలము=పాపము, ఇయ్యది కీచకునికి విశేషణముగానఁ గావలముగలవాఁడని చెప్పవలయును. కావలము కీచకుఁడని చెప్పినప్పుడు కీచకుఁడు కావలముకలవాఁడుగాని కావలము కాఁడు కనుకఁ దాత్పర్యము పొసఁగమిచేఁ గావలముగలవాఁడను నర్థము లక్షణచే వచ్చునని భావము. మహాకవులు మిక్కుటమగు కావలముకలవాఁడను నర్థమునఁ గావలమని ధర్మధర్మలకభేదముగా వాడుచుంటయుఁ గలదు.

'తేజసస్తువయస్సమీక్ష్యతే'

ఇచ్చట "తేజసః" (మహాకవికాళిదాసు) అనఁగా నెక్కువ (ప్రతాపముగలవానికని ధర్మధర్మలకభేదము చెప్పికొనకతప్పదు.

81 కొఱలును=ఉండును—(పొందును)

83 (కేళ్ళుటికెదుర వాలుగసోగల౯ = ఎగిరిపడెడువాలుగ చేపల పొడవులను,

85 చిట్టుముట్టాడుచు౯=పెనఁగులాడుచు,

86 చుబ్బచూఱ=మిక్కిలి కొల్ల (చూఱ+చూఱ)

88 వఱవట్లు=[వట్టులు+వట్టులు] మిక్కిలియెండుటలు

93 దుష్యత్, పరివార, యోగ్య, పరిచారముమైక౯ = తగనిపని చేయుపరిజనమునకుఁ దగినసేవతో

94 మత్, పతుల, అసన్నిధి౯=నామగలకు దూరమున, మత్పతుల అ+సన్నిధి౯=నామగలచేరువనే, అనియు స్ఫురించును.

95 ఇందుఁ దమస్వీయవృత్తము స్ఫురించుచున్నది. సాధులు=సజ్జనులగు పాండవులు, నెమ్మిగ౯=క్షేమముగ, చేరి=ఇటకువచ్చి, నిజ, స్థిర, వృత్తము=తనుస్థిరమగు ఉనికి, దుష్టకోటిచే = దుర్మార్గులగు దుర్యోధనాదులసమ... [illegible] ... వసించినన౯ బాధితము కాకుండ మీయొద్ద నివసింపఁగా, దుర్యోధనాదులు

పాండవులు యొనిక యెఱింగిన సమయప్రకారము లింగ ... కష్టాలు అనుభవింపవలసి వచ్చెననుట, పెద్దవారు = విరటుండును తాను, దిక్కు + ఐ ధరియించి, వారికిన్, ఒకయాపద, పుట్టక + ఉండన్ కాచుట, ఒప్పు + ఐ = శరణై మాకేకష్టములేకుండ రక్షించుట యొప్పిదమై, "ధరన్ కీర్తికిన్ ఎక్కుడై" అజ్ఞాతవాసానంతరము భూమిపైఁ బ్రసిద్ధికెక్కును, అపాయము చేసినన్, నింద, పుట్టదు + ఏ = కీడుగావించినచోఁ దరువాత నిందవచ్చునని భావము.

౯౮ 'ఎవ్వారేని యింటికిన్' ఇది 'ఎవ్వనియేనిముఖామృతాంశు బింబమ్మున' అనువాగనుశాసను ప్రయోగమువంటిది. అప్యర్థకమునకు సమాసమధ్యపాతమిట విశేషము.

'ఒకటికిన్ నమ్మఁబంపఁదగునె, ఇందలియశ్లీలత కవినాఁటికి లేదని యెఱుంగనగు. కాళిదాసు తన యభిజ్ఞానశాకుంతలమున — దుష్యంతుఁడు తన్నుఁ దోడ్కొనిపోవునో పోఁడోయని డోలాయమాన మానసయగు శకుంతలను నూరడింపఁ జేయుటకు 'విశ్వస్తాభవ' [ఆయనచెప్పినట్లు తోడ్కొనిపోవునుగాన - నమ్మకముగలదానవగుము - అని చెలికత్తెచేఁ బల్కించినాఁడు. ఆయన కాలములో 'విశ్వస్తావిధవేసమే' అనునది ప్రచారములోనుండినచో అప్పుడే వివాహితయగు శకుంతల నిట్లాశీర్వదింపఁడుగదా అట్లే మనకాలంబున దశ్లీలములుగానున్న కొన్ని పదములు తిక్కనాదికాలంబుల యందు సభ్యార్థములుగనే యున్నవనియూహింపనగు. ఏకవులైనను వారివారి కాలంబులం దశ్లీలప్రతీతిజనకంబుల మానుదురే కాని భావికాలాశ్లీల ప్రతీతిజనకంబుల మానసాధ్యముకాదుగదా.

'ఎవ్వారేని యింట కెద్దియేనొకటికి' ననుటచే తనదేహాకపటప్రవర్తనము ద్రౌపదికి విదితమైనట్లుగాఁడ స్ఫురించెడిని. అయిన నేలపోయినన్నచోఁ దనపాతివ్రత్యమహిమచే సంరక్షితనుగాఁగల ననునమ్మిక చేతనని తెలియునది.

102 ... కాంచన, చషకంబు=బంగారుగిన్నెను.

చషకంబు=కల్లుత్రాగుగిన్నె,

110 తరణియున్=సూర్యుఁడును,

113 వెమ్మతాపంబున్=కాల్చివైచువేఁడియు,

116 తృష్=దప్పి—ఇది 'తృట్' శబ్దమునకు ఆబంతరూపము —
'ఆప్ చైవ హలంతానాం యథా వాచా నిశా దిశా' [కౌముది]

117 'నీదుసరససంభావనమెయిన్' దప్పిదీర్చుటకు రసమువలయుఁ గాన నీశృంగారరసముతోడి మన్ననచే, అనుట,

118 ... ఓలము=చాటు (వృక్షాదులచేమఱుఁగుచోటు)

121 తోడింబడక=చలింపక,

122 'నీవసుమరుగా నొనరించెదన్' ఇట 'కాన్' అనుదానిచే 'నీవు'+అ' అనుకర్మము, అభిహితంబగుటచే ద్వితీయరాలేదనియెఱుంగునది.

126 ... ఆతనిచేన్=అతనిచేతిని,

133 నితాంత=మిక్కిలి. దంతపీడన=పండ్లుకొఱుకుటచే, గటత్=ధ్వనిచేయుచున్న, ఆస్యరంగ=ముఖమనెడు నాట్యస్థానమునందు, వికట=వంకరయగు, భ్రుకుటీ=బొమముడియందు [నటియందు] చటుల=చంచలముగా, ప్రవృత్త=ప్రారంభములగుచున్న, నర్తన=నాట్యములను, ఘటనా=కూర్పుటలయొక్క, ప్రకార=విధములచే, భయద=వెఱపుగొలిపెడు, స్ఫురణా=స్ఫూర్తిచే[తోఁచుబడిచే] పరిణద్ధ=కట్టఁబడిన, మూర్తి+ఐ=ఆకారముగలవాఁడై, కీచకుఁడు ద్రౌపదినివెన్నాఁడు సమయమునభీమసేనుని మొగమను నాట్యస్థలంబున భ్రుకుటియనునటి దంతపీడనధ్వనులను మద్దెల మ్రోఁతలతోఁ జంచలములును వికటములునగు నర్తనవిశేషంబులఁజూపుచుఁ జూపఱకు వెఱపుగొలిపెనని భావము.

134 గండరించిన రూపంబుకరణిన్=పుట్టినరూపమువలె,

135 పల్లటిల్లన్=ఎఱ్ఱఁబడఁగా

136 అసేవ్య, క్ష్మాజముల్=సేవింపబడరానిచెట్లు ఉప+ఆశ్రిత+ప్రతతికిన్=చేరువనాశ్రయించిన వారిసమూహమునకు,ఇందుఁ గీచకవధప్రవృత్తుండగు భీమసేనుని సమయభంగభీతిచే ధర్మజుండవ్యాపదేశవైఖరిని మందలించుట హృద్యముగానున్నది. ఇందు భీమునకు నొకయర్థమును దదితరులకు వేఱొకయర్థమును దోఁచును. వలలుండు, ఎక్కుడన్, చూచెన్, ఒండెడన్, అసేవ్యక్ష్మాజముల్, పుట్టువు+ఏ, [భీమునకుఁదోఁచు నర్థము) 135 వ గద్యములో, భీముఁడు కీచకుని నివారణచేయకపోవుటచే విరాటునిగూడఁ దన యఱకలోని వానిఁగాఁ జేర్చుకొనినట్లు చెప్పఁబడుటచేఁ గ్రుద్ధుఁడై భీమసేనుఁడు విరాటుని గీచకుని నుభయులను జంపుననుకొని ధర్మజుఁడిట్లు చెప్పుచున్నాఁడు.

8

ఓ భీమసేనా ! ఏలచెట్టువైపుచూచెదవు ? ఈచెట్టు పెఱికితోస యీ
కీచకుని నీతనిబావమఱఁదినా చంపఁజూచెదవు. ఈ రాజు సేవ్యక్ష్మాజము—
ఈయజ్ఞాతవాసమునం దరణ్యవాసదుఃఖితులమగు మనకు సేవనీయమైన
వృక్షమువలె బసయిచ్చిన మహానుభావుఁడు. ఫలితంబు+ఐ, వరశాఖలు+
ఒప్పన్+కన్+అనల్పప్రీతిన్, సంధించుచున్, విలసత్,+ఛాయన్, ఉపా
శ్రిత ప్రతతికిన్, విశ్రాంతిన్, కావింపన్, కలయిభూజమున్, సంపన్నుఁడై
బంధుగులఁబోషించుచు నాశ్రయించిన మనబోటివారికి, నిలువనీడయిచ్చుచు
ఛాయావృక్షమువలెనున్నవాఁడు. 'వంటకట్టియలకై, ఖండింపన్, కాన్,
ఏటికిన్' అట్టిమహాపురుషుని దెసపై నుపకారములనేమియున్ దలంచక
మనకు సమయభంగమగు [illegible]
చిన్ననేమెన్ని ద్రుంపవచ్చునే ? అట్లు సేయుట యాశ్రితవ్యహానసన్నాహము
మగును. ఇతనియింటిలో మనము తలదాచుకొంటిమి కాన మనకుసమయభంగ
ముకాకుండుటకుఁగాని యితని ప్రియము సేయుటకుఁగాని యితద్బంధువగు
కీచకుని ద్రుంచుటయుఁ బ్రస్తుతము చితముకాదు. అంతగా నీకుఁ ద్రుంప
వలయుననియే యున్న, ఒండెడన్, అసేవ్య, క్ష్మాజముల్, పుట్టవు + ఏ
హస్తినాపురములో భ్రాతృత్వాదులనేనియు నెన్నక మనసర్వస్వము నపహ
రించిమనకు నిలువనీడ లేకుండ జేసిన నీ సతరువులన్ బోలు దుర్యోధనాదు
లు లేరా ? చంపెదనని ప్రతిజ్ఞయుఁజేసితివే వారిని. సమయానంతరము చంపస్తు
ము. వరశాఖలు, ఒప్పన్, కన్, అనల్ప, ప్రీతిన్, సంధించుచున్,
అజ్ఞాతవాసానంతరము తన ముద్దుకూఁతురగు నుత్తరను మన యర్జున
పుత్రుండగు నభిమన్యునకు నొసంగి యిట్లేముందును గావించుచు వరశాఖలు
విజృంభింపఁగా మనకుఁ బ్రీతిఁగావించు కీచకుని ద్రుంపఁదగదు.

(తదితరులకుఁ దోఁచునర్థము)

వలలుండు, ఎక్కడన్, చూచెన్, ఒండెడన్, అసేవ్యక్ష్మాజముల్,
పుట్టవే ? ఈవంటలవానికి ఈచెట్టుయెక్కడగానిపించెను. ప్రొయ్యిలోనికిఁ
గావలయునన్న నేఱొకచోట శుష్కవృక్షంబులు లేకపోయెనే. ఇయ్యది
పండ్లతోను మంచికొమ్మలతోను విస్తరించి యాశ్రయించిన బాటసారులను
నుపయోగపడుచు నిల్వనీడనిచ్చుచున్నది. దీనినివంటకట్టియలకై కొట్టుట
యుచితముగాదు.

139 పంబినకోపమున్ అతిశయించిన కీచకుఁడు,

140 ఈసీసపాదములలోఁ బ్రథమద్వితీయ తృతీయపాదంబులు ధర్మజభీమార్జునులఁగూర్చియుఁ జతుర్థపాదము నకులసహదేవులఁగూర్చియుఁ జెప్పఁబడెనని తెలియవలయును.

'ఎవ్వారియాంధ్రులు' దేశ్యంబునంగొన్నియెడల మహన్మహత్వార్థక బహువచనాంతనామంబులపై మరల బహువచనప్రత్యయము చూపట్టెడు.
(ప్రౌఢవ్యాకరణము)

142 ఇందు ద్రౌపదికి స్వగుణావిష్కరణము దోషముకాదా? యని శంకింపరాదు. లేనిగుణంబులఁ జెప్పికొనుట తప్పుగాని ఆగుణంబులు సత్యములైనప్పు డవ్వానిఁ బేర్కొనుట తప్పుగాదు.

'స్వగుణావిష్క్రియా దోషో నాత్రభూతార్థశంసినః' (సత్యమును జెప్పునాయనునకుఁ దనగుణములఁ దాను వెల్లడించుకొనుట తప్పుగాదు) కావ్యాదర్శము.

143 'రాజా రాష్ట్రకృతం పాపమ్' కనుకఁ గీచకుఁడొనర్చునపరాధమునకు విరాటుఁడును బాధ్యుఁడని యెఱుంగనగు.

148 ద్రౌపది సభ్యులఁజూచుమాడ్కిఁ బతులఁ గనుంగొనుచు గంధర్వులపైఁ బెట్టి తమ్ము నన్నదానికి ధర్మజుఁడిం దుత్తర మొసగెను.

150 కులసతుల గఱువచందము = కులకాంతల గొప్పతనము,

152 ధర్మజుఁడు తన్ను 'నాట్యంబు నూపుచాడ్పు'న (150వ పద్యము) అని యనెనని ద్రౌపది సాభిప్రాయంబుగా నీ పద్యమున నెత్తిపొడుచుచున్నది.

'నాదు వల్లభుండు నటుఁడు' నాభర్తవగు నీవు నటుఁడవు. వేషము వేయువాఁడవు. సన్న్యాసి వేషమూనితి వనుట. 'పెద్దవారి యట్ల పిన్నవారుఁ' పెద్దవాఁడవగు నీవలెనే నీతమ్ములుఁగూడ నటులే. 'కానఁ బతుల విధముఁ గాక యే శైలూషిఁగాననంగరాదు' కనుక మగలవలెనె నీవన్నట్లు నేనుఁ గూడ నటినే.

శైలూషి = ఆటకత్తెను. (నటిని)

153 'కులసతుల గఱువచందము దొలఁగఁగ నిట్లునికిఁ దగునె' అన్నందుకు సమాధానమిందుఁగలదు.

154 అన్నజంతకుఁ = అనఁ ధూర్తురాలికి,

158 'అతండవినీతిఁ జేసినను' ఇందు గ్రామ్యతా ప్రసంగమును సభ్యముగాఁ జెప్పుటచే అగ్రామ్యత్వరూపమగు ఔదార్యమను అర్థగుణంబని యెఱుంగునది.

బలుగు ... ... కావ్యాలంకారసంగ్రహము

220 రాజదేవులున్ = రాజులభార్యలు,

237 ఉరులన్ = విడిపోవుటను,

253 ఆలము = ఉపేక్ష, ఆఱడి = వ్యర్థము,

264 'అడరునీదుకోర్కికనురూపమెట్టిది యట్టిభోగభంగిననుభవింపు' నీదుకోర్కికిఁ దగినట్టి భోగభంగిననఁగా పరసతీగమనవాంఛకుఁదగిన మరణము ననుభవింపుమని గూఢార్థము

పరస్త్రీగమనమువలన ఆయుర్హానికలుగుననుటకు

శ్లో॥ 'ఆయుః క్షయశ్రీశ్చ కులాపకర్షః సన్తాపశాన్తా చ
నిందార్థహానిలఘుతా విగతిః పరత్ర
స్యాదేవయద్యపిరతేన పరాంగనాయాః'

265 'ఉత్తమమిత్తెఱంగునను నొంటిమెయిన్
దగనీవువచ్చినన్'

నీవుఒంటరిగా వచ్చినచో పరస్త్రీగమనవాంఛా ఫలమగుమరణంబు ననుభవించుటకు నర్తనశాలయే ఉత్తమముగా నుండునని హృదయము.

268 'ఈవునుబొమ్ము - ఏనును నాదగుపనిసేసెదన్' నీవుచనుము - నేనునుభీముని చెంతకేగి నీవధకుఁదగుయత్నమొనర్తునని గూఢభావము.

271 ఈపద్యమునందు సార్థబిందుక, నిరర్థబిందుకప్రాసము గూర్పఁబడినది.

ఁకటిశబ్దములోనరసున్నయున్నది. తక్కువపానిలోలేవు.

'ఒకటి కరసున్నగలిగి మూఁటకవి లేక
ప్రాసములు లఘుపదములై పైనిచెల్లుఁ
గృతులనొక్కొక్కచో నదియెట్టులనిన
నిఁకను నెఱిఁగింతుఁ జెప్పఁడీసుకవులనగ

(ఆనందరంగరాట్ఛందము)

277 అటిమటిన్ = సంభ్రమముతో,

282 వెఱ = భయము, చఱవన్ = ఆక్రమించఁగా,

పటిపటి = పీడింపఁబడినది, ఎయిదన్ = పొందఁగా,

286 ఒప్పనివారు = సరిపడనివారు,

287 బాహిరపోవక=బయలుపడక

295 ... చిడిముడిపాటు=తొట్రుపాటు,

299 ఓహటించి=వెనుకాడి, ఉరియాడున్ = చలించును,

303 అలంత=బాధ,

306 చెట్టుపల్ =ఱెక్కలను, పచరించి=ప్రసరింపఁజేసి,

310 కాయ్వు = =అనురాగమును,

318 ఇనుడు= (నానా) సూర్యుఁడు, రాజు, పడమటిదెసయను కాంత, సూర్యుడుదనకడకరు దెంచుటచే ననురాగమును బొందెనో యనఁగ గెంజాయవహించెనని యుత్ప్రేక్షయుఁ, బశ్చిమాశాంగనయనుచోట రూపక మును, ఇనుఁడు [నాథుఁడు] తనచెంగటకువచ్చినచోఁ గాంతయనురాగము దాల్చునను అప్రస్తుతస్ఫూర్తిచే సమాసోక్తియను నలంకారమును, ఈపద్య౦ బునఁగానవచ్చెడిని,

321 పెనుమిట్ట=పెద్దమెట్ట(ఉన్నతభూమి)

ఓలము=వృక్షాదులచేమఱుఁగుచేయఁబడినచోటు,

323 ,అతఁడు పెండ్లికేఁబిలిచినయట్లు' ఈయుపమానము భీమసేనుని కుఁ గీచకునితోడిపోరిదముపైని మక్కువను వెల్లడించెడిని,

325 తమోఁదూషితంబున్ = అజ్ఞానముచే దూషింపఁబడినది, (సత్రిసా శాలాపరమున) చీఁకటిచేఁగానరానిదియు' దుర్నిరూపంబుఁ=నిశ్చయింప రానిదియు, (ఉభయత్రసమానము)

విషమకావ్యంబునుంబోలె నస్పష్టాలంకారంబును, కావ్యమునందు అలంకారస్పష్టతయుండవలయునని కతిపయాలంకారికుల నియమము.

గుణాలంకారసహితౌ । శబ్దార్థౌదోష వర్జితే
గద్యపద్యోభయమయంకావ్యం కుర్వీతకీర్తయే

([ప్రతాపరుద్రీయం])

సాధుశబ్దార్థసందర్భం । గుణాలంకారభూషితమ్
స్ఫుటరీతిరసోపేతం । కావ్యంకుర్వీతకీర్తయే

[వాగ్భటుఁడు]

శబ్దార్థౌసాలంకారౌకావ్యమ్

[హేమచంద్రుడు]

ఇతి శ్వ్రశ్రేయుః కావ్యం తదదోషీపుకృతాచ వాగర్థా,

[ఆంధ్రశబ్దచింతామణి]

ఇత్యాదులచేఁ గావ్యమున కలంకారములు ముఖ్యములనియెఱుంగునది.

నవజనానశాలపదమున—అస్పష్టాలంకారమనగా చీకటియగుటచే స్పష్టములుకాని అలంకరణములు గలదియని యర్థము.

337 'నాపోలి(క)యాఁడు దాని వెదకియు నెయ్యెడనైన నీకుఁబడయవచ్చునె?'

నావంటియాఁడుది నీవు ముల్లోకముల వెదకిన దొరకదని యెఱుంగుమని పైకి స్వసౌందర్యప్రకటనము. నావలె గూఢపురసాకారయగునాఁడుది యని గూఢాభిప్రాయము.

338 'నాయొడలు సేర్చినప్పుడు

నీయొడలెట్లగునో దాని నీవెఱుఁగవు'

అనఁబోవుచు కూరలచవిచూడుగనేల? నీశరీరము నాశరీరముఁతోఁ జేర్చినప్పుడెట్టిపారవశ్యమును బొందునో నీకే తెలియును లెమ్మని తన సరసత్వప్రకటనము.

నాశరీరముతోఁ గలియఁబడినపుడు నీశరీరమెట్లు తుత్తునియలగునో గాంచెదవు చేసటిలోని నీకే విదితమగునని గూఢాభిప్రాయము.

'నన్నేయబలనో డిచి గాఁ జేయఁదలంచితిని తప్పు సేసితిగంటే'

నన్ను సామాన్యస్త్రీలతోఁబాటుగా నెంచుచున్నావు, ఇది తప్పు. నా సౌందర్యమునకు నెవ్వరు సరిగారని పైకిఁ దోఁచుభావము. మహాబలుండనని ప్రసిద్ధిగాంచిన భీమసేనుని నన్నే స్త్రీయని తలఁచుటనీయపరాధమని లోపలి భావము.

339 'ననుముట్టి నీవు వెండియువనితల సంగతికిఁ బోవువాఁడవె'

నీవు నన్నుఁ దాఁకినచో మత్తసుస్పర్శనసౌఖ్యంబునఁ బరవశుండవై యున్యకాంతల సాంగత్యముపేక్షింపవని బయటికిఁ గానిపించుభావము. భీమసేనుఁడనగు నన్ను ముట్టి బ్రతికిమగలనీవు వనితలరగులమునకుఁ బోవు. అని లోనియభిప్రాయము.

'తను వేఁబడ సినఫలమేమి, కనియెదవి

దచిత్తభవవికారములెల్లన్'

నీవే ననుఁజూచి మన్మథవికారములకు లోనుగానిచో నేనింతటి చక్కని శరీరమునుదాల్చి నందులకు ఫలముండునా ? అని పైకిఁ జెప్పుట. ఇప్పుడే నీవు నాచేవధింపఁబడుచు మానసికవికారముల నెల్ల ననుభవింతువు. నేనీ తనువును (స్త్రీశరీరమును) దాల్చినందులకిదే ఫలమని లోపలనున్న భావము.

343 మేఁ + మేఁ = శరీరముతో శరీరముతో, ఒండొరుల మేనులతో)

345 ... అగపాటు = కనఁబడుట,

347 బీఱు + పోవక = వృథాపోకుండ,

364 నిష్పృతి, పణ్య, ఆపణ, పణార్పణ, వికాసా = మోక్షమనెడు అమ్మఁదగువస్తువునకు అంగడివీథివలెనున్న పాదపద్మములతోఁ బ్రకాశించువాఁడా ! హరిహరులపాదపద్మములను అంగడికిఁ బోయినచో ముక్తియను క్రయ్యము దొరకునని భావము.

365 సుర, పరివృఢ, చూడా, శోభి, రత్న, అంశు, వీచి, స్ఫురణ, సుభగ, పాద, అంభోజ, సంచార, కేళీ, పరిచయ, కలనా, లబ్ధ, వ్యయాతీత, సౌఖ్య, ఉత్తర, మునిజన, హృత్, మాద్యత్, మరాళ, ప్రతానా ! = ఇంద్రునియొక్క జుట్టునందు రాజిల్లు రత్నముల కాంతితరంగముల ప్రకాశముచే నందమగు నడుగుఁదామరలందుఁ దిరుగుటయనుయాటయందు అభ్యాసమొనర్చుటవలనఁ బొందఁబడిన యవ్యయమగు సౌఖ్యముచే శ్రేష్ఠములగు మానిజనుల మానసములనెడు మదహంసల సమూహముగలవాఁడా! ఇట హరిహరులపాదమునం దంభోజత్వారోపణమునకను రూపముగా మానిజన మానసములందు మరాళత్వారోపము చేయఁబడెను.

సురపాలకులు హరిహరనాథుని పాదములకుఁ దలతో మ్రొక్కుటచే వారిచూడామణులకాంతులు పాదములపైఁ బ్రసరించి జలతరంగములవలె నుండఁగా నందుహరిహరనాథుని పాదములు పద్మములఁబోలియున్నవని యా నప్పాదపద్మములనిత్యసంచారము చేయుచు నిరతిశయ సౌఖ్యముల ననుభవించుచు మానిజనమానసములు హంసలవలెఁ గ్రీడించుచున్నవనియు భావము.

ద్వితీయాశ్వాసము,

సంపూర్ణము.

శుం .... .... ....

శుద్ధి .... .... ....